ఆగస్టు 5వ తేదీన గొప్ప విడుదల!

మాలాసిన్హా * ధర్మేంద్ర * తనూజా * రెహమాన్ & జానీవాకర్ నటించిన

గురుదత్ ఫిలిం ప్రయివేట్ లిమిటెడ్ వారి

# "బహారేఁ ఫిర్ భి ఆయెంగి" [హిందీ]

సంగీతం : ఒ.పి. నయ్యర్ * దర్శకత్వం : షాహిద్ లతీఫ్



## అశోక్ * ఆషా * ప్యారడైజ్

హైదరాబాద్ షాలిబండ (హైదరాబాద్) సికిందరాబాద్

ప్రత్యేకాకర్షణ

కీర్తిశేషులైన గురుదత్ స్మారక చిహ్నంగా రెండు రీళ్ళ "శ్రద్ధాంజలి" కూడా ఈ చిత్రంతో చూపబడును. గురుదత్ సినిమా జీవిత విశేషాలు ఈ "శ్రద్ధాంజలి"లో చూడవచ్చును.

—Vijaya Release

| | |
|---|---|
| ధీరేంద్రనాథ్ పాల్ | ★ మొగలుదర్బారు కుట్రలు (సంక్షిప్తనవల) |
| డాక్టరు చంద్రశేఖర్ | ★ నాటక యుగంధర్ విరచితనాటకోపనిషత్తు |
| బలివాడ కాంతారావు | ★ అశాంతి |
| పాలగుమ్మి పద్మరాజు | ★ ఖండసరి చక్కెర-కాశీమజిలీలు |
| పవని నిర్మలప్రభావతి | ★ ఉదయకిరణాలు (పెద్దకథ) |
| శీలా వీర్రాజు | ★ నీడపట్టు మనిషి |
| రాచకొండ రంగనాథశర్మ | ★ ఏది సాంప్రదాయం |
| బుజ్జాయి. | ★ డుంబు-పక్కింటి కుక్క (బొమ్మల కథ) |
| కౌసల్యాదేవి | ★ చక్రవాకం (సీరియల్) |


ముఖచిత్రం: హమ్మయ్య! వాన వెలిసింది!!

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య

వచ్చే సంచికలో – మూడవభాగం
'మొగలుదర్బారుకుట్రలు'


యువ సాలుచందా - 12-00

దీపావళి ప్రత్యేక సంచికతో - 16-00

యువ, పోస్ట్ బాక్స్ 216, హైదరాబాద్-1



మీరు జులై యువలో ప్రచురించిన "మొగలుదర్బారు కుట్రలు" నవల చాలా బాగున్నది. నన్నెంతో ఆనంద పరచినదికూడా.

కొల్లా వెంకటేశ్వరరావు
—గుంటూరు

జులై 'యువ' మాసపత్రికలో "తెలియని విలువలు", 'రాజీ' కథలు నన్నెంతో ఆకర్షించినవి. చక్రవాకం సీరియల్ చాలా బాగున్నది. డుంబు కథలు ఇంకా నవ్వొచ్చేవి వేస్తే ఇంకా బాగుంటుంది.

ఎన్. జానకీనాగమణి, హైదరాబాద్

జూలై సంచికలో ప్రచురించబడిన "తెలియని విలువలు" కథను చదువుచున్నంతసేపు హృదయాన్ని కదిలించివేసింది. రచన అమోఘంగావుంది.

గడ్డం కృష్ణారావు
ఛత్రపురం (గంజాం జిల్లా).

జూలై నెల 'యువ'లో అవసరాల నారాయణరావుగారి 'రాజీ' అన్నకథ నా కెంతో నచ్చింది. 'వలయం' 'తెలియని విలువలు' ఈ సంచికకు వన్నె తెచ్చినవి. 'యువ' సంచికకు నా అభివందనములు.

నూతలపాటి సుబ్బరామయ్య
జమ్మలపాలెం.

జూలై సంచికలో "మొగలు దర్బార్ కుట్రలు" చాలా బాగావున్నది. మీ పత్రికకు, రచయితకు నా ఆభినందనలు తెలిపేది.

వి. రోహిణీకుమార్
కల్లూరు.

మీరు ప్రచురించిన "తెలియని విలువలు" కథ నన్ను ఎంతగానో ఆకర్షించినది. ఇంతచక్కటి కథ వ్రాసిన "ఊర్వశి"గారికి నా అభినందనలు. "ఉదయకిరణాలు", "చక్రనేమి" సీరియల్స్ కథలుకూడా చాలా బాగున్నాయి. ఇంతచక్కటి కథలు ప్రచురించినందుకు మీకు నా అభివందనములు

కుమారి కాజ వెంకటలలిత
విజయవాడ.

జూలై నెల యువలో అవసరాల నారాయణరావ్‌గారి "రాజీ" కథ చాలా బాగుంది. "డుంబు" ఎగ్జిభిషన్ కడుపుబ్బ నవ్వించింది.

మామిడన్న వెంకటసుబ్బారావు
కొత్తగూడెంకాలరీసు.

# దీపావళి ప్రత్యేక సంచిక

(పరాభవ సంవత్సరం)

ప్రతి సంవత్సరం వలె ఈ సంవత్సరం కూడా యువ దీపావళికి ప్రత్యేక సంచిక ప్రచురించబడుతుంది. ఈ సంచికలో ప్రచురణార్థం రచయితలు తమతమ రచనలు ఫుల్‌స్కేప్ అరటావు సైజులో 10 పేజీలకు మించకుండా ఆగస్టు 25 లోగా పంపగోరుచున్నాం. రచన కాగితానికి ఒకే పక్క వ్రాయాలి.

సంపాదకుడు



రక్తి, భక్తి మేళవించిన
ధన్యజీవుల
పుణ్య చరిత్ర
భారత్ ఫిలిమ్స్
భక్తపోతన
నిర్మాత
స్క్రీన్ ప్లే, డైరెక్షన్
టి.విశ్వేశ్వరరావు * జి.రామినీడు
నవయుగ

# Now Running to Crowded Houses



O.P. RALHAN'S

PHOOL AUR PATTHAR

EASTMANCOLOR

MUSIC RAVI LYRICS SHAKEEL



Starring: MEENA KUMARI
DHARMENDRA
SHASHI KALA

*Simultaneously at*

NAVRANG, PRABHAT & ASHA—Hyderabad
AJANTA — Secunderabad

(PIONEER) – Movies Release

Yuva, (Telugu Monthly)

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు : చక్రపాణి

సంపుటి 14 ఆగస్టు, 1966 సంచిక 2


భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడాలని, ఉద్యోగాలు ఇతర రాష్ట్రాలలోకూడా సంపాదించుకోవా లనేవారు తప్ప, అందరు భారతీయులూ కోరారు. అనేక ఆందోళనల తరువాత, ముఖ్యంగా ఆంధ్రుల ఆందోళనవల్లనూ, ఆంధ్రుల త్యాగాలవల్లనూ భాషాప్రయుక్త రాష్ట్రాలను ఏర్పరచడానికి కేంద్రప్రభుత్వం సమ్మతించడమూ, 1956 నవంబరు 1 నుంచి భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడడం జరిగింది. అయితే, ఆనాడు మహారాష్ట్రులకూ, గుజరాతీలకూ భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడలేదు. దానికి కారణం, బొంబాయి నగరంలో వ్యాపారమంతా తమ చేతిలో పెట్టుకుని, కేంద్రప్రభుత్వంలో పెద్ద హోదాలో వున్న గుజరాతీ ప్రముఖులు. కాని, మహారాష్ట్రులుకూడా ప్రబల ఆందోళన జరపడంవల్ల, బొంబాయి రాష్ట్రాన్నికూడా భాషాప్రయుక్తంగా విభజించి, మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలను ఏర్పరచడం, 1960 మే 1న జరిగింది. దానితో భారతదేశమంతా ఒక విధంగా భాషాప్రయుక్తంగా విభజింపబడి, భాషారాష్ట్రాలు ఏర్పడినట్లే.

భాషాప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటు చెయ్యడంలో, సరిహద్దుల విషయంలో చాలా అన్యాయాలు జరిగాయి. ఈ విషయంలో ఎక్కువగా నష్టపడినవారు ఆంధ్రులు. ఆంధ్రులు ఎక్కువ సంఖ్యలోవున్న కొన్ని ప్రాంతాలను ఆంధ్రప్రదేశ్‌లో కలపకుండానే, ఆంధ్రప్రదేశ్‌ను ఏర్పాటు చేయడం జరిగింది. అయినా ఆంధ్రులు ఏవిధమైన గొడవా చెయ్యలేదు. కాని, ఆంధ్రప్రదేశ్‌లోవున్న తిరుత్తని తాలూకాను తమకు ఇచ్చి వెయ్యమని తమిళులు గొడవచేస్తే, ఆంధ్రులు అంగీకరించడమూ, ఆ తాలూకాను మదరాసు రాష్ట్రానికి అప్పగించడమూ జరిగింది. అంతే కాని ఇతర రాష్ట్రాలలో వుండిపోయిన ఆంధ్ర ప్రాంతాలను ఆంధ్ర ప్రదేశ్‌లో కలపమని ఆంధ్రులు అడగలేదు. ఆంధ్రప్రదేశ్‌లో నివసిస్తూ వున్న అల్పసంఖ్యాక వర్గాలవారికి ప్రత్యేకంగా వారి మాతృభాష నేర్చుకోవడానికి సౌకర్యాలనుకూడా కలిగించింది, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం. ఇలాంటి సదుపాయాలను, ఆంధ్రప్రదేశ్‌కు పొరుగున వున్న ఒరిస్సా, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, మైసూర్, మదరాసు రాష్ట్ర ప్రభుత్వాలు కలిగించకపోయినా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మాట్లాడ లేదు. ఇది రాష్ట్రేతరాంధ్రుల క్షేమంపట్ల ఉదాసీనత కావచ్చు; తగాదాలు మాని ఏర్పాటయినంతవరకు ఆ రాష్ట్ర సౌభాగ్యంకోసం కృషి చేద్దామనే సద్భావం కావచ్చు; కాని, మన ఇరుగుపొరుగు రాష్ట్రాల వారుమాత్రం, అలాంటి సద్భావాన్ని ప్రదర్శిస్తున్నట్లు లేదు. తిరుపతిని ఎలాగైనా తమకు భుక్తం చేసుకుందామని తమిళులు ప్రయత్నం చేస్తున్నారు. ఉత్తరోత్తరా ఆంధ్రులు ఆందోళన చెయ్యకుండా, తమ రాష్ట్రాలలో వున్న ఆంధ్రు లందరినీ వారి మాతృభాష నేర్చుకోకుండానూ, వారి మాతృభాష తమ రాష్ట్రభాష అని రికార్డులలో ఎక్కించడానికీ ఇరుగు పొరుగు రాష్ట్రాలవారు కృషి చేస్తున్నారు.

ఈనాడు, మహారాష్ట్రలోని కొన్ని ప్రాంతాలు తమ రాష్ట్రంలో కలిపివేయాలని మైసూరువారు ఆందోళన చేస్తున్నారు. కన్నడ భాష

మాట్లాడేవారు అధిక సంఖ్యలోవున్న ప్రాంతాలన్నిటినీ మైసూరు రాష్ట్రంలో కలపాలని ఆందోళన చేస్తున్న కర్ణాటులు, తెలుగు భాష మాట్లాడేవారు అధిక సంఖ్యలోవున్న ప్రాంతాలను, మైసూరులో అన్యాయంగా వుండిపోయినవాటిని, ఆంధ్రరాష్ట్రానికి ఇచ్చివెయ్యడానికి ఎందుకు ఆలోచించడంలేదు?

కోలారు జిల్లా తెలుగుజిల్లా. ఈ జిల్లాలోని ప్రజలలో నూటికి అరవైమంది, తెలుగు మాతృభాషగా గలవారు. తక్కినవారిలో సగం మంది తెలుగు బాగా మాట్లాడగలవారు. అసలు తెలుగు తెలియనివారు, ఈ జిల్లా జనాభాలో నూటికి పదిమందికూడా లేరు. నిజానికి, 1956 నవంబరు 1 న భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడినప్పుడే, కోలారు జిల్లాను ఆంధ్రప్రదేశ్‌లో కలపవలసింది. కాని, కోలారు జిల్లా మాది, మా రాష్ట్రంలో కలపండి అని అడిగి, సాధించగల ఆంధ్రనాయకులు ఆనాడు లేకపోయారు. అంతేకాదు, మధ్యప్రదేశ్‌లోని చాందా, బస్తర్ జిల్లాలుకూడా అంతే. మనం పట్టుబట్టి అడగనందున యీ జిల్లాలు మనకు రాకుండాపోయినవి.

కోలారు జిల్లాలోని బంగారము, బస్తర్ జిల్లాలోని రాగి, ఇనుము, బొగ్గు, చాందాలోని కలప ఆయా రాష్ట్రాల సౌభాగ్యానికి ఎంతో పనికివస్తున్నాయి. మనకు రావలసినవాటిని ఇన్నాళ్ళూ మనం వదలిపెట్టాము.

రాష్ట్ర సరిహద్దుల విషయంలో ఇతర రాష్ట్రాలవారెవరూ ఏ గొడవా చెయ్యకపోతే, మనం గొడవ ఆరంభించడం మంచిది కాకపోవచ్చు. కాని, మైసూరు ప్రజలు ఆందోళన జరిపి కన్నడభాషా ప్రాంతాలు ఎక్కడవుంటే వాటిని తమరాష్ట్రంలో కలపమని కోరుతూ

వుంటే, యీ ఆందోళన ఫలితంగా, ఆ సరిహద్దుల పరిశీలనకు ఒకకమిష నును నియమించడానికి కేంద్రప్రభుత్వం సుముఖంగా వున్నప్పుడు, మన హక్కులను వదలిపెట్టి కిమ్మనకుండా వూరుకున్నామంటే, మన తిరుప తినీ, అనంతపురం జిల్లాలోని కొన్ని తాలూకాలనూ పోగొట్టుగొనే ప్రమాదం వున్నది. అంచేత, మన రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలు మన చెయ్యిజారిపోకుండా వుండాలంటేనూ, ఆంధ్రులు ఎక్కువగావున్న ప్రాంతాలు ఇతర రాష్ట్రాలలోనివి, ఆంధ్రప్రదేశ్‌లో కలియాలంటేనూ ఆంధ్రులు ఆందోళన చెయ్యడానికి ఇదే అదను.

మైసూరు ప్రజల ఆందోళన ఫలితంగా మైసూరు సరిహద్దులను సవరించడానికి కేంద్రప్రభుత్వం సుముఖంగా వున్నప్పుడే, ఆంధ్రులు కూడా తమకు రావలసిన ప్రాంతాల విషయంలో ఆందోళన జరిపితే, ఆ ఆందోళన ఫలిస్తుంది ఇప్పుడు మాట్లాడక ఊరుకుంటే, ఎన్నడూ మన తెలుగుప్రాంతాలు మన రాష్ట్రంలో కలియడం జరగదు.

ఆంధ్రనాయకులు తమలో తాము పోటీలుపడి, తగాదాలుపడడం మానుకుని, రాష్ట్ర శ్రేయస్సును దృష్టిలో వుంచుకొని, ఇతరరాష్ట్రా లలో తగిన సౌకర్యాలు లేకుండా నివసిస్తున్న తెలుగువారు ఆంధ్ర ప్రదేశ్‌లోకి వచ్చేటట్టుగా, సరిహద్దుల సవరణకు కృషిచెయ్యడం చాలా అవసరం. ప్రస్తుతపు తరుణాన్ని పోగొట్టుకొన్నామంటే, మనం చాలా నష్టపడతాము.

# చిత్రవార్తలు



రాష్ట్రపతి శ్రీ రాధాకృష్ణన్‌గారు న్యాయమూర్తి శ్రీ కె. సుబ్బారావుగారిచే భారతదేశ ప్రధాన న్యాయమూర్తిగా ప్రమాణస్వీకారం చేయిస్తున్నారు.



ఉపాధ్యక్షులు డాక్టర్ జకీర్‌హుస్సేన్ ఆఫ్ ఘనిస్తాన్ సందర్శించినప్పుడు కాబూలులో సరిహద్దు గాంధీ ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్‌ను కలుసుకున్నప్పుడు...

---

జూలై 3 న ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి మద్రాసు రాష్ట్రంలో తిరుచిరాపల్లిలో చిన్నతరహా ఆయుధాల ఉత్పత్తి కర్మాగారానికి ప్రారంభోత్సవం చేశారు.






.. ధీరేంద్రనాథ్‌పాల్ ..

## రెండవభాగం

అసలు యుద్ధాలే అనర్థదాయకమైనవి. అందులోనూ మొగలు సామ్రాజ్యానికి అన్నివిధాలా హానికరమైన యుద్ధం సన్నద్ధమయింది. పాదుషా తన కొడుకు పైకే యుద్ధానికి తరిలాడు. ఒక మహాసేన ఆగ్రానుంచి అట్టహాసంగా బయలు దేరింద. ఒక గొప్ప ఏనుగుపైన బంగారు అంబరీలో కూర్చుని జహాంగీరు సేనలకు ముందు కదిలాడు. ఆయన వెనకనే పరిచారికలతోసహా నూర్జహాన్‌కూడా బయలుదేరింది. ఆమె వెనుకగా మరొక ఏనుగుమీద షాజాదా షరియార్, బలవంతాన బడికివెళుతున్న పిల్లవాడిలాగా ఉన్నాడు. పరిస్థితులకు బానిస ఐపోయిన ఆ దౌర్భాగ్యుడికి యుద్ధోత్సాహం ఏమాత్రమూలేదు. సైన్యంవెంట పల్లకీలలో బేగంమహాలకు చెందిన పరిచారికలూ, వేశ్యాజనమూ ఉన్నారు. మొగలుసేనల వెంట స్త్రీజనం ఉండటం రివాజే.

ఆగ్రానుంచి బయలుదేరిన సేనలు సిక్రీనగరం సమీపంలో విడిశాయి. అక్కడ పాదుషాకోసం, రాజభవనానికి ఏమీ తీసిపోని శిబిరం సిద్ధంగా ఉన్నది. దాన్ని అందమైన చెట్లుగల స్థలంలో నిర్మించారు. చూస్తుండగనే నిర్జనస్థలం ఒక మహా నగరంగా మారింది.

కరీమ్ బతికే ఉన్నాడనీ, భీమసింహుడూ, మహాబత్‌ఖాన్ మొదలయినవాళ్ళు

అతనిపక్షాన సేనలను పోగుచేసి పాదుషాను ఎదిరించటానికి సిద్ధంగా ఉన్నారనీ, వారితో పోరాడటానికే పర్వేజ్ కొద్దిరోజులక్రితం సేనతోసహా వెళ్ళాడనీ లోకానికి తెలుసు. ఇప్పుడు జహంగీరుపాదుషా తన కొడుకైన పర్వేజ్‌కు సహాయంగా వెళ్ళుతున్నాడని అందరూ అనుకున్నారు. అలా బయలుదేరినవాడు మధ్యలో సిక్రీలో ఎందుకు శిబిరం వేయించాడో ఎవరికీ అర్థంకాలేదు. బహుశా పాదుషాకూడా ఎరిగిఉండడని వాళ్ళనుకున్నారు. మిగిలిన విషయాలలోలాగే నూర్జహానే ఈ ఏర్పాట్లన్నీ చేయించిఉండవచ్చు.

అది నిజమేకూడా. సైన్యాలు సిక్రీనగరం వెలుపలదిగిన రాత్రికిరాత్రే, సైన్యాలు సిక్రీనగరం చుట్టూ దుర్భేద్యమైన కోటలాగా నిలవాలనీ, ఎవరూ నగరం దాటిపోవడంగాని, నగరంలోకి రావడంగాని జరగరాదనీ ఆమె ఉత్తరువు లిచ్చింది. నిశ్శబ్దంగా సిక్రీనగరం చుట్టూ సైనికవ్యూహం ఏర్పడిపోయింది.

విమలసింహుడు లూలియాను దుర్మార్గులనుంచి రక్షించినరాత్రే ఈ సిక్రీముట్టడి జరిగింది. ఆసంగతి అజితసింహుడికి తెలియదు. అతను లూలియాను ఇంటివద్ద దించి, లూలియాపైకి ఆ దుర్మార్గులను పంపకంచేసినవా రెవరై ఉంటారా, ఏ దురుద్దేశంలో అలా చేసిఉంటారా అని ఆశ్చర్యపోతూ తన స్థానానికి తిరిగి వెళ్ళుతూండగా, ఒక రాజపుత్రయోధు డతనికి ఎదురుగా వచ్చి, "స్త్రీ వ్యామోహంలో పడి నువ్వింకా ఇక్కడ ఉన్నావా ?" అని అడిగాడు.

అతను మారువేషంలో ఉన్నప్పటికీ భీమసింహుడని విమలసింహుడు గుర్తించాడు. అతనిముఖం వికసించింది. "నువ్వన్నమాట నిజమే, మిత్రమా. ఈ అమ్మాయి నా మనసు పూర్తిగా కొల్లగొట్టింది " అన్నా డతను.

"ఒకచెంప ముంచుకొస్తున్నది. ప్రణయానికిది సమయంకాదు. రేపో, ఎల్లుండో యుద్ధం జరుగుతుంది. పాదుషా, నూర్జహానూ సైన్యాలతో కదిలివచ్చారు," అన్నాడు భీమసింహుడు.

''రానీ, నష్టమేం ? మనకు కావలసింది పర్వేజ్ ఓడటమేగా ?'' అన్నాడు విమలసింహుడు.

"పర్వేజ్ ఓడటమా, గెలవటమా అన్నదికా దిప్పటిసమస్య. ఓడినా, గెలిచినా అతను చావటం ఖాయం."

విమలసింహుడు నివ్వెరపోయి, "మిత్రమా, నరవధ తలపెట్టావా ? నా కలాటిది సరిపడదు," అన్నాడు.

"నరవధ తలపెట్టినది నేనుకాదు, నూర్జహాను. అతను యుద్ధరంగంలో చావని



పక్షంలో ఆమెచేతిలో చచ్చితీరుతాడు." అంటూ భీమసింహుడు నూర్జహాన్ ఎత్తుగడను విమలసింహుడికి వివరించిచెప్పాడు. ఆమె తన అల్లుడైన షరియారును చక్రవర్తి చెయ్యటానికి మిగిలిన ఇద్దరు షాజాదాలనూ నిర్మూలించ నిశ్చయించింది. ఆమె నగరంచుట్టూ సైన్యాన్ని పెట్టి ముట్టడివేసిన సంగతి కూడా భీమసింహుడు బయటపెట్టాడు. ఇద్దరూకలిసి ఒక నిర్జనమైన ఇంటి పైభాగాని కెక్కి, మొగలుసైనికులు సిక్రీనగరాన్ని చుట్టుముట్టడం కళ్ళారా చూశారు.

"నూర్జహాన్ ఏమాత్రమూ కాలయాపన చెయ్యకండా మనని కొర్రిచ్చులాగా చుట్టేసింది," అని విమలసింహు డంటూఉండగానే, పక్కనున్న కప్పుమీదినుంచి ఒక కోతి వాళ్ళదగ్గిరకి దూకింది. ఇద్దరూ నిర్ఘాంతపోయిఉండగా ఆకోతి వికారంగా నవ్వి, మనిషిభాషలో. "మీ కీ ఉత్తరం తెచ్చాను," అంటూ లేచి నిలబడి, విమలసింహుడి కొక ఉత్తరం ఇచ్చింది.

"ఎవరు నువ్వు ?" అని అతనడిగాడు.

"నాపేరు దులాలీ."

"ఓహో. నువేనా, దులాలీ ? ఏమి టీవింతవేషం ?"

"పరిస్థితి ఏమీ బాగాలేదు. పాదుషాసేనలు నగరం చుట్టుముట్టాయి; తప్పించుకు బయటపడటం చాలాకష్టం," అన్నది దులాలీ.

భీమసింహుడు ఉత్తరం తీసుకుని చదువుకుని. "మిత్రమా, నువ్వు తక్షణమే మరియాబేగంమహలుకు వెళ్ళు," అన్నాడు.

"నీమాట ఏమిటి ?" అన్నాడు విమలసింహుడు.

"నేను చల్లగా మార్వారు సైనికులలో కలసిపోతాను. నువ్వు వెంటనే వెళ్ళిపో."

విమలసింహుడు రెండడుగులు వేసి ఆగి, "నాకు ప్రాణాపాయం జరిగినా సరే, నా లూలియాను కాపాడుకోక తప్పదు. ఏం చేసేటట్టు ?" అన్నాడు.

'నా బొందెలో ఊపిరి ఉండగా లూలియా కే అపాయమూరాదు. మీరు భయపడ కండి." అన్నది దులాలీ. లూలియాను రక్షించటానికి సిద్ధంగా చాలామంది ఉన్నారనీ, మొగలులు సిక్రీనగరం ప్రవేశించటానికి యత్నిస్తే తగినశాస్తి అవుతుందనీ, గౌహర్జాన్ అనేవా డొకడు నూర్జహాన్ గూఢచారిగా ఇంతకు పూర్వమే ఆ ప్రాంతానికి వచ్చాడనీ కూడా దులాలీ చెప్పింది.

"ఆ గూఢచారి ఇప్పు డెక్కడ ఉన్నాడు ?" అని విమలసింహు డడిగాడు.

"సలబత్ ఖాన్ ఇంటికి వెళ్ళాడు," అన్నది దులాలీ

"కొంప మునిగింది."

"మరేమీ భయంలేదు. ఖాన్ వాడికి అందేవాడుకాడు."

మొగలుసైనికుల కలకలం అంతకంతకూ చేరువగా వినిపిస్తున్నది. విమల సింహుడూ, భీమసింహుడూ, దులాలీ తలా ఒకదారినా అదృశ్య మయూరు.

సూర్యోదయం అయేసరికల్లా సిక్రీనగర దిగ్బంధం పూర్తి అయింది. ఆ సేనలకు అధిపతి అయిన మహమ్మద్ టోకీ నగర సింహద్వారాని కెదురుగా తన శిబిరం ఏర్పాటు చేయించుకున్నాడు; మసీదునుంచి మౌల్వీ ఎలుగెత్తి దైవప్రార్థన చెయ్యడం విని ముస్లిముసైనికులు అక్కడికి పోవాలని తహతహ లాడారుగాని, టోకీ వారికి అనుమతి ఇవ్వలేదు.

టోకీ సింహద్వారం దగ్గర మంచిఆసనంలో కూర్చుని సలబత్ ఖాన్ కోసం కబురుపంపాడు. ముసలిఖాన్ కర్రసహాయంతో నడుస్తూవచ్చి సేనాధిపతికి వందనం చేశాడు. సలబత్ ఖాన్ గురించి నూర్జహాన్ ఇచ్చిన ఉత్తరువు క్రూర మైనదే అయినా, ఆ వృద్ధుణ్ణి చూస్తుంటే టోకీకి గౌరవించ బుద్ధిపుట్టింది. అతను ఖానుకు ఆసనం చూపిస్తూ, "శ్రమ యిచ్చినందుకు క్షమించండి. ప్రభువు ఆజ్ఞ పాలించక తప్పదుకదా !" అన్నాడు.

పాదుషావారు వచ్చారన్న శుభవార్త గడచినరాత్రే తనకు తెలిసిందనీ, వారిని చూసి ధన్యుడు కావాలని ఉన్నదనీ సలబత్ ఖాన్ అని, "వారు నగరంలోకి ఎప్పుడు వేంచేస్తారు ?" అని అడిగాడు.

"తెలియదు," అన్నాడు టోకీ.

"మరి మీ సైనికులందరూ ఇలా—''

"నగరాన్ని ముట్టడించమనీ, ఎవరినిగాని లోపలికీ, బయటికీ వెళ్ళనివ్వరాదనీ పాదుషావారి ఆజ్ఞ."

"అలా ఎందు కాజ్ఞాపించి ఉంటారో? ఈ నగరంలో నేనూ, మసీదులో మౌల్వీతప్ప ఇంకెవరూ లేరే? మౌల్వీనికూడా నగరందాటి పోనివ్వరా?"

"ఎవరూ వెళ్ళరాదు. పాదుషావారి ఆజ్ఞానుసారం నేను మిమ్మల్ని కొన్ని విషయాలడగాలి. దయచేసి నిజం చెప్పండి. ఈ నగరంలో మీరూ, మౌల్వీకాక ఇంకెవరెవ రుంటూన్నారు?''

"నా వెంట మహమ్మద్‌జాన్, హమీదా అనే ఇద్దరు నౌక ర్లున్నారు."

"ఇంకెవ్వరూ లేరా?" అన్నాడు టోకీ ఖాన్‌కేసి తీక్షణంగా చూస్తూ.

"అయ్యో, ఈ నగరంలో ఎంతోకాలంగా ఉంటున్నాను. నాకు తెలియకుండా ఇక్కడ పరాయివా శ్శెవరూ ఉండలేరు.''

"ఉమ్రావ్ సాహెబ్, అబద్దాలాడి చిక్కుల్లో పడకండి. మీఇంట ఇంకోమనిషి కూడా ఉంటున్నాడనే మాకు నమ్మకంగా తెలియవచ్చింది."

''అబద్ధం.''

"అబద్ధమో, నిజమో త్వరలోనే తెలుస్తుంది. మీఇంట మీ కుమార్తో, మనమరాలో కూడా ఉంటున్నది కాదూ?"

''లేదు."

"మీకు కుమార్తె కాకపోతే మీ నౌకర్లలో ఎవరో ఒకరి తాలూకుపిల్ల మీ వెంట ఉండటం లేదా?"

''మా పనివాళ్ళబిడ్డ అయినా నాకు తెలియాలిగా?''

"అయ్యో. ఈ నగరమంతా వలవేసినట్టు గాలించబోతున్నాం. నిజం చెప్పండి. మీ ఇంట మీ సేవకులుతప్ప ఇంకెవరూ లేరంటారా?"

"ఉంటే దాచిపెడతానా?"

టోకీ ఒకక్షణం ఆగి చిన్నగా, ''షాజాదా కరీం ఇక్కడ దాగిఉన్న సంగతి ఇంకా బయటపెట్టవా?'' అని అడిగాడు.

ఖాన్ ఆశ్చర్యంతో కొయ్యబారిపోయి. షాజాదా కరీమా? ఇక్కడ దాగి ఉన్నాడా?" అన్నాడు.

"ఎందుకు, తెలిసికూడా ఈ నటన?''

ఖాన్‌కు కోపం వచ్చింది. "నన్నిలా అవమానిస్తూ మాట్లాడమనికూడా పాదుషావారే ఉత్తరు విచ్చారా?" అని ఆయన అడిగాడు.

"లేదు. కాని, ఆ పిల్ల గురించీ, షాజాదా కరీంగురించీ మీరు నిజం చెప్పని పక్షంలో మిమ్మల్ని తమవద్దకు పంపమని పాదుషావారి ఆజ్ఞ."

"పాదుషావారి ఆజ్ఞ జరిగితీరాలి. నేనిప్పుడే ఇంటికి వెళ్ళి, తగిన ప్రయత్నాలు చేసుకుని, పాదుషావారి దర్శనం చేసుకుంటాను," అంటూ ముసలిఖాన్ లేవబోయాడు. కాని ఇంటికి పోవడానికి వీలులేదనేశాడు సేనాధిపతి.

ఖాన్ కంగారుపడి, "కనీసం నా సేవకులకు కబురైనా అందజేయవచ్చునా? లేకపోతే, ఇల్లంతా అసలే గందరగోళంగా ఉన్నది," అన్నాడు.

"పాదుషావారిపైన కుట్రలు సాగిస్తున్నందుకు, మీ నౌకర్లను ఇదివరకే బంధించాం."

"మహమ్మద్‌జానూ, హమీదా పాదుషావారిపైన కుట్రలు చేశారా? అందుకని వాళ్ళను బంధించారా? నా కంతా అయోమయంగా ఉన్నది."

"క్షమించాలి. ఇంతకుమించి నేను మీ కేమీ వివరాలు చెప్పగూడదు."

"నా సేవకులిప్పు డెక్కడ ఉన్నారు?"

"నిర్బంధంలో ఉన్నారు. వాళ్ళు మరణదండన పొందబోతున్నారుకూడా."

ఖాన్ అదిరిపడ్డాడు. "వాళ్ళనేరం రుజువయిందా?" అని అడిగాడు.

"రుజువయింది."

"ఎవరు రుజువుచేశారు?"

"గౌహర్ జాన్."

"వాడెవడు. నేనిక్కడికి బయలుదేరకపూర్వం ఒకడు నా దగ్గరకొచ్చి తన పేరు గౌహర్జా నన్నాడు. ఆయితే యీ కుట్రలో నన్నుకూడా చేర్చి, ఉరితీస్తారో ఏమో!"

"నే నింకేమీ చెప్పలేను. మిమ్మల్ని పాదుషావారి దగ్గిరికి పంపమని ఆజ్ఞ అయింది, పంపేస్తాను."

ఇంతలో సైనికులనుంచి, "కోతి! కోతి!" అన్న కేకలు గట్టిగా వినిపించాయి. వాళ్ళు చూసినది నిజమైన కోతికాదు. కోతి ఆకారంలో తిరుగుతున్న దులారీయే. ఆమె ఒక రాయి తీసుకుని టోకీ నుదురు బద్దలయేటట్టు విసిరింది. నుదురు బద్దలై నెత్తురు కారుతూ అతడు అదిరిపడి లేచి, 'అబ్బా' అంటూ ముఖం తడువుకున్నాడు. అదే సమయంలో సైనికులమీద రాళ్ళవర్షం కురిసింది. వాళ్ళు అటూఇటూ చూస్తే కోతి కనబడింది. కాని వాళ్ళు ఎంతప్రయత్నించినా కోతి



చిక్కలేదు. వాళ్ళు తిరిగివస్తూండడం చూసి, "ఆ వెధవ కోతిని చంపెయ్యండి," అని టోకీ అరిచాడు.

వెంటనే ఒక పటాలం కోతిని వేటాడటానికి బయలుదేరింది. మరికొందరు సైనికులను పిలచి, సలబత్‌ఖానును తీసుకుపొమ్మని ఉత్తరువిచ్చాడు. వాళ్ళు తన కేసి రావటం చూసి వృద్ధుడు, ''నన్ను అవమానించకండి. నేను మీ వెంటే వస్తాను,'' అన్నాడు.

సలబత్‌ఖాన్ సైనికులవెంట వెళ్ళిపోగానే సేనాధిపతి టోకీ తన మిగిలిన సైనికులతో, పదేసిమంది ఒక్కొక్కజట్టుగా ఏర్పడి, సిక్కీనగరంలో ప్రతి అంగుళమూ, ప్రతిపాడుబడినఇల్లూ గాలించి, ఎవరైనా దొరికితే పట్టుకురావలిసిందని ఆజ్ఞాపించాడు.

ఇంతలో కోతివెంట వెళ్ళిన సైనికులు తిరిగివచ్చి, ఆ కోతి తప్పించుకుపోయిందనీ, తమకు అందలేదనీ చెప్పారు.

టోకీ మండిపడి, కోతి కరిగిపోవటానికి మంచుగడ్డా? ఎగిరిపోవటానికి పక్షా? మీరు దాన్ని చంపిరాకపోతే మీకు చావు తప్పదు. పదండి!" అని కేకపెట్టాడు.

సైనికులు బయలుదేరడానికి మారుగా ఒకరిముఖా లొకరు చూసుకున్నారు.

అధికారి ఆగ్రహం రెట్టింపయింది. ''బుద్ధితక్కువ కుంకల్లారా, అలా కొయ్యబొమ్మల్లా నుంచుంటారేం? చెప్పే దేమైనా ఉంటే చెప్పండి; మీనోళ్ళు పడిపోయాయా?'' అని కేకవేశాడు.

"హుజూర్, దయ్యాలు లేవనటానికిలేదు," అన్నా డొకడు సాహసించి.

టోకీ మరింత కోపోద్రేకము చెంది, ఈసంగతి ఎలాతెలిసిం దని అడిగాడు.

"హుజూర్, మే మాకోతిని పట్టుకునేటందుకు వెంటబడి పరిగెత్తాం. మేము దాన్ని మళ్ళీ చూసేసరి కది కోతికాదు. అది మా కళ్ళఎదటనే ఇంటికప్పొకటి ఎక్కి పన్నెండేళ్ళపిల్లగా మారిపోయింది. దాన్నయినా పట్టుకుందామని, కొందరిని ఇంటిచుట్టూ కాపలా ఉంచి. మరికొందరం ఇంటికప్పు ఎక్కాం. కాని ఈలోపల అదికాస్తా మాయమయింది. ఎటుపోయిందోకూడా తెలియలేదు,' అన్నాడు సైనికుడు.

టోకీ పళ్ళు పటపటా కొరికి, దద్దమ్మల్లారా, ఈ నగరంలో అనేకమంది మారువేషాలతో తిరుగుతున్నారు. ఇక్కడ అనేక రహస్యమార్గా లున్నాయి. అందు చేత మీరు దయ్యాలనీ, పిశాచాలనీ బెదరకుండా, జాగ్రత్తగా ప్రతిస్థలమూ పరిశీలించాలి. ఈ నగరంనుంచి ఒక్కపురుగుకూడా తప్పించుకుపోరాదు. నేను మౌల్వీని చూసి ఇప్పుడే వస్తాను." అన్నాడు.

సైనికులు తమ అధికారి మాటలను నమ్మలేకపోయినా, అతని ఆజ్ఞలు నిర్వర్తించక తప్పదు గనక అక్కడినుంచి వెళ్ళిపోయారు. తరవాత టోకీ మౌల్వీని కలుసుకోవటానికి వెళ్ళుతూ "చూశావా, నేను వచ్చానని తెలిసికూడా మౌల్వీ నన్ను చూడరాలేదు. పాదుషాలు వీళ్ళను అచ్చుపోసివదిలేశారు. మతభక్తిగల సామాన్యులు వీళ్ళను దేవతల్లాగా చూస్తున్నారు. ఇలా అయితే ఈ సామ్రాజ్యం నాశనం అవుతుంది," అని తనలో అనుకున్నాడు; అయితే ఆఖరువాక్యం అప్రయత్నంగా అతను పైకే అనేశాడు

వెంటనే ఎవరో, "ఈ సామ్రాజ్యం నిజంగానే నాశనం అవుతుంది,'' అన్నారు.

టోకీ ఉలిక్కిపడి చుట్టూ కలయజూశాడు. కాని ఎవరూ కనిపించలేదు. ఆ ప్రాంతమంతా కారాడాడు. ఎవరూ లేరు. అయితే, ఆ మాటలు ఎవరో నిజంగా అన్నారు. తాను స్పష్టంగా విన్నాడు. ఇక్కడ ఎవరో రహస్యంగా ఉంటున్నారనడానికి ఇంతకంటె సాక్ష్యం అవసరం లేదు. అవసరమైతే ఇక్కడి ఇళ్ళన్నీ పడగొట్టి అయినా దాగినవాళ్ళను పట్టాలి.

ఫకీరుసలీమ్ సమాధివద్ద ఎవరూలేరు, కాని దానివెనక ఉండే ఇంట ఎవరో ముసుగుదన్ని నిద్రపోతున్నట్టు టోకీ చూశాడు. "మౌల్వీగా రెక్కడుంటారో చెబుతావా?'' అని అతను కేకపెట్టేసరికి, ముసుగుదన్ని పడుకున్న మనిషి ముసుగు తీసి, తెల్లటిగడ్డంతో కనబడి, "జ్వరం – జ్వరం – దయచెయ్యండి," అన్నాడు అతికష్టంమీద.

"ఒంటరిగా వున్నారే? చేసి పెట్టేవా శ్శెవరు?''

"పకీరుకు అల్లా తోడు.''

''ఎవరినన్నా సాయం పంపనా?''

''ఎందుకు శ్రమ, అల్లా చూసుకుంటాడు.''

"శ్రమకలిగించను. అడిగినది చెప్పండి. ఇక్కడ ఎవరన్నా దాక్కొని ఉంటున్నారా?"

''ఉంటే నాకు తెలుస్తుంది.''

''అయితే సలబత్ ఖానూ, ఇద్దరు నౌకర్లూ తప్ప ఇంకెవరూ ఉండటంలేదా ఇక్కడ?''

"వాళ్ళూ, నేనూ తప్ప ఇంకెవరూ లేరు.''

''మీకు దయ్యాలలో నమ్మకం ఉన్నదా ?"

''అంతా వట్టి అబద్ధం.''

సేనాధిపతి ఫకీరుదగ్గిర సెలవుపుచ్చుకుని, "ఇక్కడ జరిగేదంతా ఈ ఫకీరుకు తెలియకపోవచ్చు,'' అనుకుంటూ నడుస్తూండగా, పాము తనకాళ్ళదగ్గిరే బుసకొట్టి నట్టు వినిపించి, ఇంతఎత్తు ఎగిరిపడ్డాడు. ఆ భయంతో అతనికి చలవలు కమ్మి, చెమటపోసింది కాని గొప్పయోధుడు గనక అతను తనను తాను సంబాళించుకుని, ఒరనుంచి కత్తిదూసి, పామును నరకబోయాడు. కాని పాము కనబడలేదు; దాని జాడకూడా తెలియరాలేదు. అతను తన సైనికులను కలుసుకుందామని చురుకుగా నడవసాగాడు. తనను ఎవరో వెంబడిస్తున్నట్టు తోచి, వెనక్కు తిరిగిచూశాడు. ఎవరూలేరు. కొంచెం గుండె గుబగుబలాడింది.

అతను మరింత వేగంగా నడవసాగాడు. అతనికి ఎవరో స్త్రీ పాడటం విని పించింది. పాట చాలా హాయిగా ఉన్నది. ఈ నగరంలో ఎవరూ లేరని ఎలా అనుకోవడం ? దుర్మార్గు లిక్కడ దాగిఉన్నారు. కాని వా శ్శెటుపోగలరు ?

ఇలా అనుకుంటూ అతను కత్తిపట్టి, సంగీతం వినిపించిన ఇంట జొరబడ్డాడు. వాకిలి తెరిచే ఉన్నది. లోపల చాలాకాలంగా మనుషులు అడుగుపెట్టినట్టు లేదు. వస్తువులు అడ్డదిడ్డంగాపడి, మట్టికొట్టుకుని ఉన్నాయి. కాని సంగీతం వినిపిస్తూనే ఉంది. అది పక్కగదిలోనుంచి వస్తున్నట్టు తోచి, అతను అందులోకి వెళ్ళాడు. కాని అక్కడ ఎవరూ లేరు. సంగీతం ఆగనుకూడా లేదు.

"ఇక్కడ ఈ పాడే దెవరు?" అని అతను గట్టిగా అడిగాడు.

జవాబు లేదు. పై పెచ్చు సంగీతం ఇంకో గదినుంచి వినపడింది. అతను

తిరిగిన గదులలోనే తిరిగాడు. ఎక్కడా ఎవరూ లేరు, మనిషి జాడలైనా లేవు. సంగీతంమాత్రం అతన్ని సవాలు చేస్తూనే ఉన్నది. ఒకవేళ దయ్యాలున్నాయేమో అని అతనికి అనుమానం తట్టింది. అత నీ మాట పైకి గొణుగుతూండగానే అతని వెనకనుంచి గాడిద దారుణంగా ఓండ్రపెట్టసాగింది. "అల్లా! అల్లా!" అంటూ అతను ఒక్కపరుగున ఇంట్లోనుంచి బయటకొచ్చిపడ్డాడు.

మరుక్షణం స్త్రీలు గలగలా మాట్లాడుతూ, కిలకిలా నవ్వడం అతనికి వినిపించింది. అతనికి వున్నధైర్యంకూడా పూర్తిగా పోయింది. తనను ఏపులో తరుముతున్నట్టుగా, పిక్కబలంకొద్దీ సింహద్వారంకేసి పరిగెత్తాడు మొగలుసేనాపతి మహమ్మద్ టోకీ!

అతని దుస్థితి గమనించి సైనికులు ముఖాలు ముఖాలు చూసుకున్నారు.

"ఇటెవరూ రాలేదా?" అని అతను సైనికుల నడిగాడు. లే దన్నారు వాళ్ళు.

"మరేం చూశారు?"

"ఇళ్ళన్నీ చూశాం. చాలాకాలంగా ఎవడూ వాటిలోకి అడుగు పెట్టినట్టు కనబడదు. దుమ్ముకొట్టుకుని వున్నాయి.''

అతను తన అనుభవాలను వాళ్ళకు చెప్పలేదు; చెబితే ఒక్క సైనికుడు గూడా ఒక్కక్షణం అక్కడ నిలిచి వుండకపోను. అతను సైనికులను వెంటబెట్టుకుని సలబత్‌ఖాన్ ఇంటికి వెళ్ళి, ఇల్లంతా పరిశీలించాడు. అతను రహస్యమార్గాల కోసమూ, ఆడవాళ్ళు నివసిస్తున్న జాడలకోసమూ వెతికాడు. ఏమీ అంతు చిక్కలేదు. చిత్రమేమిటంటే సలబత్‌ఖాన్ ఇంట చిల్లిగవ్వకూడా దొరకలేదు. డబ్బు ఏమీ లేకుండా ఆ వృద్ధుడు జీవిస్తూ ఉండటం ఆశ్చర్యంగా తోచింది టోకీకి.

అతను సైనికులను వెంటవేసుకుని ఆ నగరంలో ఉన్న ఇళ్ళన్నీ వెదవెతికాడు. ఎక్కడా మనిషిజాడ లేదు. చివరకు అతని కొక జంతువుగాని, ఒక పక్షిగాని కంటబడలేదు. కాని అతను సంగీతం విన్నాడు; గాడిద ఓండ్రపెట్టడం విన్నాడు; స్త్రీలు కిలకిలా నవ్వడం విన్నాడు. వీటిని ఎలా అర్థం చేసుకోవాలి? ఈ ప్రశ్న అతన్ని మహామథనపెట్టింది.

అందరూ కలిసి మరియాబేగంమహాలుకు వెళ్ళారు. చుట్టూ ఎత్తయిన గోడలూ, ఒకటే వాకిలీ. అదికూడా తాళం పెట్టిఉన్నది. మిగిలిన ఇళ్ళద్వారా లన్నీ తెరిచిఉండగా ఇది తాళం పెట్టిఉండటం టోకీకి ఆశ్చర్యం కలిగించింది. వాకిలి తలుపులు విరగదన్నటానికి అతని ఉత్తరువు పొంది అతని వెంటఉన్న నూరుమంది సైనికులూ ఆపని చేశారు. లోపల చెట్లూ, చేమలూ — అంతా అడవిలాగా

ఉన్నది. అక్కడకూడా జనసంచారం లేనట్టే ఉన్నది. కాని వాళ్ళందరూ లోపలికి అడుగుపెట్టగానే అనేకమంది స్త్రీలు రొమ్ములు బాదుకుంటూ శోకాలు పెట్టడం వినవచ్చింది. ద్వారానికి తాళం వేసిఉండగా అంతమంది స్త్రీలు ఎలా ప్రవేశించారు?

సైనికులు కొయ్యబారిపోయి నిలబడ్డారు. టోకీకూడా కొయ్యబారిపోయాడుగాని, త్వరలో ధైర్యం తెచ్చుకుని, తన సైనికులతో, "పిరికిపందల్లారా! పాపం, ఆ అడవాళ్ళకు వచ్చిన కష్ట మేమిటో విచారించక స్తంభాల్లాగా నిలబడ్డా రేమిటి?'' అన్నాడు.

సైనికులు భయంతో కదలలేదుగాని, టోకీమటుకు ఆర్తజనరక్షణార్థం మందిరంలో ప్రవేశించాడు. వెంటనే ఏడుపులు టక్కున ఆగిపోయాయి. పైపెచ్చు లోపల ఎవరూ లేరు! అంతమంది స్త్రీలూ ఏమయారో మరి? తనరక్తం ఒక చెంప కరుడుగట్టుకుపోతున్నప్పటికీ అతను తన సైనికులను లోపలికి రమ్మని పిలిచాడు. సైనికులు బలవంతాన హాలులోకి అడుగుపెట్టేసరికి వికవికా నవ్వులు వినిపించాయి. సైనికులు కాలి సత్తువకొద్దీ బయటికి పరిగెత్తారు. టోకీకూడా వాళ్ళ వెనకే వెళ్ళాడు. వెటకారపు నవ్వు లతన్ని చాలాదూరం సాగనంపాయి.

టోకీకి కలిగిన అనుభవాలను గురించి మొత్తం సైన్యానికంతకూ తెలిసి పోయింది. సైనికుల ఆదురుకు అంతులేదు. ఒక్కటే టోకీకి అర్థం కాలేదు — ఈ దయ్యాలూ, పిశాచాలూ ఈ సిక్రీ నగరంవారిని బాధించవా? పాదుషా పక్షం వాళ్ళనే బాధిస్తాయేం? వాటి బాధకు గురిఅవుతూ సలబత్‌ఖాన్‌గాని, అతని సేవకులుగాని అక్కడ ఒక్కరో జుండగలరా? దయ్యాలు మనమీదమాత్రమే కత్తిగట్టాయి అంటే పాదుషా నమ్ముతాడా? టోకీ ప్రతిష్ఠ అంతా ఈ సమస్యపైనే ఆధారపడి ఉన్నది. పాదుషా నమ్మడు. నూర్జహాన్ టోకీ తల తీయించినా తీయించవచ్చు.

ఈ చిక్కునుంచి బయటపడే దారి గానక గిలగిలలాడుతున్న టోకీవద్దకు సర్దార్లు వచ్చారు. సైనికులు సిక్రీనగరంలో ఒక్క క్షణమైనా ఉండమంటున్నారనీ, ఏం చెయ్యాలో నిర్ణయించమనీ ఆ సర్దార్లు టోకీని అడిగారు. తాను కొన్ని విపరీతాలు చూసినమాట నిజమేననీ, వాటినిగురించి దడుచుకుని లాభం లేదనీ, శోధించాలనీ టోకీ అన్నాడు. ఈ విపరీతాలకు ముఖ్యస్థానమైన మరియాబేగం మహలుకు సర్దార్లను అతను వెంటబెట్టుకు వెళ్ళాడు. కాని ఈసారి అక్కడ అంతా నిశ్శబ్దంగా ఉన్నది. ఎక్కడా ఎలాంటి సంచలనమూ, సవ్వడీ లేదు. కాని టోకీ

భ్రమపడ్డా డనుకోవటానికి లేదు. అతని అనుభవాన్ని నూరుమంది సైనికులు పంచుకున్నారు.

"ఏమైనా సైనికులు వెళ్ళడానికి వీల్లేదు. మనం వచ్చిన పని ఒకటీ నెరవేరలేదు. షాజాదా ఆచూకీ తెలియలేదు. సిక్రీలో రహస్యంగా ఉంటున్న ప్రాణి ఒక్కడూ దొరకలేదు. పాదుషావారి అనుమతితోనే మన సైనికులు ఇక్కడినుంచి కదలాలి." అవి టోకీ సర్దార్లతో అన్నాడు.

వీరంతా మరియాబేగంమహలునుంచి తిరిగి వచ్చేసరికి సైనికులు ప్రయాణ సన్నాహంలో ఉన్నారు; బళ్ళలో సామాన్లు వేస్తున్నారు. గుర్రాలను తయారుచేస్తు న్నారు. అంతా అడావుడిగా ఉన్నది. తమతమ సర్దార్లకైనా చెప్పకుండా సైనికులు ప్రయాణసన్నాహాలు చేస్తూఉండటం చూసి టోకీకి చాలా కోపం వచ్చింది.

టోకీ ఆ విషయం కనుక్కునేలోపల ఒకరౌతు పాదుషానుంచి అతని కొక జాబు తెచ్చిఇచ్చాడు. అందులో ఇలా ఉన్నది: షాజాదా పర్వేజ్ యుద్ధంలో ఓడాడు; మహబత్‌ఖాన్, భీమసింహుడూ ఆగ్రాపైకి దండెత్తే ప్రయత్నంలో ఉన్నారు; ఈ జాబు చూస్తూనే టోకీ తన సేనలతోసహా రాజపుతానా వెళ్ళాలి; తెల్లవారేలోపుగా పాదుషా సిక్రీనగరంలోకి ప్రవేశిస్తాడు.

రాజపుతానాకు వెళ్ళాలని పాదుషావారి ఉత్తరువైనట్టు ముందుగానే తెలిసి సైని కులకు ప్రాణాలు లేచివచ్చాయి. సిక్రీదయ్యాలనుంచి దూరంగా పోవడాని కిది మంచి అవకాశం......మంత్రం వేసినట్టుగా సిక్రీనగరం తిరిగి నిర్మానుష్యమై పోయింది.

* * * *

మొగలుసామ్రాజ్యానికి కష్టాలు సంప్రాప్తమయినది జహంగీరు భోగలాలసత వల్ల. పరిపాలనా చక్రాన్ని నూర్జహాన్ తిప్పనారంభించింది. జహాంగీరు కొడుకు లందరిలోకీ చిన్నవాడూ, తన అల్లుడూ అయిన షరియార్‌ను సింహాసనం పైన కూర్చోబెట్టే ఉద్దేశంతో ఆమె కరీమ్‌ను ఒక కంట కనిబెడుతూ వచ్చింది. నిజానికి కరీమ్ మాత్రమే రాజ్యార్హుడు. అందుచేత భీమసింహుడూ, మహబత్‌ఖానూ బహి రంగంగా అతని పక్షమయారు. భీమసింహుణ్ణి నూర్జహాన్ గుజరాతుకు పంపాలను కుంటే, ఆమె ఇస్తానన్న పదవిని అతను నిరాకరించాడు. నూర్జహాన్ కరీమ్ పైన గూఢచారులను పెట్టి, అతన్ని ఆగ్రా దాటిపోనీకుండా చెయ్య సంకల్పించింది. కాని కరీమ్ తప్పించుకుని పోనేపోయాడు. అతని జాడ తెలియలేదు; అతను భీమసింహుడి వెంటగాని, మహబత్‌ఖాన్ వెంటగాని లేడనిమాత్రం తెలిసింది.

చివరకు పాదుషా, తన కొడుకు పక్షాన నిలబడిన భీమసింహుడితోనూ, మహబత్‌ఖాన్‌తోనూ యుద్ధం చెయ్యవలసివచ్చింది. నూర్జహాన్ షాజాదా పర్వేజ్‌ను సేనతో యుద్ధానికి పంపింది. స్త్రీలోలుడూ, తాగుబోతూ అయిన పర్వేజ్‌కు యుద్ధమంటే భయం. అయినా తప్పనిసరి అయి, అయిదువేల సేనతో రాజపుతానాకు వెళ్ళి, దాని సరిహద్దున శిబిరం ఏర్పాటు చేసుకున్నాడు.

పర్వేజ్‌కు సహాయం వెళ్ళమని పాదుషా అంబరు రాజుకూ, మార్వారు రాజుకూ ఉత్తరువు లిచ్చాడు. వాళ్ళు తమ తమ సేనలతో బయలుదేరి రావడమైతే వచ్చారు గాని, పర్వేజ్ శిబిరంలో కలియక, ఎడంగా తమ తమ శిబిరాలు నిర్మించుకుని, పరిస్థితి ఎలా పరిణమించేదీ చూడసాగారు.

పర్వేజ్ సొంత శిబిరం రాజమహలు లాగే ఉంది. అంతులేని విలాసములూ, సౌఖ్యాలూ, తాగుడూ—దేనికీ కొరతలేదు. భీమసింహుడి శిబిరంలో స్త్రీలూ, తాగుడూ లేవు; అది నిజమైన సైనిక శిబిరమే. మహబత్‌ఖాన్ శిబిరంకూడా ఇంచుమించు అలాగే ఉన్నది.

అంబరు, మర్వారు పాలకుల అభిప్రాయం ఉభయపక్షాలవారికీ అంతుబట్టటంలేదు. మొగలు సేనలు యాభై వేలదాకా ఉన్నాయి, భీమసింహుడికిందా, మహబత్‌ఖాన్ కిందా ఉన్న సేనలు పదివేలు మించవు. అంబరు సేనా, మేవారు సేనాకూడా మొగలు సేనతో చేరేటట్టుంటే ఈ పదివేల సేనా ఎందుకూ చాలదు. అయినా భీమసింహుడు వీరోచితంగా యుద్ధం చెయ్యడానికి సంసిద్ధుడుగానే ఉన్నాడు. కాని మొగలు సేనాపతులు మాత్రం, అంబరు మేవారు సేనలు ఎక్కడ శత్రుపక్షాన చేరిపోతాయోనని భయపడి చస్తున్నారు.

మహబత్‌ఖాన్ పాదుషాకు ప్రతికక్షిగా చీలిపోయాక, మొగలు సేనాపతులలో మళ్ళీ మహబత్‌ఖానంతటివాడు మేవారు రాజైన గాజాసింహుడు మాత్రమే. ఈ యుద్ధంలో షాజాదా కరీమ్‌పక్షం నెగ్గినట్టయితేనే మొగలు సామ్రాజ్యం నిలిచి ఉంటుందని ఆయన నమ్మకం. అదిఅయినా షాజాదా కరీమ్ బతికిఉంటేనే. లేని పక్షంలో మొగలుసామ్రాజ్యం నిచ్ఛిత్తి అవుతుంది. రాజపుత్రసామ్రాజ్యం కర్ణసింహుడి అధిపత్యాన ఏర్పాటవుతుంది.

ఒకరాత్రి ఈ ధోరణిలో ఆలోచిస్తున్న గాజాసింహుడి శిబిరానికి భీమసింహుడు వచ్చి, "ఈ యుద్ధంలో మీ రెటు ఉండనిశ్చయించారు?" అని అడిగాడు.

పాదుషాకు సహాయపడతానని మాట ఇచ్చానన్నాడు గాజాసింహుడు. కాని

తానింకా మొగలులపక్షం చేరలేదని ఒప్పుకున్నాడు. ఈ ద్వంద్వ మనస్థితికి కారణ మేమని భీమసింహు డడిగాడు.

"మరేమీలేదు. పాదుషా మరొకరితో యుద్ధంచేసే పక్షాన నేనూ ఆయనపక్షాన యుద్ధం చేసిఉందును. కాని ఈ యుద్ధం తండ్రి కొడుకుల మధ్య జరుగుతున్నది. అందుచేత ఎటూ నిర్ణయించ లేకుండాఉన్నాను." అన్నాడు గాజాసింహుడు.

కోపోద్రేకంలో భీమసింహుడు గాజాసింహుణ్ణి అవమానించే మాట లన్నాడు; అతను నూర్జహానుకు దాసు డనీ, మొగలులకు తొత్తు అనీ ఆక్షేపించాడు. అతనిలా తూలిఘాట్లాడిన ఫలితంగా అతనిప్రయత్నానికే హాని కలిగింది. భీమసింహుడికి సహాయంచేసే ఆలోచన పూర్తిగా విడిచిపుచ్చి, గాజాసింహుడు వెంటనే తన శిబిరాన్ని ఎత్తి, మొగలు శిబిరంలో ప్రవేశించాడు.

వెంటనే శత్రుపక్షాలు రెంటిమధ్యా మహాదారుణమైన యుద్ధం సాగింది. రాజపుత్ర సైనికులది తక్కువసంఖ్యే అయినా, వారు చాలా వీరోచితంగా పోరాడి, మొగలుసేనలను చించిచెండాడసాగారు.

ఒకవెంప తన సైనికులు యుద్ధంలో నల్లులలాగా చస్తుంటే, వారికి నాయకుడైన పర్వేజ్ తన శిబిరంలో తప్పతాగుతూ, స్త్రీలతో ప్రణయసౌఖ్యంలో ఓలలాడుతున్నాడు. అందరూ తాగిన మైకంలో ఉన్నారు.

యుద్ధకోలాహలం పర్వేజ్ శిబిరానికి దగ్గరకావడం మొదలుపెట్టింది. ఆడవాళ్ళ మైకం దిగిపోయింది. వాళ్ళు భయపడి తలాఒకదిక్కూ పారిపోయారు. పర్వేజు వెంట ఒక్కతెమాత్రమే దిగబడింది. ఆమె పర్వేజ్ చెంతనుండి లేచి, ఒక లోటాలో సారాయి నించి, తన బొడ్డులోనుంచి ఏదో తీసి, సారాలో కలిపి తెచ్చి, పర్వేజు చేతి కందించింది. అతను దాన్ని గడగడా తాగేశాడు. అతని ప్రాణాలు పోవడాని కెంతో సేపు పట్టలేదు.

పర్వేజు దిక్కులేని చావు చచ్చాడు. అతని వెంటఉన్న ఉంపుడుగత్తె లందరూ పారిపోయారు. దొంగలు అతని శిబిరాన్ని తుడిచిపెట్టేశారు.

యుద్ధం సాగుతూనే ఉంది. మొగలు సైనికులలో ఉత్సాహం సన్నగిల్లుతున్నది. పర్వేజ్ యుద్ధరంగంలో కనిపిస్తేనేగాని సైనికులకు ఉత్సాహం రాదని, మొగలు సేనాపతి బైరామ్‌ఖాన్ పర్వేజు శిబిరానికి వచ్చి — పర్వేజ్ శవాన్ని చూశాడు. ఈ సంగతి సైనికులకు చెప్పాలో, మానాలోకూడా అతనికి తెలీదు. పర్వేజ్ మామూలు రాజకుమారుడుకూడాకాడు, కానున్న పాదుషా; అతని మరణం సామ్రాజ్యానికే పెద్దదెబ్బ.



ఇంతలో వెలపల ఎవరో స్త్రీ, "షాజాదా చచ్చాడు! సైనికులారా, పారిపొండి!" అని అరవడం బైరమ్ విని, చప్పున బయటికి పరిగెత్తి, "సైనికులారా, షాజాదా వస్తున్నాడు; భయపడక పోరాడండి," అని అరిచాడు. కాని లాభంలేకపోయింది. మొగలుసైనికులు అప్పటికే పరుగు లంకించుకున్నారు. మహబత్ ఖాన్ అమితోత్సాహంతో వాళ్ళ వెంటబడి దారుణంగా చంపేస్తున్నాడు.

గాజాసింహుడు తన సేనలను తీసుకుని ఎడంగా వెళ్ళిపోయాడు. పర్వేజ్ శిబిరాన్ని మహబత్ ఖాన్ ఆక్రమించుకున్నాడు. కాని ఈ ఆనందసమయంలో భీమసింహుడు తీవ్రంగా గాయపడి, చావసిద్ధంగా ఉండడం అతన్ని చాలా బాధించింది.

"మిత్రమా, కరీమ్‌ను ఢిల్లీ సింహాసనం మీద కూర్చోబెట్టుతానని ప్రమాణం చెయ్యి. నిశ్చింతగా ప్రాణం వదులుతాను," అన్నాడు భీమసింహుడు మహబత్ ఖాన్‌తో.

"ఇంక ప్రమాణా లవసరం లేదు. పర్వేజ్ చనిపోయాడు. కరీమ్ తప్ప సింహాసనానికి వారసులు లేరు," అన్నాడు మహబత్ ఖాన్.

కరీమ్ సింహాసనంమీద కూర్చోవడానికి జహాంగీర్ అభ్యంతరం చెప్పడు; కాని జహాంగీర్ అనంతరం ఏమవుతుందోనని భీమసింహుడు భయపడ్డాడు. కరీమ్

ఎక్కడ వున్నదీ అతని మిత్రులకు తెలీదు. కాని జులేఖా అతన్ని తల్లిలాగా కాపాడుతుందని వారికి తెలుసు.

పర్వేజ్ మరణవార్త వింటూనే పాదుషా, సైన్యాన్ని రాజపుతానాకు తీసుకుపొమ్మని మహమ్మద్ టోకీకి ఉత్తరువిచ్చి, తాను సిక్రీనగరం ప్రవేశించ నిశ్చయించాడు. చిత్రమేమంటే ఈ సంగతి ఆయన నూర్జహాన్‌కు ముందుగా చెప్పలేదు; ఆమె సలహా పొందలేదు· కనీసం ఇలాగని ఆమెకు కబురైనా చెయ్యలేదు. ఇది జహంగీరులో చాలా గొప్ప మార్పు, నూర్జహాన్ జీవితంలో ఒక ఘోర పరాభవం. జహంగీరులో ఈ మార్పు రావడానికి కారణం పర్వేజ్ మరణమే. ఇది జరిగేదాకా ఆయనకు తన పట్టపురాణి దక్షతలో పూర్తివిశ్వాసం ఉండేది. అది కాస్తా ఇప్పుడు పోయింది.

అవమానంతోనూ, సిగ్గుతోనూ కుమిలిపోతూ నూర్జహాన్ షరియార్ శిబిరానికి వెళ్ళి, "మేం ఒక పనిమీద సిక్రీనగరానికి పోతున్నాం. నువు వెంటనే ఆగ్రాకు తిరిగి వెళ్ళు,'' అని చెప్పి, భర్త తన పరివారంతో ముందే సిక్రీనగరానికి వెళ్ళిపోయి ఉండటంచేత, తానుకూడా బయలుదేరింది. అసఫ్‌ఖాన్ మొదలైన ముఖ్యులంతా ముందుగానే సిక్రీకి బయలుదేరి ఉండటంచేత, షరియార్ ఆగ్రాకు తిరిగి వెళుతున్న సంగతి వారి కెవరికీ తెలియదు; తెలియకుండా ఉండటమే తనకూ, షరియారుకూ క్షేమమనుకున్నది నూర్జహాన్.

మహమ్మద్ టోకీ రాజపుతానాకు సైన్యంతో పాదుషావారి ఉత్తరువుపై వెళ్ళిపోతూ, తాను ఖైదీలుగా పట్టుకున్నవారిని ఏం చెయ్యాలో తెలీక, కాశింఖాన్ అనేవాడికి అప్పగించి వెళ్ళిపోయాడు ఖైదీలను పాదుషావారి ఎదట పెట్టాలి. కాని పాదుషా సిక్రీనగరానికి వెళ్ళాడు. ఖైదీలను సిక్రీకి తీసుకుపోవాలా? లేక పాదుషా తిరిగి వచ్చేదాకా అక్కడే ఉంచాలా? ఏదీ పాలుపోక కాశింఖాన్ తికమకపడ్డాడు.

ఆ సమయంలో ఒక సైనికుడు ఖైదీలను చంపెయ్యమని కాశింఖానుకు సలహా ఇచ్చాడు. కాని కాశింఖాన్ అలా చెయ్యటానికి సన్తాయించాడు. సలబత్‌ఖాన్‌వంటి వృద్ధుణ్ణి తలతీయడానికి తనకు తగిన అధికారం ఉన్నట్టు ఆ సర్దారుకు తోచలేదు. కాని సైనికుడు, ఫరవాలేదు చంపమనీ, ఎవరూ అడగరనీ తొందరచేశాడు; కాని కాశింఖాన్ తన తల పోతుందని భయపడ్డాడు.

ఖైదీలను చంపెయ్యమని సలహా ఇచ్చినవాడు మరెవడూ కాడు; గౌహర్ఖానే. సైన్యం వెళ్ళిపోయినా వాడు అక్కడే దిగబడిపోయి, సలబత్‌ఖాన్ మొదలైన వారి చావు చూడడానికి తహతహలాడుతున్నాడు.

ఇంతలో ఒకడు గుర్రంమీద వేగంగా వచ్చి, "సుబేదార్ కాశింఖా నెవరు?" అని అడిగాడు.

"నేనే. ఏంకావాలి?" అన్నాడు కాశింఖాన్.

వచ్చినరౌతు కాశింఖాన్‌కు ఒక ఉంగరం చూపి, "ఈ వృద్ధుణ్ణీ, ఈయన నౌకర్లనూ తక్షణం విడిచిపెట్టమని బేగంసాహెబావారి ఆజ్ఞ," అన్నాడు.

ఆ ఉంగరం చూడగానే కాశింఖాన్ గుండె దడదడలాడింది. కాని గౌహర్జాన్, "వీడెవడో దొంగ. బేగంసాహెబా అలా ఎన్నడూ ఆజ్ఞాపించదు," అన్నాడు.

రౌతు కాశింఖాన్‌తో "వీడు గౌహర్జాన్ అనే బద్మాష్. వీణ్ణి తక్షణం బంధించి తీసుకుపొమ్మని బేగంసాహెబావారి ఉత్తరువు. నువు వెంటనే ప్రయాణమై ఆగ్రా వెళ్ళాలి. షాజాదాషరియార్ బయలుదేరాడు. బేగంసాహెబాకూడా బయలుదేర బోతున్నది," అన్నాడు.

గౌహర్జాన్ అడ్డుపుల్లలు వెయ్యయత్నించాడు. "మహారాణి ఆజ్ఞ పాలిస్తావా, పాలించవా? చెప్పు!" అని రౌతు దబాయించేసరికి కాశింఖాన్ బెదరిపోయి, ఖైదీలను విడుదలచేసి, గౌహర్జాన్ కాళ్ళూ, చేతులూ కట్టేసి, ఒకగుర్రంమీద పెట్టి, సైన్యాన్ని వెంటబెట్టుకుని ఆగ్రాదారిపట్టాడు.

రౌతు పరమానందంతో విరగబడి నవ్వుతూ తన మారువేషం విప్పేసదాకా సలబత్‌ఖాన్ విమలసింహుణ్ణి గుర్తించలేదు.

సలబత్‌ఖాన్ విమలసింహుడితో, "పాదుషావారు ఇక్కడికి వస్తున్నారు. ఏది దారి?" అన్నాడు.

"వస్తే ఏంభయం? ఆయనకు స్వాగతం ఇవ్వడానికి మన దేహారీచరణు డున్నాడు గద!" అంటూ మహమ్మద్‌జాన్‌ను చూపించాడు.

ఆ సమయంలో కోతియాపంలో దులాలీ వచ్చి వారిముందు వాలింది. అప్పటికి పాదుషా పరివారం సిక్రీనగరాన్ని సమీపిస్తున్నది. సలబత్‌ఖాన్ హమీదా వెంట బెట్టుకుని సమీపగ్రామానికి వెళ్ళిపోయాడు. దులాలీ రాళ్ళగుట్టలమధ్య మాయమయింది. విమలసింహుడు సలబత్‌ఖా నింటికి వెళ్ళాడు. మహమ్మద్‌జాన్ పక్కనున్న ఇంటోకి వెళ్ళాడు. కొంతసేపటికి అతను మౌల్వీవేషంలో బయటికి వచ్చి, పాదుషారాక కెదురు చూడసాగాడు.

విమలసింహుడు లాలియాను కలుసుకుని, అందరూ క్షేమంగా ఉన్నారని చెప్పి, ఆమె భయంపోగొట్టాడు.

"సరేగాని, పాదుషావారు ఇక్కడికి ఏంపనిమీద వస్తున్నట్టు? తాతను మళ్ళీ బాధించటానికి కాదుగద?" అన్నది లూలియా.

"ఏమో! కాని బేహారీచరణు డుండగా మన కేం భయం?" అన్నాడు విమల సింహుడు.

"పాదుషావారి నెన్నడూ చూడలేదు. ఆయన ఎలా ఉంటారు?'' అన్నది లూలియా.

"నాలాగే ఉంటారు." అన్నాడు విమలసింహుడు.

''అర్థంలేనిమాట." అన్నది లూలియా .. ...

* * * *

పాదుషా నగరం ప్రవేశించి తనకోసం సిద్ధంగాఉన్న శిబిరం ప్రవేశించాడు. సేనాపతు లందరూ తమతమ శిబిరాలను నగరంచుట్టూ వేసుకోవాలనీ, నగరాన్ని వెయ్యికళ్ళతో పరిశీలిస్తూ, కొత్తవాళ్ళెవరైనా కనబడితే తనవద్దకు తీసుకురావాలనీ ఆయన ఉత్తరువిచ్చి, నూర్జహాన్ విశ్రాంతి తీసుకున్న అనంతరం తనవద్ద కొకసారి రావాలని కబురుచేసి జరిగినదాన్ని గురించి ఆలోచిస్తూ ఉండగా, ఆయన దర్శనార్థం మౌల్వీ వచ్చాడు. పాదుషా మౌల్వీని లోపలికి రానివ్వమన్నాడు.

మౌల్వీ పాదుషా చూపిన ఆసనంమీద కూర్చుంటూ, "ఈ నగరంలో ఇప్పుడు నే నొక్కణ్ణే ఇంకా ప్రాణాలతో ఉన్నాను," అన్నాడు.

"అదేం? సలబత్‌ఖాన్ ఇప్పు డిక్కడ ఉండడంలేదా?'' అని పాదుషా అడిగాడు.

"ఈ ఉదయంవరకూ ఇక్కడే ఉన్నాడు, కాని మహమ్మద్ టోకీ హఠాత్తుగా ఆయననూ, ఆయన నౌకర్లనూ పట్టి బంధించాడు.''

"అలా చెయ్యమని ఎవ రతన్ని ఆజ్ఞాపించారు?"

"నాకు తెలీదు."

"అయితే వాళ్ళిప్పు డెక్కడ ఉన్నారు?"

"ఏమో? టోకీ వాళ్ళను వెంటబెట్టుకుని___"

''అసంభవం. యుద్ధానికి ఖైదీలను తీసుకుపోడు.''

"అయితే వా రందరూ మరణశిక్ష పొందేఉంటారు."

పాదుషా అదిరిపడి, "సలబత్‌ఖాన్‌కు మరణశిక్ష? ఎవరు విధించి ఉంటారు?" అన్నాడు.

"నా కేమీ తెలీదు. అది నా అనుమానం మాత్రమే. ఇంతకూ నేను వచ్చిన పని

ఏమంటే, ఈ నిర్జన ప్రదేశంలో ఒంటరిగా ఉండలేను. నా పని మరెవరికైన ఇప్పించి పుణ్యం కట్టుకోండి.''

పాదుషా అసఫ్‌ఖాన్‌కోసం మనిషిని పంపి, మౌల్వీతో, ''నువు అబద్ధం ఆడవు. నువూ, ఖానూగాక సిక్రీనగరంలో ఎవరైనా ఉన్నారా? కనీసం ఉండేవారా?'' అన్నారు.

"ఎవరూ లేరు, ఉండేవారుకూడా లేరనే చెప్పాలి. ఇక్కడికి పైవాళ్ళెవరు వచ్చినా నాకుగాని, సలబత్‌ఖాన్‌కుగాని తప్పక తెలుస్తుంది. ఎవరికి తెలిసినా ఇద్దరికీ తెలిసినట్టే."

"అది ఏమంత నమ్మదగినమాటకాదు. నువు మునిలాటివాడివి. నీకు ఈశ్వర ధ్యానం తప్ప మరొక గొడవలేదు. సలబత్‌ఖాన్ ఏ రాజకీయ కుట్రలోనూ చేర లేదనీ. అతను ప్రతిదీ నీతో చెప్పారనీ ఎలా అనుకోవటం?''

'మీ రన్నదికూడా నిజమే.''

"ఇక్కడి దయ్యాలూ, పిశాచాలూ – వీటిమాట ఏమిటి?"

''నమ్మకండి. శుద్ధఅబద్ధం.''

పాదుషా చిరునవ్వు నవ్వి, "ఎలా చెప్పగలవు?'' అన్నాడు.

''సలీంఫకీరు సమాధిగల ఈ పవిత్రస్థలంలో, మక్కామసీదుకు నకలుగా ఉన్న ఇక్కడి మసీదులో, రోజూ అయిదుసార్లు ప్రార్థనలు జరిగేచోట పిశాచాలు నిలవగలవా?"

"సరే, నిన్నిక శ్రమపెట్టను. నేనే స్వయంగా వచ్చి, అవి పిశాచాలో, మనుషులో తేల్చుకుంటాను,'' అని పాదుషా మౌల్వీని పంపేశాడు.

అంతదాకా ఆకాశం దద్దరిల్లేలాగు చెలరేగుతూ ఉండిన సైనికకోలాహలం ఒక్కసారిగా మాటుమణిగేసరికి జహంగీరు మళ్ళీ ఏం ముంచుకొచ్చిందోనని భయభ్రాంతుడై కంగారుగా బయటికి వచ్చి, అసఫ్‌ఖాన్‌ను చూసి, "ఏమిటి విశేషం? అలా మూగవాడిలాగా నిలబడతావేం?'' అన్నాడు.

అసఫ్‌ఖాన్‌నోట ఒకంతట మాట పెగలలేదు. ''మహారాజా, ఏం చెప్పేది! ఘోరం! దారుణం! షాజాదా మరణించాడు," అన్నా డతను.

"ఈ సమాచారం నీ కిప్పుడు తెలిసిందా? నాకు ముందే తెలిసింది," అన్నాడు పాదుషా.

"మహారాజా, మహాదుర్వార్త, షాజాదా కరీమ్ చనిపోయాడు."

పాదుషాముఖం వన్నె తరిగింది. గద్గద కంఠంతో, "కరీమే? నీకు తెలిసిన దేదో చెప్పు." అన్నాడు.

"ఏం చెప్పేది? షాజాదా నగ్నకళేబరాన్ని ఢిల్లీ సింహద్వారాన పెట్టారు?"

"నీకీ సంగతి ఎలా తెలిసింది?"

"ఢిల్లీ సుబేదారు కబురు చేశాడు. ఆయన ఆ కళేబరాన్ని భద్రంగా ఆగ్రాకు పంపాడట."

"అయితే షాజాదాల కళేబరాలు రెంటినీ ఒకచోట భద్రపరచమని ఆగ్రాకు కబురుచెయ్యి. వెంటనే వెళ్ళు."

అసఫ్ ఖాన్ వెళ్ళాక పాదుషా దుర్భరమైన ఆలోచనలలో మునిగిపోయాడు. ఆయన కొడుకు లిద్దరూ ఒక్కసారిగా పోయారు. దానికి కారణం నిజంగా తనే!

"నేను నమ్మను;" అంటూ నూర్జహాన్ అక్కడికి వచ్చి, పాదుషా సమీపం లోనే కూర్చున్నది.

"జరిగినదంతా విన్నావా?" అని పాదుషా ఆమె నడిగాడు.

"ఒక్క షాజాదాకూడా పోలేదనే నా నమ్మకం."

"ఎలా చెప్పగలవు?"

"మీకు చెప్పని విషయాలు చాలా ఉన్నాయి. అవసరం కలగకనే వాటిని దాచి ఉంచాను," అంటూ నూర్జహాన్ తన భర్తకు, జులేఖాకూ గంగఅనే తమలపాకుల వర్తకురాలికీ గల సంబంధం గురించీ, జులేఖా మహబత్ ఖాన్, ఖీమసింహులతో చేస్తూఉండిన కుట్రలగురించీ చెప్పింది.

అంతా విని జహంగీర్, "నువ్వింకా తెలివిగలదాని వనుకున్నాను," అన్నాడు. నూర్జహాన్ జులేఖా కుట్రను కనిపెట్టలేకపోవటమే గాక, ఆమె మరణాన్నికూడా విశ్వసించింది. జులేఖా కుట్ర చేస్తున్నదని తెలిసినాకకూడా ఆమె జులేఖాను శ్రద్ధగా పరిశీలించలేదు.

"జులేఖా చావలేదు. ఆమె జాడ ఏమైనా తెలుసుకున్నావా?" అని పాదుషా అడిగాడు.

"అది కనిపెట్టడానికి గౌహర్జాన్ అనేవాణ్ని నియమించాను."

"ఎవడు వాడు? వాణ్ని ఎలా నమ్మావు?"

"వీడు మన్సూ సేవకుడు. నమ్మకమైనవాడు. అనుమానించ నవసరం లేదు."

"జులేఖానుకూడా నువ్విలాగే పూర్తిగా నమ్మావుకాదూ?"

నూర్జహాన్‌కు తిరిగి అవమానమయింది. ఆమెకు జహంగీరు కొత్త అవతారం

ఎత్తినట్టు కనిపించాడు. అది అతని అసలు రూపమే. అయితే నూర్జహాన్ వ్యామోహంకింద ఇంతకాలమూ అణగారిఉండింది.

"నూర్జహాన్, ఇంతకాలమూ రాజ్యతంత్రమంతా నీ పరంచేసి నేను నిశ్చింతగా భోగాలలో మునిగితేలాను. పరిపాలన విషయంలో నువ్వు చాలా ప్రతిభ చూపించావు. అయినప్పటికీ ఇవాళ మొగలు సామ్రాజ్యం నాశనమైపోయే స్థితి ఏర్పడింది. ఎందుచేతనో గ్రహించావా?" అన్నా డాయన.

నూర్జహాన్ చెప్పలేకపోయింది.

"నువ్వు స్వార్థం చూపనంతకాలమూ ఏ చిక్కూ రాలేదు; కాని నీలో స్వార్థం తలఎత్తగానే అంతా అస్తవ్యస్తమయింది. నీ కూతురిచేత, నీలాగే, ఈ మహా సామ్రాజ్యాన్ని ఏలించాలన్న బుద్ధి పుట్టింది; నీ అల్లుడు షరియారును చక్రవర్తి చేయబూనుకున్నావు. ఇలా అవుతుందనే నీ కూతుర్ని షరియారుకిచ్చి చెయ్యడానికి నే నభ్యంతరం చెప్పాను. నువు కాదని పట్టుబట్టావు; నేను పట్టువిడిచాను. జరిగిందేదో జరిగింది. దానికి విచారించడం బుద్ధితక్కువ. సింహాసనానికి అసలైన వారసుడు పర్వేజ్. కాని షలియార్‌కు ఆ సింహాసనం దక్కాలని నువు పట్టుబట్టావు. ఆ కారణంగా, ఏ కోశానా రాజ్యకాంక్షలేని కరీమ్ సింహాసనంకోసం విప్లవం లేవదీశాడు. పర్వేజ్‌ను సింహాసనంమీద కూర్చోబెట్టి రాజ్యభారమంతా మోయడానికి సిద్ధపడిన కరీమ్ విప్లవం లేవదీసి, తన సొంత ఇంటికే చిచ్చుపెట్టడం ఎంతటి అనర్థం. నీ అల్లుడు ఎంతటి దౌర్భాగ్యుడో కరీమ్ అంతటి గుణవంతుడు. వాడిలో ఏ కోశానా దురాశ లేదు. ఈ మాటలు నీకు బాధ కలిగించవచ్చు. సత్యం ఒకప్పుడు చాలా కటువుగా ఉంటుంది. షరియార్ ఒకవేళ చక్రవర్తి అయినప్పటికీ, ఆ క్షుద్రుడికి ఉత్తమవంశజులైన సామంతులు లోబడి వుంటారని ఎలా అనుకున్నావు? వాళ్ళు ఎలాగో కరీమును పిలిచి వాడికే రాజ్యం ఇచ్చేస్తారు. చివరకు మీ అన్న అసఫ్‌ఖాన్ కూడా నీకు అంశగా నిలబడడు.'' అన్నాడు జహంగీర్.

నూర్జహాన్ తన తప్పు ఒప్పుకున్నది. ''కరీమ్ బతికేవుంటా డంటారా?'' అన్న దామె.

"జులేఖా అతన్ని తన ప్రణా లడ్డువేసి కాపాడుతుంది.''

"పర్వేజ్?"

''వాణ్ని కాపాడగల జులేఖా ఎవతె ఉన్నది. మనం వాడి ఆశ వదులుకోవచ్చు.''

జహంగీరుకు దుఃఖం ఆగలేదు. తన తరవాత పర్వేజ్ చక్రవర్తి అవుతాడని ఆయన కలలు కన్నాడు. అవి భగ్నం కావడం ఆయనకు పెద్ద దెబ్బ. ఆయన దుఃఖానికి తాను కారకురాలని తెలిసి నూర్జహాన్‌కూడా చాలా బాధపడింది. అధికారమూ, స్వార్థమూ ఆమె బుద్ధిని వికటింపజేశాయి గాని, ఆమె స్వబుద్ధి చాలా మంచిది. ఆమెకు భర్తపైగల ప్రేమ అపారం.

ద్రాక్షసారాయి తాగి జహంగీర్ కొంచెం తెప్పరిల్లి, "జులేఖా మొదలైనవాళ్ళు దాగిఉండటానికి ఈ సిక్రీనగరం చాలా అనువైనది. నే నీరాత్రి ఈప్రదేశమంతా పరిశీలిస్తాను," అన్నాడు.

ఆయన అసఫ్‌ఖాన్‌ను పిలిపించి, "అజితసింహు డెక్కడ?" అని అడిగాడు.

"తమ ఆజ్ఞప్రకారం సేనలతోబాటు యుద్ధానికి వెళ్ళాడు."

"అతనికి ఈ నగరంలో పిశాచా లెక్కడ కనిపించాయిట?"

"మరియాబేగంమహలులో."

"నే నీరాత్రి అక్కడ గడపబోతున్నాను. అందుకు తగిన ఏర్పాట్లు చేయించు."

తనభర్త ఆ దయ్యాలకొంపలో రాత్రి గడపబోతున్నాడని విని నూర్జహాన్ కలవరపడి, ఆయనవెంట తానుకూడా వస్తానన్నది. కాని పాదుషా ఒప్పుకోలేదు.

పాదుషా మరియాబేగంమహలులో పడుకోబోతున్నాడనేసరికి, ఆ మహలుకు అక్బరునాటి కళాకాంతులు తిరిగివచ్చినంతపని అయింది. దానిచుట్టూ ఉండే తోట అంతా శుభ్రం చేశారు. మహలంతా చక్కగా అలంకరించారు. మేడమీద దీపాల గుత్తులు వెలిగించారు.

ఈలోపల అసఫ్‌ఖాన్ నగరమంతా ఒకసారి తిరిగి, సలీమ్ దర్గా దగ్గిర ఉండే మౌల్వీతప్ప నగరంలో ఇంకెవరూ ఉండటంలేదని రూఢీచేసుకున్నాడు. అజితసింహు డేదో పీడకల కని ఉంటాడనికూడా అతను దాదాపు రూఢీ చేసుకున్నాడు. అతను పాదుషావద్దకు తిరిగివెళ్ళి మరియాబేగంమహలు సిద్ధం చెయ్యబడిందని తెలిపాడు.

"మహలుచుట్టూ సైనికులను కాపలా ఉంచు. లోపల నేనూ, ఆలంషా మాత్రమే ఉంటాం. సైనికులు తెల్లవార్లూ అతిజాగ్రత్తగా ఉండి, ఎవరు కనిపించినా పట్టి, బంధించాలి," అని పాదుషా ఉత్తరువిచ్చాడు.

రాత్రి తొమ్మిది గంటలకు పాదుషా భోజనం ముగించుకుని, మహాభయంకరాకారుడైన ఆలంషా అనే కొజ్జాను వెంటబెట్టుకుని, మరియాబేగంమహలుకు బయలుదేరాడు ఆ కొజ్జావాడిది రాక్షసుడిలాటి అవతారం — నల్లని శరీరమూ, పెద్ద నోరూ, అందులో తెల్లగా మెరిసే పెద్దదంతాలూ, ఎర్రగా కణకణలాడే కళ్ళూనూ.



పాదుషా వెళ్ళే దారిపొడుగునా అటూ ఇటూ సైనికులు ప్రతిమలలాగా నిలబడ్డారు. ఒకరు విడిచి ఒకరు కాగడాపట్టుకుని ఉన్నారు. అసంఖ్యాకంగా ఉండే ఆ కాగడాల వెలుగులో పట్టపగలులాగే ప్రతినలుసూ స్పష్టంగా కనిపిస్తున్నది. అసఫ్ ఖాన్ స్వయంగా సైనికులపైన అజమాయిషీ చేస్తున్నాడు.

అలంషా వెంట పాదుషా మహలు ప్రవేశించి, కిందా పైనా చక్కగా పరిశీలించాడు. ఎక్కడా రహస్యద్వారాలు లేవు. ఈగ అయినా మహలులో ప్రవేశించటానికి లేకుండా తలుపులూ, కిటికీలూ మూసిఉన్నాయి. పాదుషా మేడమీది మంచం మీద కూర్చున్నాడు. అలంషా ఆయనకోసం హుక్కా, తాగుడూ సిద్ధంచేసి అందుబాటులో ఉంచాడు.

"వాకిలి తెరిచే ఉంచి, నువ్వు కిందికి వెళ్ళు. నిద్రపోయేవు. నేనుకూడా సాధ్యమైనంతవరకు మేలుకుని ఉండటానికి ప్రయత్నిస్తాను.'' అని పాదుషా అలంషాను కిందికి పంపేశాడు కాని ఆయన కాస్సేపు హుక్కా పీల్చి, సారాయి తాగి, మంచం మీద వాలుతూనే నిద్రపోయాడు కారణమేమంటే ఆయన బాగా అలసిఉన్నాడు.

అలా నిద్రపోయిన పాదుషాకు అత్యంతాద్భుతమైన స్థితిలో మెలకువ వచ్చింది. ఆయన శరీరమంతా చెమటతో ముద్దయిపోయి ఉన్నది. ఆయనకు వర్ణనాతీతమైన భయం పుట్టుకొచ్చింది. తన స్థితిని చూసి తనకే సిగ్గుగా ఉన్నది. కాస్త తాగితే మనస్సు స్థిమితపడుతుందనుకుని, ఆయన పానపాత్రకోసం చెయ్యి చాచబోయ్యాడు. చెయ్యి కదలలేదు. చప్పున లేవబోయాడు. తన శరీరం మంచానికి కట్టేసి ఉన్న

టపిపించింది. అజిత్‌సింహుడికి కలిగిన అనుభవమే ఇప్పుడు పాదుషాకుకూడా కలిగింది.*

కాని ఇది పిశాచాల పని అని పాదుషా అనుకోలేదు. ఆలంషాను కేకవేయబోతే గొంతు పెగలలేదు. ఇంతలోనే ఆయన కంటికి ఒక వింతదృశ్యం కనిపించింది. అదికూడా అజిత్‌సింహుడు చూసినదే — అదే సుందరి, అదే ప్రదేశం. అయితే ఈసారి సుందరి ప్రియుడు కరీమే! పాదుషా చూస్తూండగానే షాజాదా కరీమ్ విష పానం చేసి చనిపోయాడు. ఆదృశ్యాన్ని పాదుషా సహించలేకపోయాడు.

అంతలోనే ఆదృశ్యం అంతరించింది. పాదుషా శరీరంకూడా తిరిగి స్వాధీనంలోకి వచ్చింది. ఆయన చివాలున లేచి కత్తి దూశాడు. కాని దానితో ఏం చెయ్యాలి? ఆయన తను మామూలుగా పడుకున్నచోటనే ఉన్నాడు. దీపం వెలుగుతున్నది. గదిలో ఎవరూ లేరు. ప్రతి వస్తువూ పెట్టినచోటనే ఉన్నవి.

ఇదంతా కల అయినదీ, ఇంద్రజాల మయినదీ ఆయన ఊహించలేకపోయాడు. అంతలో ఒక భయంకరమైన ఆర్తనాదం బయలుదేరి మహలంతా మారుమోగింది. వెంటనే జహంగీరుకు మతిపోయినట్టయింది. ఆయన కత్తిదూసి, ఆత్మరక్షణార్థం గిరగిరా తిప్పుతూ, వెనక్కు తిరిగిచూసే ధైర్యంకూడా లేక, మెట్లమీదుగా కిందికి ఉరికాడు. పాదుషాకు అంత హీనస్థితి ఏనాడూ కలిగిఉండలేదు.

ఇంతకూ ఆ ఆర్తనాదం కిందినుంచే వస్తున్నది. కింద అంతా కటిక చీకటి. దీపం ఏమయిందో తెలియలేదు. పాదుషా అక్కడికి చేరేసమయానికి తలుపు తోసుకుని, సైనికులు దివిటీలతో లోపల ప్రవేశించారు. చూస్తేనే గుండెలు అవిసేటట్టుండే ఆలంషా పట్టరాని భయోద్రేకంలో ఉండి, విడిచిన బాణంలాగా బయటికి పరిగెత్తాడు. పాదుషాకూడా ఆ కొజ్జా వెనకనే పరిగెత్తాడు.

నూరుమందిని ఒక్కసారి ఎదుర్కొనే బలధైర్యాలు గల ఆలంషా మహలు ఆవరణ దాటి పారిపోయి, చెమటలు కక్కుతూ మూర్ఛపడిపోయాడు. పాదుషాకు కలిగిన అనుభవం అజితసింహుడికి కలిగినలాటిదైతే, ఆలంషా అనుభవం రఘువీరుడికి కలిగినలాటిది.

ఆలంషా, వాడి వెనకగా పాదుషా తూలుతూ పరిగెత్తుకురావటం, సింహద్వారం వద్ద కాపలావున్న ఆసఫ్‌ఖాన్ చూసి పరిగెత్తుకుంటూ సైనికులతో సహా ఎదురు వచ్చాడు. అందరూ మతుపోయి చూస్తూ వుండగా ఆకాశం దద్దరిల్లేటట్టు పెద్ద పెట్టున ఏడుపులు వినవచ్చాయి. పాదుషా పడుకున్న పై అంతస్తునుంచే ఈ రోద

*గత సంచిక చూడండి.

నాలు వినిపిస్తున్నాయి. ఇటువంటి రోదనధ్వనులనే టోకీ కూడా విపిఉన్నాడు. సైనికు లందరూ భయంతో గడగడలాడారు. ఆ రోదనధ్వని ఎలా ఆరంభమయిందో అలాగే చప్పున నిలిచిపోయింది. అసఫ్ ఖాన్ ముఖాన కత్తివాటువేస్తే నెత్తురుచుక్క లేకపోవటం పాదుషా గమనించాడు.

ఆయన సైనికులకు అలంషాను చూపిస్తూ, "వీడు మూర్ఛపోయాడు. ఉపచారాలు చెయ్యండి." అన్నాడు. అటూ ఇటూ కదిలించేసరికల్లా అలంషా కళ్ళు తెరిచాడు. కాని వాడి భయం ఇంకా పోలేదు. కొంచెం తాగినాక ఆ భయం కాస్తా పోయింది.

"ఏం జరిగింది? చెప్పు," అన్నాడు పాదుషా. వాడు వణికిపోతూ, రఘువీరుడు అజితసింహుడికి చెప్పిన కథే చెప్పాడు *

తరవాత అసఫ్ ఖాన్‌ను వెంటబెట్టుకుని పాదుషా మహాలులోకి మళ్ళీ ప్రవేశించి, అంతా మరొకసారి పరీక్షించాడు. మహాలుచుట్టూ సైనికులు కాపలా ఉండగా, అంత ఎత్తయిన గోడలు దూకి ఎవరుగాని మహాలులోకి రావటం అసంభవం.

"ఈ రాత్రివేళ పరిశోధించడం సాధ్యంకాదు. సైనికులు యథాప్రకారం జాగ్రత్తగా కాపలా కాస్తూఉండండి. నేను చెప్పేదాకా ఇక్కడినుంచి కదలవద్దు," అన్నాడు పాదుషా. ఆయన తన మేనా ఎక్కి, తన అంగరక్షకులను వెంటబెట్టుకుని కాగడాలతో సహా తన శిబిరానికి బయలుదేరాడు. దారిలో ఆయన కీ మాటలు స్ఫుటంగా వినిపించాయి.

"పాదుషా ! మాయావతి అయిన నూర్జహాన్ మాటలు విని నీ కొడుకులకు ఘోరమైన అన్యాయం చేస్తున్నావు."

ఆ మాటలను వింటూనే ఆగ్రహావేశంతో పాదుషా మేనానుంచి కిందికి దూకి, "సైనికులారా, ఇక్కడ ఎవరో దాగిఉన్నారు. పట్టుకోండి," అని కేకపెట్టాడు.

సైనికులు ఎంత వెదకినా ఎవరూ కనిపించలేదు. చేసేదిలేక జహంగీరు తిరిగి మేనా ఎక్కి తనశిబిరానికి వెళ్ళి, పక్కమీద వాలాడు. సిక్రీనగరంలో దయ్యాలూ, పిశాచాలూ తిరగటంలేదని నిరూపించటానికి ఆయన చేసిన ప్రయత్నం ఫలించలేదు. అవి నిజంగా పిశాచాలే అనుకున్నట్టయితే అవి సలబత్ ఖాన్ జోలికీ, మాల్వీ జోలికీ పోవేమన్న అనుమానం ఆయనకుకూడా కలిగింది. తన సామ్రాజ్యాని కేదో కీడు రానున్నదన్న అనుమానం ఆయనను పట్టుకున్నది.

కొద్దిసేపటికి నూర్జహాన్ ఆయనవద్దకు వచ్చింది. జరిగినదంతా ఆయన ఆమెకు చెప్పాడు. అంతా విని ఆమె, "ఇదంతా మన శత్రువులు చేస్తున్నపనే," అన్నది.

*గత సంచిక చూడండి.

అది అసంభవ మన్నాడు జహంగీర్. సిక్రీనగరంలోని ఇళ్ళన్నీ పడగొట్టించినట్టయితే నిజం బయటపడుతుందని నూర్జహాన్ అన్నది. అందుకు పాదుషా సమ్మతించలేదు.

* * * *

రాత్రి మరియాబేగం మహలులో జరిగిన విశేషాలను గురించిన వార్త తెల్లవారే సరికల్లా కార్చిచ్చులాగా సైన్యమంతటా వ్యాపించి, గగ్గోలు పుట్టించింది. మర్నాడు మిట్టమధ్యాన్నమైనదాకా అసఫ్ ఖాన్ పాదుషా పిలుపుకోసం ఎదురుచూస్తూ మరియా బేగంమహలు వద్దనే ఉన్నాడు. అప్పుడు పిలుపువచ్చింది. పాదుషా అతనితో, "మహబత్‌ఖాన్‌ను దేశంలో లేకుండా చెయ్యాలి. నువ్వు ఈ సేననంతా వెంటబెట్టుకుని ఢిల్లీకి వెళ్ళు. నాకు అంగరక్షకులు చాలు. నేను రెండురోజుల్లో వచ్చి కలుసుకుంటాను." అన్నాడు.

తిరిగి సిక్రీనగరం నిర్జనమైపోయింది. అదే లూలియాకు పరిచితమైన వాతావరణం. ఆమె ఆరేళ్ళపిల్లగా ఇక్కడికి వచ్చింది. అంతకుపూర్వం తాను మరొకరకం వాతావరణంలో ఉండినట్టు ఆమెకు లీలగా మాత్రమే జ్ఞాపకం. ఇక్కడికి రాకముందు తన తల్లీ, తన తాతా తనతో కలిసి దీర్ఘప్రయాణం చేశారు. అదంతా కలలాగా ఆమెకు జ్ఞాపకం. బుద్ధి తెలిసినాక ఆ పిల్ల తన తాతనూ, మహమ్మద్ జాన్‌నూ, హమీదానూ తప్ప మరొక మనిషిని ఎరగదు. ఒక భయంగాని, విచారంగాని ఎరగకుండా ఆమె అడవిలో పువ్వులాగా పెరిగివచ్చింది.

చాలా ఏళ్ళ అనంతరం ఆమెకు ఒక కొత్తవ్యక్తి పరిచయమయాడు. అతను విమలసింహుడు. ఆమె మనస్సు బాల్యదశను దాటి వికసించే తరుణంలోనే అతను ఆమె జీవితంలోకి అడుగు పెట్టాడు.

రెండు మూడేళ్ళగా ఆమె జీవితంలో ఒక మార్పు వచ్చింది. తమ ఇంటి పనులన్నీ నిర్వహించే హమీదా, మహమ్మద్‌జానూ ఉన్నట్టుండి ఎటో వెళ్ళిపోయి చాలాకాలం కనిపించేవారు కారు. అలాటప్పుడు లూలియా ఇంటిపను లన్నీ తానే చేసుకోవలసివచ్చేది.

లూలియా తన తాతవద్ద బెంగాలీ, సంస్కృతమూ, అరబ్బీ, పారసీ భాషలు నేర్చుకున్నది. బేహారీచరణుడి వద్ద మృగాలలాగా అరవటమూ, పక్షులలాగా కూయటమూ నేర్చింది. ఆ విద్యలో అతను అద్వితీయుడు. అతను ఎంత దూరం నుంచి మాట్లాడుతున్నదీ తెలియకుండా మాట్లాడగలిగేవాడు. లూలియా ఏమీ

తోచనప్పుడు మగవేషమూ, ముసలిదాని వేషమూ వేసుకుని సరదాగా తిరిగేది పిల్లిలాగా, కుక్కలాగా, గాడిదలాగా అరిచి, పరమానందం చెందేది.

కాని అన్నిటికన్నా ఆమెకు అతి విచిత్రమైన అనుభవం విమలసింహుడి పరిచయం. అతనితోబాటు ఆమెకు జీవితంలో ఒక కొత్త వెలుగు వచ్చినట్టయింది. అత నెవరో ఆమెకు తెలియదు. కాని అతను మాట్లాడుతూంటే ఆమెకు ఎంతో ఆనందం కలిగేది. అతను ఎదట వున్నంతసేపూ ఆమెకు మిగిలిన ప్రపంచం జ్ఞాకం వచ్చేదికాదు.

అయితే, దురదృష్టంకొద్దీ, విమలసింహుడు ఏనాడు సిక్రీనగరంలో అడుగు పెట్టాడో ఆనాటినుంచీ సిక్రీనగరంలో శాంతి లేకుండాపోయింది. హమీదా, మహమ్మద్‌జాన్‌లు ఎటో వెళ్ళి కనబడకుండాపోతూ ఉండటానికికూడా అదే మొదలు.

ఆమె విమలసింహుణ్ణి స్త్రీ వేషంలో బావిదగ్గర చూసిననాడే అజితసింహుడు సైనికులతోసహా సిక్రీనగరానికి వచ్చాడు. తరవాత మహమ్మద్‌టోకీ ఇంకా పెద్ద సేనతో వచ్చాడు. ఆ తరవాత పాదుషా స్వయంగానే వచ్చాడు. కోలాహలం మిన్నుముట్టింది.

తిరిగి సిక్రీనగరం మళ్ళీ పాడుపెట్టినట్టయింది. లూలియాకు మళ్ళీ స్వేచ్ఛ లభించింది. చాలారోజుల తరవాత ఆమె మళ్ళీ సూర్యాస్తమయవేళ బావిదగ్గిరికి వెళ్ళి, అక్కడ కూర్చున్నది. త్వరలోనే విమలసింహు డక్కడికి వచ్చాడు. కాని అతని ముఖం విచారగ్రస్తంగా ఉన్నది. అత నామెను తన చేతుల్లోకి తీసుకొని, "నేను త్వరలోనే ఇక్కడినుంచి వెళ్ళిపోవాలి. వెంటనే మన వివాహం జరగాలి," అన్నా డతను. తాను విమలసింహుడు కాడనీ, కనీసం రాజపుత్రుడుకూడా కాదనీ, తానే షాజాదా కరీమ్ అనీ అత నామెకు తెలిపాడు.

ఈ మాట విని లూలియా సంతోషించడానికి మారుగా భయపడింది.

"నువ్వేమీ సంకోచించనవసరంలేదు. అందరు షాజాదాల లాగా నేను భోగ లోలుణ్ణికాను. వాళ్ళకుండే దుర్వ్యసనాలేవీ నాకు లేవు. నేను నిన్ను చూసిన క్షణం లోనే మనసారా ప్రేమించాను. ఇది భ్రమకాదు. అదీగాక, మీ తాతకు నే నెంత రుణపడిఉన్నానో చెప్పలేను. అయినా నన్నిక్కడ దాచకపోయినట్టయితే నే నీ పాటికి ఖుస్రూలాగా ఏ గ్వాలియరు కోటలోనో దిక్కులేని చావు చచ్చిఉందును. మీ తాత రుణం తీరేదికాదు. త్రిలోకసుందరివి, నీకు ముంతాజ్‌మహల్ అని పేరు పెట్టి, నీకోసం సామ్రాజ్యానికి పట్టం కట్టుకుంటాను." అన్నాడు కరీమ్.

అతను ఆమెకు తన కథ అంతా వివరంగా చెప్పాడు — తన తండ్రి పర్వేజ్‌కు

పట్టం గట్టాలని నిశ్చయించడమూ, నూర్జహాన్ తన అల్లుడు చక్రవర్తి కావాలని నిశ్చయించడమూ, తన చేతిలో భర్త కీలుబొమ్మగా ఉండడం చూసి ఆమె కుట్రలు సాగించడమూ, మహబత్ ఖానూ, భీమసింహుడూ కలిసి తన పక్షాన రహస్యాలోచనలు సాగించడమూ, తనను తొలగించాలని నూర్జహాన్ చేసిన ప్రయత్నాలూ అతను లూలియాకు తెలిపాడు.

"నే నింకా రెండురోజులపాటు ఆగ్రాలో ఉన్నట్టుంటే నమ్మకంగా నా ప్రాణాలు పోయివుండేవి. కాని జులేఖా అనే మహారాణిపరిచారిక ఈ కుట్రసంగతి తెలుసుకుని, నన్ను ముందుగానే పంపేసింది. ఆమే నన్ను మీ తాత దగ్గిరికి పంపింది. ఇక్కడ కూడా ఉపద్రవం నన్ను వెంబడించింది. కాని ఆమె దయవల్లనే బతికి బయటపడ్డాను. ఇంకా నన్ను వెతుకుతూ నరమానవు డెవడూ ఇక్కడికి రాడు." అన్నా డతను.

"అలా అయితే మీ రిక్కడే ఉండరాదా!" అన్నది లూలియా.

"ఒక పెద్ద చిక్కు వచ్చింది. నా తరపున మహబత్ ఖాన్, భీమసింహులు సేనను పోగుచేసి యుద్ధానికి సిద్ధమయారు. భీమసింహు డిక్కడికి వచ్చి, సేనలకు నాయకత్వం వహించమని నన్ను పిలిచాడు. ఇంతలో నూర్జహాన్ ఎలాగో మా ఎత్తు కనిపెట్టి, పర్వేజ్‌కు పెద్ద సేననిచ్చి మా సేనపైకి పంపింది. యుద్ధం జరిగింది. ఏ కారణంచేతనో పర్వేజ్ చనిపోయాడు. మా పక్షాన నా మిత్రుడు భీమసింహుడు చనిపోయాడు. నేను అదముందలాగా ఇక్కడ దాక్కోకపోతే అతను చనిపోయివుండడు. నన్ను రమ్మని మహబత్ ఖాన్ చాలా తొందర పెడుతున్నాడు. నేను రాకపోతే అతను మక్కా పోతానంటున్నాడు. నీ కోసమైనా నేను నా తండ్రితో యుద్ధం చెయ్యాలి. ఇప్పుడు నా స్థితి ఎలా వచ్చిందంటే నేను చక్రవర్తినైనా కావాలి, ప్రాణాలన్నా పోగొట్టుకోవటానికి సిద్ధంగా వుండాలి." అన్నా డతను.

* * * *

చీకటిపడింది. ఆ ప్రేయసీ ప్రియులు ప్రపంచాన్ని మరిచి, తమ ప్రణయ కలాపాలలో నిమగ్నులై పోయారు.

ఆ సమయంలో గంగా, బేహారీచరణుడు సిక్రీనగరంలో అడుగుపెట్టారు. వాళ్లు దులారీకోసం చూస్తున్నారు. కరీమ్ ఆ రోజే అక్కడినుండి వెళ్ళిపోతాడనీ, ఆ రాత్రే అతనికీ, లూలియాకూ పెళ్ళి జరుగుతుందనీ వారికి తెలుసు.

వాళ్ళు మాట్లాడుకుంటూ వచ్చేటప్పుడు గంగ బేహారీచరణుణ్ణి కోతి అని

తిట్టింది. వెంటనే అతను అనేక కోతులు ఒక్కసారిగా కిచకిచలాడినట్లు ధ్వని చేశాడు. అతను ఆపగానే దూరంనుంచి జవాబు వచ్చింది.

"అదుగో, నా శిష్యురాలు దులాలీ జవాబిస్తున్నది,'' అన్నాడు బేహారీ.

''అయితే మనం ఇంటికి వెళ్ళి, మన ప్రయత్నాలమీద ఉందాం,'' అన్నది గంగ.

"ఎలా పోతావు ? తాను వచ్చేదాకా ఇక్కడే ఉండమని ఆమె చెప్పలా ?"

"అయితే వెళ్ళి దీపాలేద్దాం. ఈ పాడుచీకట్లో ఏమీ తెలియడంలేదు.''

"నీ తెలివి తెల్లవారినట్టేఉంది ఇక్కడా నూర్జహాన్ గూఢచారు లుండరనా నీ నమ్మకం. ఆనక్కముండాకొడుకు గౌహర్జాన్ ఇక్కడే ఉండవచ్చు.''

"వాణ్ణి కట్టేసి ఆగ్రాకు పంపాంగా ?"

ఇంతలో ఆ చీకటిలో ఎవరో వారిని సమీపించి, "మీరెవరు?" అని అడిగారు.

"బతికాం, తల్లీ, మేము నీ పిల్లలం,'' అన్నాడు బేహారీ.

"నువేనా, బేహారీ ?"

"గంగకూడా ఉన్నదమ్మా !''

కొత్తగా వచ్చినవారు ముగ్గురు. ఒకతె కాషాయవస్త్రాలు ధరించి, ఒక చేత త్రిశూలమూ, ఇంకొకచేత ఒక పాత్రా ధరించి, ఎంతో అందంగానూ, తేజస్సు తోనూ ఉన్నది. ఆమెవెంట దులాలీ నెత్తిన మూట మోస్తూ కనబడింది. వారిద్దరి వెంటా ఒక బ్రాహ్మడుకూడా ఉన్నాడు.

"పాదుషా మూలంగా — పాదుషా కాకపోతే, నూర్జహాన్ మూలంగా — మీకు శ్రమ కలిగిందా ?" అని సన్యాసిని అడిగింది.

"కొంచెం కలిగింది, కాని తరవాత వాళ్ళే వెళ్ళిపోయారు."

"ఏంజరిగిందేం ?'' అన్నది సన్యాసిని నవ్వుతూ.

"మా విద్య కొంచెం రుచిచూపించాం. దాంతో వారికి మొహం మొత్తింది. ఇంక ఇటుకేసి రారు."

"వాళ్ళకు అతని జాడ ఏమీ తేలీలేదుగద ?"

"ఎలా తెలుస్తుందమ్మా ?"

"షాజాదా కులాసాగా ఉన్నాడా ? నా లూలియా ఎలా వుంది ?"

"మీ దయవల్ల ఇద్దరూ బాగానే వున్నారు."

"సరే. మన మిక్కడ దేనికీ ? ఇంటికి పోదాం పదండి.''

* * * *

మహబత్‌ఖాన్ పరిస్థితి వర్ణనాతీతంగా పరిణమించింది. షాజాదా కరీమును

ఢిల్లీ సింహాసనంమీద కూర్చోబెట్టాలన్న ప్రయత్నం ఆ మహావీరుడికి ఎన్నో కష్టాలు తెచ్చిపెట్టింది. యుద్ధంలో భీమసింహుడు పడిపోయాక అతని సైనికులు బెదిరి పారిపోయారు. గాజాసింహుడు విజృంభించి మహబత్ ఖాన్‌ను తాకాడు. అది చాలనట్టు మహమ్మద్ టోకీ సైన్యాలతో వచ్చిపడ్డాడు. అదేల ఇదేల అని పాదుషాను వెంటబెట్టుకుని నూర్జహానే స్వయంగా సైన్యాలను నడుపుకుని మహబత్ ఖాన్‌పైకి వచ్చింది. అతన్ని రూపుమాపటమే ఆమె సంకల్పం. ఒకప్పుడు మహబత్ ఖాన్ ఆమెనూ, ఆమె భర్తనూ లాహోరుప్రాంతంలో బందీలుగా పట్టుకున్నాడు. ఆ సమయంలో నూర్జహాన్ అతని కళ్ళలో దుమ్ముచల్లి, తాను తప్పించుకుని, తన భర్తనుకూడా తప్పించింది. కాని అదిమొదలు ఆమె మహబత్ ఖాన్ పైన పగపట్టిఉన్నది.

ఇన్ని కష్టాలు వచ్చిపడినా షాజాదా కరీమ్ సిక్రీనుంచి కదిలివస్తే మహబత్ ఖాన్ తృప్తిపడివుండేవాడు. లూలియా ప్రేమపాశంలో పూర్తిగా చిక్కుకుపోయి కరీమ్ సిక్రీని వదలలేదు. మహబత్ ఖాన్ కబురుచేసికూడా లాభంలేకపోయింది. అతను విరక్తిచెంది, యుద్ధం మానేసి, మక్కాకు పోయే ఉద్దేశంతో సూరత్ రేవుకు బయలుదేరాడు. అప్పటికీ నూర్జహాన్ క్రోధం చల్లారలేదు. పర్వేజ్ మరణానికి మహబత్ ఖానూ, కరీమూ కారకులని నమ్మిన పాదుషా, వారిని గాని, వారి శవాలను గాని తెచ్చినవారికి బహుమాన మిస్తామని ప్రకటన చేశాడు. సిక్రీనగరంలో దాగిన కుట్రదారులను పట్టుకోవడాని కాయన ఆ నగరంలోని ఇళ్ళను ముట్టుబెట్టడాని కూడా సిద్ధపడడంచేత కరీమ్ అక్కడ దాగివుండే అవకాశంకూడా పోయింది. కాని అత నెక్కడికి పోతాడు? పాదుషాను ధిక్కరించి ఎవ రతన్ని చేరదీస్తారు?

ఉదయపూరురాణా ఎంతో ఔదార్యంతో అందుకు సిద్ధపడ్డాడు. మేవారు రాజైన కర్ణసింహుడూ, మరికొందరు రాజపుత్ర పాలకులూ తనపట్ల అభిమానం వున్నట్టు పైకి కనబరచకపోయినా, తనకు నిజంగా ప్రమాదం కలిగితే తనను ఆదుకుంటారని కరీమ్ ఎరుగును. ఉదయపూరు వెళ్ళడానికి కరీమ్ సిద్ధపడ్డాడు. కాని ఇప్పటికీ అతనికి లూలియాను విడిచివెళ్ళడం ఇష్టంలేదు. అందుచేత అతను శాస్త్రోక్తంగా లూలియాను పెళ్ళాడి, ఆమెతో కలిసి బయలుదేర నిశ్చయించాడు.

*　　*　　*　　*

ఇప్పుడు మనం మరియాబేగంమహలు రహస్యాలు కొన్ని తెలుసుకోవలసి వున్నది. ఢిల్లీ, ఆగ్రా నగరాలలో వుండే రాజమందిరాలలో వున్నట్టుగానే సిక్రీ నగరంలో కూడా అనేక రహస్యా లుండేలాగు అక్బరుపాదుషా నిర్మింపజేశాడు.



ప్రత్యేకించి ఆయన మరియాబేగంమహలును మరిన్ని అద్భుతాలతో కట్టించాడు. ఆ రహస్యాలు అక్బరుతోనే పోయాయి. వాటిని ఎరిగినవాడు మరొక డుండేవాడు. అతను ఆ నగరాన్ని నిర్మించిన శిల్పి.

అయితే ఆ శిల్పి ఎవరో, ఏమయాడో ఎవరికీ తెలీదు. అతను కొంతకాలానికి కటిక దారిద్ర్యం వాతపడి వీధులవెంట బిచ్చం ఎత్తుకోవలిసిన స్థితికి దిగజారాడు. ఆ స్థితిలో ఆ శిల్పికి సలబత్‌ఖాన్ దేవుడిలాగా తటస్థపడి దారిద్ర్యంనుంచి కాపాడాడు. అందుకు కృతజ్ఞుడై ఆ శిల్పి సలబత్‌ఖాన్‌ను మరియాబేగంమహలు రహస్యాలన్నీ చెప్పి, కాలక్రమాన చనిపోయాడు

సలబత్‌ఖాన్‌కు నిర్జనప్రదేశమైన సిక్రీనగరం, కారణాంతరాలవల్ల అత్యంత నివాసయోగ్యంగా కనబడింది. చాలాకాలంగా ఆయన మనసులో వుండే ఆశయం అక్కడ కొనసాగుతుంది. అందుచేత ఆయన, తన ఆఖరుదినాలు సిక్రీలో గడపడానికి జహంగీరునుంచి అనుమతి పొందాడు; భరణం కూడా సంపాదించాడు. మహమ్మద్‌జాన్, హమీదా అనే తన నౌకర్లను వెంటబెట్టుకుని, తన మనమరాలైన లూలియాను తీసుకుని సిక్రీకి వలసవచ్చి, అక్కడ నివాసం ఉండిపోయాడు. పెద్దవాళ్ళు ముగ్గురూ లూలియా తమ వెంట వుంటున్న సంగతి నాలుగో మనిషికి తెలియకుండా, చాలా గోప్యంగా వుంచారు.

చాలాకాలంపాటు సలబత్‌ఖాన్ సిక్రీనగరానికి సర్వాధికారిగా సాగించుకున్నాడు. ఆయన నౌకరు మహమ్మద్‌జానే. మౌల్వీ వేషంతో అక్కడ వుంటూ, తన యజమానికి సహాయపడేవాడు. అతనా మౌల్వీ వేషంతోనే పాదుషా దర్బారుకు

వెళ్ళి సలబత్‌ఖాన్‌కు మంజూరైన వార్షికం తెస్తూవుండేవాడు. అతను నిజమైన మౌల్వీయే అనుకుని పాదుషా ఎంతో గౌరవంతో చూసేవాడు.

సలబత్‌ఖాన్ కష్టాలు షాజాదా కరీమ్ రాకతో ఆరంభమయాయి. అయినప్పటికీ కరీమ్ వచ్చినందుకు ఖాన్ సంతోషించాడు. ఎప్పటికైనా కరీమే చక్రవర్తి అవుతాడని ఆయన నమ్మకం. దానికితోడు కరీమ్, ఖాన్ మనమరాలైన లూలియాను ప్రాణంకన్న ఎక్కువగా ప్రేమించి, ఆమెను పెళ్ళాడదానికి తహతహలాడుతున్నాడు. అది చూసి ఖాన్ పొంగిపోయాడు. వాళ్ళ వివాహం మరియాబేగం మహలులోనే జరుగుతున్నది.

అందులో వున్న రహస్యాల్ని పాదుషాకూడా కనిపెట్టలేకపోయాడు. దాని పై అంతస్తు కప్పు లెగువగా ఒక రహస్యమైన అంతస్తు మరొకటున్నది. మహలును పరిశీలించేవారి కది వున్నట్టు అనుమానం కూడా రాదు. మేడమీద వుండే మంచం మీద పడుకున్న వ్యక్తిని, అలాగే ఆ పై అంతస్తుకు తీసుకుపోవడానికి ఏర్పాట్లున్నాయి. అక్కడకు చేరాక మంచంమీద వున్నవ్యక్తి తాను స్వర్గం వెళ్ళాననుకుంటాడు. అక్కడ అంత అందంగా వుంటుంది. పైన వుండే రహస్య మందిరంనుంచి బయటికి వెళ్ళిపోవడానికి గోడలోనే రహస్యంగా మెట్లు అమర్చబడివున్నాయి. వాటిమీదుగా దిగివస్తే ఖాన్ వుండే ఇంటి సమీపం చేరుకోవచ్చు. సలబత్‌ఖాన్ ఇంటిని ఎవరైనా ముట్టడిస్తే ఆ ఇంట్లోవాళ్ళు ఆ మార్గంకుండా ఎవరికీ తెలియకుండా మరియాబేగం మహలులోని రహస్యమందిరానికి చేరుకుని, అక్కడ సురక్షితంగా ఉండవచ్చు. ఈ రహస్యమార్గంనుంచి చీలే మరొక రహస్యమార్గంవెంట పోతే సిక్రీనగరానికి కొంచెం దూరంగా వుండే ఆలయాన్ని చేరవచ్చు. ఆ ఆలయంలోని గర్భగుడిలో వుండే శివలింగం దిగువన ఆ మార్గం అంతమవుతుంది. లింగాన్ని పైకి నెట్టి మనుషులు బయటికి రావచ్చు. కాని ఆలయంలోకి బయటనుంచి వచ్చేవారు లింగంకింద రహస్యమార్గం వున్నట్టు ఊహించలేరు.

ఇన్ని రహస్యాలతో కూడుకున్న మరియాబేగంమహలులో కరీమ్‌కూ, లూలియాకూ వివాహం జరగబోతున్నది. పెళ్ళిప్రయత్నాలు బ్రహ్మాండంగా ఉండడము చూసి కరీమ్ ఆశ్చర్యపోయాడు. ఆ ఏర్పాట్లన్నీ హిందూసంప్రదాయానుసారమే జరిగాయి. సలబత్‌ఖాన్, మహమ్మద్‌ఖాన్, హమీదాలుకూడా హిందువుల దుస్తులే ధరించారు.

కరీమ్‌కు హిందూ పెళ్ళికొడుకు వేషమే వేసి, కిరీటం పెట్టారు. పెళ్ళితంతు



ప్రారంభంకావడాని కంతా సిద్ధంగా ఉంది. ఆ సమంయలో ఒకసన్యాసిని వెంట పెళ్ళికూతురు లూలియా అక్కడికి వచ్చింది. కరీమ్ ఆ సన్యాసికేసి ఆశ్చర్యంతో, "ఏమిటిది? జూలేఖావుకాదూ? ఇదేం వేషం?" అన్నాడు.

"షాజాదా, నీకు నా పూర్వకథ తెలీదు. నువ్వు పెళ్ళాడగోరే ఈ పిల్ల నా కూతురని _ ఒకదాసీదాని కూతురని _ తెలుసుకో. నువ్వు చక్రవర్తి కొడుకువు_ అందుచేత నీకు అభ్యంతరం ఉండే పక్షంలో ఇప్పుడే చెప్పు." అన్నది జులేఖా.

"నువ్వు దాసీవికావు, స్త్రీలలో రత్నంలాటిదానివి. నీ కూతురు త్రిలోకసుందరి - ముంతాజ్ మహల్ - నా కాబోయేరాణి," అన్నాడు కరీమ్.

జులేఖా తన పూర్వచరిత్ర గురించి అతనికి చెప్పింది. వృద్ధుడు సలబత్ ఖాన్ జులేఖా మామగారు - ఒకప్పుడు బర్ద్వాన్ జమీందారు. హమీదా అసలుపేరు శ్యామ - లూలియాకు దాది. హమీదాయే గంగ అనే పేరుతో ఆగ్రాలో తమలపాకుల వ్యాపారంకూడా నడిపింది. శ్యామ భర్త బేహారీచరణుడు - అతనే మహమ్మద్ జాన్ కూడా.

కరీమ్ ఈ వింత విషయాలన్నీ తెలుసుకున్న అనంతరం లూలియాను హిందూ వివాహవిధిప్రకారమూ, అటు తరవాత మసీదులో ముస్లిము విధిప్రకారమూకూడా పెళ్ళాడాడు. పెళ్ళి కాగానే నూతనదంపతులు ఉదయపూరుకు ప్రయాణమయారు.

ఆరావళీ పర్వతాలమధ్య ఒక కనుమ; అందులో ఒక చిన్నవాగు. ఆ చుట్టు పక్కలవారి కదే జలాధారం. ఆడవాళ్ళు నీటికోసం బిందెలు తీసుకుని వస్తున్నారు. పక్కనున్న దారివెంట పొలాలు చేసుకునేవాళ్ళు నడుస్తున్నారు. అక్కడక్కడా పశువులమంద లున్నాయి.

ఒకచెట్టునీడన ఒక భైరవులజంట కూర్చునిఉంది, అటుగా వెళ్ళేవారి దృష్టిని ఆకర్షిస్తున్నది. భైరవుడికి పాతికేళ్ళుంటాయి. భైరవి పదహారేళ్ళది. ఇద్దరూ చాలా అందంగా ఉన్నారు. వాళ్ళు పులితోళ్ళు ధరించిఉన్నారు. కౌపీనం మాత్రం ధరించి, వారి శిష్యుడొకడు, ఆ పక్కనే నిప్పులమీద రొట్టెలు కాలుస్తున్నాడు. క్రమంగా ఆ ముగ్గురిచుట్టూ జనం మూగారు.

కొంచెంసేపయాక శిష్యుడు రొట్టెలు పూర్తిచేసి, ''పార్వతీ పరమేశ్వరులు భోజనం చేస్తారు, మీరంతా దయచెయ్యండి,'' అని ఆ గుంపును తరిమేశాడు. అంతదాకా కళ్ళుమూసి ధ్యానం నటిస్తూండిన భైరవులు కళ్ళుతెరిచి మాట్లాడుకున్నారు. భైరవుడు కరీమ్, భైరవి లూలియా. ఉదయపూరు చేరేదాకా వారి కీ మారువేషాలు తప్పవు. వారివెంట ఉన్నది బేహారీ.

వాళ్ళు భోజనాలు పూర్తిచేశాక బేహారీ తన సూక్ష్మశ్రవణశక్తితో, శత్రువులు తమని వెన్నంటి వస్తున్నట్టు పసికట్టి, ''వెంటనే లేవండి,'' అన్నాడు. ఇంతలోనే దూరాన కలకలం వినిపించింది.

"అయ్యా, ఫకీరుగారూ, అటుగా వెళ్ళండి. ఇక్కడ పార్వతీ పరమేశ్వరులు భోజనం చేస్తున్నారు,'' అని కొందరు ఎవరినో బతిమాలుతున్నారు. వారిలో దులాలీ గొంతుకూడా వినిపించింది.

ఫకీరు తనను అడ్డగించినవాళ్ళను బెదరించడంకూడా వినిపించింది. ఆ ఫకీరు మరెవరోకాదు. మారువేషంలో ఉన్న గూఢచారి గౌహర్జానే.

''కొట్టండి! తన్నండి!'' అని జనం ఫకీరుమీద లేచారు.

''జై శంకర్!'' అని దులాలీ పెద్దగా అరిచింది.

కాని మరుక్షణమే శత్రుసైన్యాలు వాళ్ళను చుట్టుముట్టినట్టు స్పష్టమయింది. కరీమ్ కత్తిదూసి యుద్ధానికి సిద్ధపడ్డాడు. లూలీయాకూడా కత్తిపట్టింది.

మొగలుసైనికులు కనుమలోనికి ప్రవేశించారు. కాని ఆ సమయంలోనే బేహారీ శ్రద్ధగా ఆలకించి, "బతికిపోయాం. రాజపుత్రసేనలుకూడా వస్తున్నాయి,'' అన్నాడు.

కొద్దిసేపటికే అసంఖ్యాకులైన రాజపుత్రవీరులు కనుమ రెండోవైపునుంచి వచ్చి

కరీమ్, లూలీయాలచుట్టూ రక్షలాగా నిలబడ్డారు. మొగలు సైనికులు ఒకవందమంది దాకా ఉన్నారు. వారికి నాయకుడు టోకీ. రాజపుత్రయోధులకు నాయకత్వం వహించి వచ్చినవాడు స్వయంగా మహారాణా కర్ణసింహుడే. అతను టోకీని పిలిచి, "ఈ షాజాదా నాకూ, రాజస్థానానికంతటికీకూడా అతిథి. అతనికే అపాయమూ రారాదు.'' అని హెచ్చరించాడు.

"మహారాజా, షాజాదును పట్టి తీసుకురమ్మని పాదుషావారి ఆజ్ఞ.''

''అయితే కావచ్చు. కాని నీకు నేనూ, అంబరు, మర్వారురాజులూకూడా అడ్డు పడతాం. అజితసింహుడిదగ్గిరనుంచీ అందరూ సేనలతోసహా వస్తున్నారు. ఇంత మందితోనూ యుద్ధమే చేస్తావో, వెనక్కు తిరిగి పోతావో ఆలోచించుకో. ఈ పరి స్థితిలో వెనక్కు తిరిగివెళితే పాదుషా మటుకు నిన్నేమనగలడు? పాదుషావారితో చెప్పు — ఆయన జీవితాంతం వరకూ షాజాదా మూలంగా ఆయనకే అపాయం రాకుండా మేం చూస్తాం; ఆయన అనంతరం అతన్ని చక్రవర్తి చేస్తాం."

మహమ్మద్‌టోకీ కొద్దిమంది సైనికులతోనే బయలుదేరివచ్చాడు. షాజాదా ఒంటరిగానే ప్రయాణిస్తున్నాడనీ, అతన్ని ఫకీరు (మారువేషంలో ఉన్న గౌహర్జాన్) గుర్తిస్తాడనీ షాజాదాను పట్టి బంధించి తెమ్మనీ, పాదుషా అతన్ని ఆజ్ఞాపించాడు. కాని తనకు ఒక పెద్ద రాజపుత్రసేన ఎదురవుతుందని టోకీ కలలో కూడా అనుకోలేదు. అందుచేత అతను పరిస్థితికి తలవంచి వెనక్కు తిరిగాడు.

తరవాత కర్ణసింహుడూ, కరీమూ తలపాగాలు మార్చుకున్నారు. కరీము లూలియాను కర్ణసింహుడికి పరిచయం చేశాడు. కాని వాళ్ళందరూ ఆనందంలో నిమగ్నులై ఉన్న సమయంలో బేహారీ ఎటో మాయమయాడు. అతను దులాలీని కలుసుకోవటానికి పోయిఉంటాడని కరీం అనుకున్నాడు.

అందరూ కలిసి ఉదయపూర్ చేరుకున్నారు. షాజాదాదంపతుల కొక చలవ రాతి భవనం ప్రత్యేకించబడింది. దానికి సమీపంగా ఒక మసీదుకూడా నిర్మించ బడింది.

కరీమ్‌కోసం గంగ ఒక ఉత్తరం తెచ్చి కర్ణసింహుడి కిస్తూ, అతను వస్తున్న వార్తకూడా తెలిపింది. కర్ణసింహుడు సేనతో బయలుదేరావటానికి అదే కారణం. ఆ ఉత్తరాన్ని మహారాణా కరీము కిచ్చాడు. అది జులేఖా రాసిన ఉత్తరం. ఏ పరిస్థితులలోనూ, లూలియా హిందూకన్య అన్న విషయం బయటపెట్టవద్దని జులేఖా కరీముకు రాసింది.

కరీమ్ కర్ణసింహుడితో తన భార్య ఒక పారశీక దేశస్థుడి కుమార్తె అనీ,

ఆమె తండ్రి తనను నూర్జహాను కుట్రలనుంచి చాలాసార్లు కాపాడాడనీ, తా నామెను ప్రేమించి పెళ్ళాడా ననీ చెప్పాడు.

ఇప్పుడు లూలియా మహారాణి జీవితం గడుపుతున్నది. అయినా ఆమెకు సిక్రీ నగర జీవితమే బాగున్నది. ఈ దాసదాసీజనం మధ్య ఉండడంకన్న తన తాతా, హమీదా, మహమ్మద్‌జాన్‌లవెంట ఉండటమే ఆనందదాయక మనిపించింది. వాళ్ళ దగ్గిర లేకపోవడంతో ఆమెకు తీరని బాధ కలిగించింది.

జులేఖా తనకు రాసిన ఉత్తరాన్ని కరీం లూలియా కిచ్చాడు. అందులో సిక్రీ నగరపు వింతసంఘటనలను గురించి అనేక వివరా లున్నాయి. మరియాబేగం మహలు కిందిఅంతస్తులో రఘువీరుణ్ణీ, ఆలంషానూ భయపెట్టి చంపినంత పని చేసినది డులాలీ. ఢిల్లీ నగరద్వారం దగ్గిర శవాలు ఎలా ప్రత్యక్షమవుతున్నదీ జులేఖా కింకా తెలియదు. వాటినిగురించి బేహారీచరణుడు ఆరాలు తీస్తున్నాడు. జులేఖా రహస్యా లన్నిటినీ తెలుసుకుని నూర్జహాన్‌కు చెప్పినవాడు గౌహర్జాన్. ఈ గౌహర్జాన్ మస్రూ దూత. బేగం మహలులోకి మగవాళ్ళు రాకూడదనిమాట నిజమేగాని చాలామంది యువకులు మస్రూకు భారీగా లంచా లిచ్చి, మహలులోని స్త్రీలకోసం వచ్చేవాళ్ళు. కొందరు బేగములుసైతం బయటినుంచి తమ ప్రియులను లోపలికి ప్రవేశపెట్టించుకునేవారు. అలా వచ్చిన పురుషులపైన కాపలాకుగాను మస్రూ గౌహర్జానును ఆడవేషంలో ఒక దాసీగా ఏర్పాటు చేశాడు. తనను ఫకీరు రూపంలో ఒకనాడు మసీదుకు చేర్చి, అక్కడ తన రహస్యాన్ని బయటపెట్టించ యత్నించినవాడు పాదుషాయే ననికూడా జులేఖా రాసింది. తాను బతికిఉంటే కరీమ్ పట్టాభిషేక సమయాన కనిపిస్తాననీ, తనకు కూతురులాటి డులాలీని కనిపెట్టి ఉండ మనీ చెప్పి జులేఖా తన లేఖను ముగించింది.

*　　　*　　　*　　　*

బేహారీ, డులాలీ ఏమయారు ? కర్ణసింహుడు సైన్యంతోసహా వచ్చి అంతా కోలాహలంగా ఉన్నప్పటికీ బేహారీ, ఫకీరువేషంలో ఉన్న గౌహర్జానును ఒక కంట కనిపెడుతూనే ఉన్నాడు. తనను ఎవరూ చూడటంలేదుగదా అనుకొని గౌహర్జాన్ గుర్రంమీదినుంచి కిందికి జారి, అతివేగంగా అరణ్యంలోకి పారి పోయాడు. ఆ ఫకీరు ఫలానా అని బేహారీకి తెలియదు; అయినా వాడు పారి పోవటంతో అతవి అనుమానం మరింతఅయి, తానుకూడా వాడివెంట పరిగెత్తాడు; కాని ఫకీరు చెట్ల, పుట్టలమధ్య ఎటో మాయమయాడు.

బెహారీ ఎత్తయిన ప్రదేశానికి ఎక్కి చుట్టూ చూశాడు. తిరిగిపోతున్న మొగలు

సైనికులబారు దూరంగా కనబడింది. ఇంతలోనే సమీపంలో అతని కొక దారుణ మైన ఆర్తనాదం వినబడింది. బేహారీ అటుకేసి పరిగెత్తి ఒక దారుణ దృశ్యం చూశాడు. దులాలీ ఫకీరు కాళ్ళను బలంగా పట్టుకుని, కోతిలాగా కాళ్ళను కొరుకు తున్నది. బాధ భరించలేక ఫకీరు బొబ్బలుపెడుతూ, తన కత్తిదూసి దులాలీని నరకబోయాడు. ఒక్క లిప్తలో బేహారీ ఫకీరుమీద దూకి, వాడి చేతులు గట్టిగా పట్టుకున్నాడు. బేహారీ తాకిడికి ఫకీరు కిందపడ్డాడు. వాడితోబాటు బేహారీకూడా పడ్డాడు. బేహారీ లేచేలోపల ఎక్కడినుంచో ఇద్దరు పఠానులు అతనిపైనపడి, అతని నోరూ, కాళ్లూ, చేతులూ బంధించి, అతన్ని పట్టుకుని పరిగెత్తిపోయారు. ఈ లోపుగా దులాలీ గబగబా చెట్టెక్కింది. ఆమెను వాళ్లెవరూ చూడలేదు.

సమీపంలో పొదలచాటున మూడుగుర్రాలు నిలిచిఉన్నాయి. ఒకదాని పొట్టకు బేహారీని దృఢంగా బంధించారు. తరవాత ముగ్గురూ మూడుగుర్రాలమీద ఎక్కారు. ఫకీరుకు దులాలీ జ్ఞాపకం వచ్చి, "ఆ సైతా నేమయింది ?" అని అడిగాడు.

"మేం చూడలేదే ? అదేదో కోతి అయిఉంటుంది. ఈ అడవిలో కోతులు మహాజాస్తి," అన్నారు పఠానులు. అక్కడ ఉండటం అపాయకరమని వాళ్ళు హెచ్చరించినమీదట, మూడుగుర్రాలూ కదిలాయి. వీలయినంత త్వరగా రాజ పుతానా దాటిపోవటమే వాళ్ళ ఆశయం.

వాళ్ళు బయలుదేరగానే దులాలీ చెట్టు దిగివచ్చి, ఒకచోట దాచిఉంచిన తన గుర్రాన్ని ఎక్కి, వాళ్ళను కొంతదూరాన వెంబడించ నారంభించింది.

మధ్యదారిలో పఠానులకు ఒక అనుమానం వచ్చింది. వాళ్ళు బేహారీని ఎందుకు మోసుకుపోవడం ? పాదుషాబేగముకు ఆ దౌర్భాగ్యుడితో ఏం పని ?"

"మనం షాజాదాను కలుసుకున్నట్టు గుర్తుగా వీణ్ణే చూపించాలి," అన్నాడు ఫకీరు.

వాళ్ళ కింకొక సమస్య ఏర్పడింది. వాళ్ళు హిందువుల గ్రామాలమీదుగా ప్రయాణం చెయ్యవలసిఉన్నది. ఒక హిందువుణ్ణి ఇలా కట్టి ముగ్గురు ముసల్మానులు తీసుకుపోతుంటే, గ్రామప్రజలతో తంటారావటం తథ్యం. అందుచేత వాళ్ళు గుర్రాలను ఆపి, బేహారీ కట్లు విప్పి, అతన్ని ఒక పఠానుముందు, గుర్రంమీద కూర్చునేటట్టు చేశారు.

"మూగవాడిలాగా నోరు మూసుకుని గుర్రంమీద కూర్చో. నోరెత్తావో తల ఎగిరిపోతుంది," అని ఫకీరు బేహారీని బెదిరించాడు. మొత్తంమీద ఏ ప్రమాదమూ

జరగకుండానే వాళ్ళు హిందువులగ్రామాలు గడిచి, మొగలు సామ్రాజ్యం పొలిమేరలో ప్రవేశించి, సాయంకాలానికల్లా మహమ్మద్‌టోకీ మజిలీ చేసిన సత్రానికి చేరుకున్నాడు.

టోకీ బేహారీని చూసి, "వీ డెవడు ? ఎందుకు తెచ్చావు ?" అని ఫకీరు నడిగాడు.

"వీడు షాజాదావెంట ఉండిన నౌకరు. వీణ్ణి చూపితే మహారాజు మనమాటలు నమ్మి బహుమానం ఇస్తారు," అన్నాడు ఫకీరు.

షాజాదాను పట్టుకోలేక తిరిగిపోతున్నందుకు చిరచిర లాడుతున్న టోకీ ఈసడింపుగా, "ఆ బహుమాన మేదో నువే తీసుకో. నా కవసరంలేదు," అన్నాడు.

ఫకీరుకు చాలా కోపం వచ్చి, టోకీపైన కసితీర్చుకోవా లనుకున్నాడు. బంధితుడై ఉన్న బేహారీని జాగ్రత్తగా కనిపెట్టిఉండమని పఠానులతో చెప్పి, ఫకీరు సత్రంలోపలికి వెళ్ళాడు.

చీకటిపడింది. వంట పూర్తిఅయింది. అందరూ భోజనాలు చేస్తున్నారు. బేహారీ తిండివిషయం ఆలోచించినవారు లేరు. అకస్మాత్తుగా సమీపంనుంచి పులిగాండ్రింపు వినపడింది. అసలే చీకటి. చుట్టూ కీకారణ్యం. పులిగర్జన వినేసరికి అందరూ సత్రంలోకి వెళ్ళి తలుపులు మూసుకున్నారు, బేహారీ సత్రం అరుగుమీద ఒంటరిగా ఉండిపోయాడు. అతను పారిపోదలిస్తే అడ్డేవాళ్ళులేరు. కాని అతను పారిపోలేదు. ముసుగుపెట్టి కూర్చున్నాడు.

కొంచెంసే పయాక టోకీ ఆయుధాలనూ, కాగడాలనూ వెంటబెట్టుకుని, పులివేటకుగాను బయటికి వచ్చాడు. అతనిచుట్టూ సాయుధవీరు లున్నారు. అందరూ చేరి సత్రంచుట్టూ కొంతసేపు తిరిగి, తమను చూసి పులి భయపడి పారిపోయి ఉంటుం దనుకుని వాళ్ళు లోపలికి పోతుండగా పందిపిల్ల అరుపులాటిది వినపడింది.

వెంటనే టోకీ తనకు సమీపంలోఉన్న ఫకీరుమీద విరుచుకుపడి, "ఎవడురా నువు ? బద్మాష్ ! ముసల్మాను పుటకపుట్టి పందిపిల్లను నీ బట్టల్లో దాచావా ? మహారాణి పంపిందిగనక బతికిపోయావు; లేకపోతే నీతల తీసిఉండేవాణ్ణి," అన్నాడు.

తమ నాయకుడు అంతకోపంగా మాట్లాడేసరికి, టోకీ సైనికులు ఫకీరును తలా ఒకతన్నూ తన్నారు. తనదగ్గిర పందిపిల్ల లేదని ఫకీరు విలవిలలాడాడు. వెదురుకర్రలు తెచ్చి ఫకీరుదుస్తులు ఎత్తిచూశారు. పందిపిల్ల జాడలేదు. మళ్ళీ అందరూ కలిసి పందికోసం సత్రంచుట్టూ తిరిగారు. అది కనిపించలేదు.

వాళ్లు మళ్ళీ సత్రంలోకి పోబోతుండగా ఆకాశంనుంచి ఏదో ధ్వని సన్నగా బయలుదేరి, అంతకంతకూ దగ్గిరికి వస్తూ, భయంకరంగా దిక్కులన్నీ కమ్మి సాగింది. మొగలు సైనికులకు మతులు పోయాయి. నిర్జనమైన ఆ ప్రదేశంలో దయ్యాలున్నాయేమో నన్న అనుమానం మరింత ఎక్కువ అయింది. టోకీకికూడా దడ పుట్టుకొచ్చింది. ఇక్కడినుంచి బయలుదేరిపోవడానికి గుర్రాలను సిద్ధం చెయ్యమని సైనికుల కుత్తరు విచ్చాడు. ఎవరి ఉత్తరువులూ అవసరంలేకుండానే ఫకీరూ, అతని పఠానులూ తమ గుర్రాలపైకి దూకారు. ఇంతలోనే ఎక్కడినుంచో అనేకమంది ఆడవాళ్ళు గొల్లున ఏడుస్తున్న ధ్వని బయలుదేరింది. తుపాకి వేస్తే పిట్టలు పారిపోయినట్టుగా అందరూ చెల్లాచెదరుగా సత్రంనుంచి పారిపోయారు.

బేహారీ ముసుగు తీసేసి, తనలో తాను నవ్వుకుంటూ, ''ఈ వెధవలా నన్ను పట్టేది?'' అనుకుంటూ లేచి బయటికి వచ్చి, "దులాలీ,'' అని పిలిచాడు.

"జయ్, జయ్!" అంటూ దులాలీ వచ్చింది. మొగలుసైనికులను అదరగొట్టటానికి బేహారీ చేసిన చప్పుళ్ళు ఆమెకు సంకేతాలుగా పనికివచ్చాయి.

ఆ రాత్రి వాళ్ళు ఆ సత్రంలోనే పడుకుని నిశ్చింతగా నిద్రపోయారు. తెల్లవారాక బేహారీ, ''నువు ఉదయపూరుకు తిరిగివెళ్ళి ఇక్కడ జరిగినదంతా మన వాళ్ళకు చెప్పు. నేను గౌహర్జాన్ సంగతి కొంచెం చూడడానికి ఆగ్రా వెళ్ళి త్వరలోనే తిరిగివస్తాను," అని చెప్పి దులాలీని పంపేశాడు.

ఆగ్రా నగరందారి పట్టిపోతున్న బేహారీకి ఫకీరు త్వరలోనే తగిలాడు. ఏం జరిగిందంటే, దయ్యాల బెదురుతో పరిగెత్తినవాళ్ళు తలా ఒకదారి పట్టారు. ఫకీరు గతికూడా అంతే అయింది. తెల్లవారాక గాని ఫకీరు సరిఅయిన దారికి రాలేదు. తెల్లవార్లూ పరిగెత్తిన ఫకీరుగుర్రం అలసిపోయి నెమ్మదిగా నడుస్తున్నది.

"అయ్యా!" అని వెనకనుంచి ఎవరో పిలవడం విని ఫకీరు వెనక్కు తిరిగి చూసి, తన ఖైదీని గుర్తించి, "ఓరి దరిద్రుడా, నువేనా?'' అన్నాడు.

"చిత్తం, నేనేనండి," అన్నాడు బేహారీ.

"ఎక్కడికి బయలుదేరావు?''

''తమ దగ్గిరికే."

"నా దగ్గిరికి దేనికి?"

"దిక్కులేని ముసలిముండాకొడుకును. ఆ సన్యాసులు కనిపిస్తే వాళ్ళనాశ్రయించి వాళ్ళవెంట వెళ్ళాను. నన్ను పట్టుకొని ఈ నట్టడవిలో పారేసి, తమ దారిని తమరు బయలుదేరారు; నా కేంగతి?"

"ఎక్కడన్నా బిచ్చమెత్తుకో, పో."

"ఎవరు బిచ్చం పెడతారు? మీ వెంటే వస్తాను. పాదుషావారి దగ్గిరికి తీసుకు పోండి. వారే నన్ను కాపాడతారు."

ఆ ముసలాడి మాటలు నమ్మాలో, నమ్మరాదో గౌహర్ఖాన్ నిశ్చయించుకోలేక పోయాడు.

"మహమ్మదీయ మతం పుచ్చుకుని, ఆవుమాంసం తిను,'' అన్నాడు వాడు. బేహారీ పెద్దపెట్టున ఏడవసాగాడు. వద్దులే, ఊరుకో అన్నదాకా ఆగలేదు.

ఇద్దరూ కలిసి ఒక గ్రామం చేరారు. అది హిందువులుండే గ్రామం. బేహారీ గౌహర్ఖానును కొంచెం ముందుకు వెళ్ళనిచ్చి గ్రామస్థులతో, "ఈ ఫకీరు హిందువు లందరినీ మహమ్మదీయుల్ని చెయ్యటానికి వచ్చాడు; కాస్త జాగ్రత్తగా ఉండండి," అన్నాడు.

వెంటనే గ్రామస్థులు ఫకీరును చుట్టుముట్టి, కర్రలతో చావగొట్టి, గుర్రాన్ని కూడా కొట్టి, గ్రామంనుంచి తరిమేశారు. గౌహర్ఖాను చావుతప్పి కన్నులొట్టపోయి, ఊరిబయట ఒక చెట్టుకింద చేరాడు. బేహారీ అక్కడికి వెళ్ళి, "అయ్యో!" అన్నాడు.

"ఒరే సైతాన్, నా ఎదటినుంచి పోరా!" అని గౌహర్ఖాన్ అరిచాడు.

"ఓరి పాపీ, నేను నీ ప్రాణాలు తీస్తానని భయపడకు. నీ దుర్మార్గమంతా పాదుషావారికి చెప్పి ఉరిశిక్ష వేయిస్తాను. షాజాదాకు నేను కవచంలాంటివాణ్ణి. ఎన్నడూ అతని జోలికి రాకు," అని బేహారీ అక్కడినుంచి బయలుదేరి ఆగ్రాకు చేరాడు.

ఆ సమయంలో జహంగీర్ సభచేస్తున్నాడు. ఈ లోపుగా ఆయనకు పర్వేజ్ నిజంగా చనిపోయాడన్న సంగతీ, కరీమ్ ఉదయపూరుకు క్షేమంగా చేరి, రాజపుత్రరాజు లందరికీ అతిథిగాఉన్న సంగతీ తెలియవచ్చాయి. ఇప్పుడు కరీం తన కున్న పెద్దకొడుకే గనక, అతను తన అనంతరం చక్రవర్తి కావడాని కాయన సుముఖుడై, నూర్జహాన్నుకూడా సుముఖురాలిని చేశాడు. అదేసమయంలో జులేఖా నుంచి ఒక పుత్తరం వచ్చింది. పాదుషాకు రాసిన ఆ ఉత్తరంలో జులేఖా అనేక రహస్యాలు బయటపెట్టింది. "...ఇంతకాలానికి నా దీక్ష ఫలించింది. నా కూతురు షాజాదాకరీమును పెళ్ళాడింది. మీ అనంతరం అతను ఢిల్లీ సింహాసనంపైన కూర్చుంటాడు ... నా మామగారు రాజానరహరిరాయ్గారే సలబత్ఖాన్. మీరు సిక్రీనగరం వచ్చినప్పుడు కరీం అక్కడే ఉన్నాడు. అతన్ని

మీరు చూశారుకూడా. మరియాబేగంమహలులో మీరు చూసిన ప్రదర్శనంలో అతనుకూడా పాల్గొన్నాడు. పిశాచాలకథ శుద్ధఅబద్ధం. అనేక విద్యలలో ఆరితేరిన బేహారీచరణుడే మీకు అన్నిభ్రమలూ కలిగించాడు ... బేగంసాహెబా నాపైన చూపినప్రేమ ప్రశంసనీయమైనది. నేనామెకు కలలోనైనా అపకారం తలపెట్టను. మరొక్కసంగతి — గౌహర్జాన్ అనేవాడొకడు ఆడవేషం వేసుకుని బేగంమహలులో ఉంటున్నాడు. వాణ్ణి అరికట్టితేనేగాని ఢిల్లీలో జరిగే ఘోరాలు నిలవవు. బేగంమహలు పరువు దక్కదు," అని జులేఖా తెలిపింది ...

సభతీరిఉన్న పాదుషా చెవిలో, "నేను వచ్చాను," అని ఎవరో రహస్యం చెప్పినట్టయింది.

"ఎవరా మాట్లాడినది?" అని పాదుషా తన సమీపంలోనే ఉన్న వజీరు నడిగాడు.

"ఎవరూ మాట్లాడలేదే?" అన్నాడు వజీరు ఆశ్చర్యంతో.

కాని మళ్ళీ అదే రహస్యం పాదుషా చెవిలో వినపడింది. వెంటనే పాదుషాకు జులేఖారాసిన ఉత్తరం జ్ఞాపకం వచ్చింది. "బేహారీచరణు డనేవాడు వచ్చినట్టున్నాడు, లోపల ప్రవేశపెట్టండి." అన్నా డాయన.

రాజభటులు బేహారీచరణుడి పేరుపెట్టి పిలిచాక ఒక బైరాగిలాటివాడు సభికుల మధ్యగా లోపలికివచ్చి పాదుషాకు వందనం చేశాడు. మరుక్షణమే వజీరు లేచి చిందులువెయ్యసాగాడు. తన దుస్తులలో పాముచేరి బుసకొడుతున్నట్టు ఆయనకు తోచింది. అదే సమయంలో సింహాసనం కింద రెండు పిల్లులు ఘోరంగా పోట్లాడుకుంటున్నట్టు ధ్వని పుట్టింది. సభ అంతా గగ్గోలెత్తిపోయింది. అది ఆగిపోతూనే అనేకమంది స్త్రీల ఆర్తనాదం వినబడింది. అందరూ కొయ్యబారిపోయారు. పాదుషామాత్రం విరగబడి నవ్వాడు.

"బేహారీ, నీ విద్య అద్వితీయం. వజీర్ ఇతనికి లక్ష బంగారు కాసులూ, బిరుదూ ఇస్తున్నాం," అన్నాడు పాదుషా.

"నే నంత డబ్బు ఏం చేసుకునేది మహారాజా?" అన్నాడు బేహారి.

"మరి నీ కేం కావాలి?"

"మీకు తెలీదా? నా పైన అనుగ్రహం వుంటే, షాజాదా కరీమునూ, అతని భార్యనూ క్షమించండి. నా కంతకంటె ఏమీ అవసరం లేదు."

తన కొడుకుపైన బేహారీకి గల ప్రేమకు పాదుషా ముగ్ధుడయాడు. ఆయన, తన అనంతరం కరీమ్ పాదుషా అవుతాడని నిండుసభలో ప్రకటించాడు.

బేహారీకి దివాణంలో చాలా గొప్ప ఖ్యాతి వచ్చింది. అతను తండ్రి కొడుకుల మధ్య సంధి చేసి దారుణయుద్ధం తప్పించాడు. బేగములు మొదలుకొని దాసీల దాకా అందరికీ అతనంటే ఇష్టమే. అతనికి అంత ఆదరం లభించటానికి మరొక కారణం సాటిలేని అతని విద్యలు. ఒకసారి అతని శక్తులను మెచ్చి బేగంసాహెబా అతని మెడలో ఒక వజ్రాలహారం వేసింది. దానితో బేహారీ కోటీశ్వరుడయాడు.

కాని స్వేచ్ఛావిహంగంలాటి బేహారీకి ఆ దివాణం జైలులాటిది. అతను శలవు తీసుకుని బయలుదేరేటప్పుడు నూర్జహాన్ తన పేర సిక్కావేసిన బంగారు దీనారాలు పదివేలు అతని కిచ్చింది.

"దేవీ, నేను తమ కివ్వవలసినది కూడా ఒకటి వున్నది, స్వీకరించండి," అంటూ అతను ఒక ఉంగరం ఆమె చేతి కిచ్చాడు.

"దీన్ని ఎవరు నీ కిచ్చారో ఆమెనే వుంచుకోమను. ఆమె దాన్ని దుర్వినియోగ పరచ దనుకుంటాను," అన్నది నూర్జహాన్.

"అమ్మా, ఆమె ఇప్పుడు సన్యాసినిలాటిది. ఈ ఉంగరం ఆమె కెందుకు?"

"పోనీ నువు వుంచుకో."

"నేనూ సన్యసించినవాణ్ణే."

"అయితే నువు సంపాదించిన ధనమంతా ఏం చేస్తావు?"

"అమ్మా, నాకు పిల్లలు లేరు. కూతురైనా, కొడుకైనా నాకు దులాలీయే. నా డబ్బంతా దాని కిస్తాను. అందుచేత నాకు తమ రివ్వదలచినదంతా తమవద్దే వుంచి, దులాలీ వచ్చినప్పు డివ్వండి.

బేహారీ సెలవు పుచ్చుకోవడానికి వచ్చినప్పుడు పాదుషా, "ఎందుకు వెళ్ళిపోతావు? ఇక్కడే వుద్యోగం ఇస్తాను, వుండిపో," అన్నాడు.

"మహాప్రభూ, చదువు సంధ్యలు లేని నాకు తమ రేం వుద్యోగ మిస్తారు?"

"అయినా, ఒక్కపని చేసి మరీ వెళ్ళు. ఢిల్లీలో ప్రత్యక్షమయే శవాలను గురించి ఆరా తీయడానికి ఎంతమందినో నియోగించాను, కాని లాభంలేకపోయింది. ఈ పని నీవల్లనే కావాలి," అన్నాడు పాదుషా.

"చిత్తం."

"పర్వేజ్‌ను హత్యచేసిన మనిషినికూడా పట్టవలసివున్నది. నువు ఢిల్లీకి ఎప్పుడు బయలుదేరుతావు?"

"ఈ భాగ్యానికి ఢిల్లీదాకా వెళ్ళాలా మహారాజా. ఢిల్లీలో ఏ హత్యా జరగలేదు,



అన్ని హత్యలూ ఆగ్రాలోనే జరిగాయి. మళ్ళీ మాట్లాడితే ఈ కోటలోనే, బేగం మహలులోనే జరిగాయి."

నూర్జహాన్ ఆశ్చర్యపడి, "అదేమిటి? శవాలన్నీ మగవాళ్ళవీ, అవి కనిపిస్తున్నది ఢిల్లీలోనూ గదా?" అన్నది.

"నేను చెప్పేది విని తమరు ఆగ్రహించరాదు. బేగంమహలులోకి అప్పుడప్పుడూ మగవాళ్ళు వస్తూనే ఉన్నారు. ఒక మగవాడు ఆడవేషంలో ఇక్కడే ఉంటున్నాడు. అతని పేరు గౌహర్జాన్. దులాలీద్వారా నాకు చాలా విషయాలు తెలిశాయి. మన్సూరాయే ఈ గౌహర్జాన్‌ను బేగంమహలులో ప్రవేశపెట్టాడు. గౌహర్జాన్ అప్పుడప్పుడూ మేనాలలో యువకులను తెచ్చి బేగంమహలులో ప్రవేశపెడుతూవచ్చాడు. లోపలికి వచ్చిన యువకులు తిరిగి బయటికి వెళ్ళలేదు. వాళ్ళు చావక తప్పదు. వాళ్ళ కళేబరా లేమయాయి? గౌహర్జాన్ ఎలాగో వాటిని ఢిల్లీ చేరుస్తున్నాడు. ఈ రహస్యాలను మహలులోపల ఉండి దులాలీ, వెలుపల ఉండి నేనూ కనిపెట్టాం. పురుషులకోసం ముఖంవాచిఉన్న స్త్రీలు, గౌహర్జాన్‌ద్వారా యువకులను బేగంమహలులోనికి తెప్పించుకుని, విషం కలిపిన సారాయితో వారిని ఎలా హత్యచేస్తున్నారో ఒక ప్రదర్శనద్వారా పాదుషావారికి బేగం మహలులో చూపించాం. కళేబరాలు ఢిల్లీ చేరడంకూడా నేను కళ్ళారా చూశాను. వాటిని

పడవలలో అర్థరాత్రివేళ ఢిల్లీ చేర్చి, మూడు ఝాములవేళ, మూసిఉన్న సింహ ద్వారంవద్ద పెట్టి, ఆ పడవలలోనే ఆగ్రాకు తిరిగివస్తున్నాప."

బేహారీ తెలిపిన ఈ విషయాలు విని పాదుషా, బేగమూకూడా నిర్ఘాంత పోయారు. ఈ హత్యల రసహ్యం బేహారీకి తప్ప ఇంకెవరికీ తెలియ దన్న సంతోషం ఒకటే వారికి మిగిలింది.

"ఢిల్లీహత్యల రహస్యం కనుక్కున్నవాడికి లక్షనాణా లిస్తామనుకున్నాను. అది నీదే," అన్నాడు పాదుషా. అది తన నోరు కట్టడానికి ఇస్తున్న లంచ మని గ్రహించి, బేహారీ దాన్నికూడా తన ఇతర సొత్తులతోపాటు ఖజానాలోనే భద్రం చేయించి, ఆగ్రానుంచి వెళ్ళిపోయాడు.

*　　　*　　　*　　　*

పోతుటీగసైతం ప్రవేశించగూడని పాదుషా అంతఃపురంలో ఇంతటి దారుణాలు జరుగుతూఉంటే పాదుషాకుగాని, నూర్జహాన్‌కుగాని అనుమానంకూడా కలగకపోవటం ఆశ్చర్యం, అవమానంకూడా. అదృష్టవశాన ఈ రహస్యాలు పైకి పొక్కలేదు. వీటికి కారకులైన మస్రూనూ, గౌహర్జానునూ తీవ్రంగా శిక్షించవలసిఉన్నది. మస్రూ అందుబాటులోనే ఉన్నాడు. గౌహర్జాన్‌మాత్రం ఇంకా తిరిగిరాలేదు. మస్రూను ఒక్కణ్ణి శిక్షిస్తే, ఆ వార్త తెలిసి గౌహర్జాన్ పారిపోయి; బేగంమహల్‌లో జరిగిన అత్యాచారాల నన్నిటినీ లోకానికి చాటి చెప్పేస్తాడు. అందుచేత పాదుషా, పాదుషాబేగముకూడా ఏమీ ఎరగనట్టే ఉండి పోయి, మస్రూకు ఏమాత్రమూ అనుమానం తగలకుండా మసులుకున్నారు.

వారలా ఒకవారంరోజులు ఓపికపట్టిన అనంతరం గౌహర్జాన్ బేగంమహలుకు తిరిగివచ్చాడు. తిరిగి వాడూ, మస్రూ కలిసి కొత్తదౌర్జన్యాలకు పథకాలు వెయ్య సాగారు. ఒకనాడు వారిద్దరూ ఏకాంతంగా మాట్లాడుకుంటూ ఉండగా ఫైజీ అనే సర్దారు కొంతమంది సైనికులతో సహా అకస్మాత్తుగా వచ్చి ఇద్దరినీ పట్టుకుని, బంధించి, చీకటికొట్టులో వేశాక వాళ్ళిద్దరినీ వేటకుక్కలకు వెయ్యవలసిందిగా పాదుషా ఉత్తరు వయింది. లక్షలాదిజనం చూస్తూఉండగా వాళ్ళిద్దరినీ వేట




అశాంతి — మనిషికి ఇదో జబ్బే.

మనసును శాంతి పథంలో మళ్ళి పెట్టాలన్న ప్రయత్నంలో జబ్బుకు మందులా యెన్నెన్నో చేష్టలు చేశాను. మా దోసినోటి పాపాయినవ్వు, ఆమె పాలబుగ్గలమీద ఆప్యాయతతో కురిపించిన ముద్దూ, సర్వవిధాలా సుఖపెట్టే అర్ధాంగి, అపురూపమైన అభిమానం యివేవీ నా జబ్బును కుదర్చలేదు. ఒక మిత్రుని వున్నతికోసం నానా శ్రమ పడ్డాను. వాడు చేసిన తప్పును నా మీద రుద్దాడు. వాడి సుఖానికి నన్ను బురదలోకి ఈడ్చాడు. ఎదురుగా వుంటే యేం చేసేద్దునో? నిమిషనిమిషానికి మనసు కోపంతో మండి అశాంతితో నిండిపోయింది. పగ నాలో రగిలి, పొగలా పుక్కిరిబిక్కిరి చేస్తోంది.

రాత్రి పన్నెండు గంటలయినా నిద్దర రాలేదు. తల్లికి అంటుకుని పడుకున్న పాపాయి ముచ్చటయిన భంగిమను బెడ్ లైట్ కాంతిలో చూసిన మనసు కుదుట పడలేదు. లేచి ఆరుబయటకు వచ్చాను. చీకటిరాత్రి. గాలి నిర్మలమైన మనస్సులా వీస్తోంది. కాంపౌండులోని రోడ్డుకు యిరువైపులా వున్న పూల మొక్కలు కొన్ని చిగురించిన ఆకులతో,

బలివాడ కాంతారావు

మరికొన్ని విరగబూచిన పూలతో ఆహ్వానించినా నేను దూరలేదు. చప్పున తలెత్తాను. విశాల విశ్వం. నేను ఈ క్షణంలో చూస్తున్న చుక్కల వెలుగు, మనిషి యీ భూమిమీద పుట్టే ముందు ప్రయాణమైంది. విజ్ఞానంతో మనిషి తెలుసుకోగలిగిన విశ్వంలో కొద్దిభాగం, రాకెట్ ప్రయాణం చెయ్యడానికి ఆరువేల మిలియన్ల సంవత్సరాలు పడుతుందట! ఇది తూర్పు, ఇది పడమర అనే హద్దులకు విశ్వంలో అర్థం లేదు. కానీ యీ హద్దులు ఈ లోకానికీ, యీ మనిషికీ ప్రతి పనిలోను, ఆలోచనలోను అడ్డుపెట్టూనే వుంటాయ్. ఇంత చిన్న విషయమై అంత పెద్ద అశాంతి ఎందుకు రగుల్చుకున్నానన్న ఆలోచన తట్టింది.

ఈ ఆలోచన తట్టడంతో ఆకాశం నించి మెరుస్తూ ఏదో దిగుతున్నట్లు గమనించాను. విమానమయితే శబ్దముండేది. బెలూనయితే అంత పెద్ద వెలుగెక్కడిది? ఏదో సేటలైట్ అనుకున్నాను. ఎంతో వడిగా విసరిన చక్రంలా ఘర్‌మని వచ్చి నా యింటి యెదురుగానున్న మైదానంమీద మెల్లగా దిగింది. భూమిమీద వ్రాలి ఇంకా వెలిగిపోతోంది. గబగబా నాలుగు అడుగులు వేశాను. మొదట కొద్దిగా జంకినా నాలో యేంటో తెలుసుకోవాలన్న వుబలాటం దగ్గరగా తీసుకువెళ్ళింది. శంఖంలాంటి ఆకారంతో అల్లిబిల్లి తీగలూ పరికరాలతో మెరసిపోతోంది. అదొకవిధమైన వింత శబ్దం వినిపిస్తోంది. ఏ రష్యావాళ్లో, అమెరికావాళ్ళో ప్రయోగానికి వేసిన సేటలైట్ యేదో దారి తప్పి దిగిం దనుకున్నాను. అంత చిన్న దానిలో మనిషి వుండే అవకాశం లేదనుకుంటే యెవరో పలుకరించారు. నిదానించి చూశాను. తలుపు తెరవబడింది. ఒక చిన్న విగ్రహంలా ఒక అడుగున్నర పొడవున్న వింతమనిషి బయటకు వచ్చాడు. అతని శరీరం నాకు కనపడలేదు. వింత దుస్తులతో పరికరాలతో కప్పబడివున్నాడు.

"అంతా వింతగా వుందే – ఎవరు నువ్వు?"

ఏదో మాట్లాడుతున్నాడు. నా కేమీ అర్థం కాలేదు. అది మానవభాషలా లేదు. మళ్ళీ అడిగాను "ఎవరు నువ్వు?"

చప్పున నా కో పరికరం అందించాడు. చెవి దగ్గర పెట్టుకున్నాను. ఆశ్చర్యం! వాడు నాతో తెలుగులో మాట్లాడుతున్నాడు. ఇంతవరకు అర్థం కానిభాషను యీ యంత్ర మేదో తెలుగుగా మార్చి నా చెవులో వేస్తోంది. వరసగా ప్రశ్నలు వెయ్యటం మొదలుపెట్టాను.

"ఎక్కడనించి వచ్చావు?"

"నా కిప్పు డున్నదంతా యీ నౌకే! అనంత విశ్వం నా దొక్కడిదే అనుకోలేను."

"ఈ నౌక యెక్కడినించో ఒక




చోటునుంచి బయలుదేరి వుండాలి? ఆ చోటేది?"

"అయితే విను వివరంగా చెప్తాను. నేను కుజగ్రహంలో పుట్టాను. నన్ను మారిటాన్ అంటారు మీరు."

"ఇంత పొట్టివారా మీరు? యుద్ధానికి పేరుపడ్డవాళ్ళని విన్నాం. మా జ్యోతిష్య శాస్త్రంలో కుజుడు యుద్ధానికి అధినాయకుడు."

"నిజమే, మీ వాళ్ళు బాగా గ్రహించారు. ఒకప్పుడు మా పూర్వీకులు పదడుగుల మనుషులు.కానీ వృత్తి దద్దమ్మలు. అడవిలో జంతువుల్లా వుండేవారు. బుద్ధి శూన్యం. వేటాడి పచ్చి మాంసం తినేవారు. రానురాను మారిటన్ మనిషి బుద్ధిబలాన్ని పెంచుకోసాగాడు. బుద్ధిబలం పెరిగినకొద్దీ ఆకారం తగ్గసాగింది. ఇదివరకు కత్తులూ బాణాలతో పోరాడే మారిటన్లు కొత్తకొత్త మారణాయుధాలు కనిపెట్టి పోరాడేవారు. ఒకప్పుడు ధర్మసమ్మతమైన యుద్ధం దొంగదెబ్బలతో నిండి యుద్ధం అంటే అధరానికి మారుపేరై పోయింది. సుఖం కోసం బుద్ధిబలంతో యెన్నెన్నో కనిపెట్టారు. ఎక్కడికైనా యిట్టే ప్రయాణము చెయ్యగలిగే సాధనాలు, ప్రకృతి శక్తులన్నిటినీ అరచేతిలో వుంచుకుని ఆడుకునే ప్రతిభ సంపాదించాం. మారిటన్‌కి వ్యక్తిత్వం వచ్చింది. ప్రతివాడు తానొక్కడే గొప్పవాడనుకునే రోజులు వచ్చినయ్. ప్రతీదేశం తన స్వంతం చూసుకునేది. ఏ పని చేసినా అదే

దృష్టితో రాజ్యాంగం నడిపేది. ప్రతి వాడూ తన స్వతసుఖం చూసుకోడానికి తాపత్రయ పడేవాడు. సుఖానికి సాధనం డబ్బుగా పరిణమించింది. ఆ డబ్బుకోసం పోటీపడి పరుగెత్తేవాళ్ళలా మారిటన్లయిపోయారు. న్యాయం దెబ్బ తింది. సత్యం నిందలపాలైంది. ధర్మం కరువైపోయింది."

"అక్కడా మాలాటివారే వున్నారన్నమాట."

"ఇంకా విను. నేను చెప్పవలసింది చాలావుంది. మారిటన్లకి ప్రాపంచిక సుఖాలమీద వాంఛ యెంతవరకూ తీసుకుపోయిందో విను. రోజు లెలా మారాయంటే అపనమ్మకం మారిటన్ మనుషుల్లో పెరిగిపోయింది. విశ్వాసం చచ్చిపోయింది. అనుమానం అన్నది ఆత్మీయుల విషయంలోకూడా చొచ్చుకుపోయింది. మొగుడు పెళ్ళాన్ని నమ్మని రోజులు వచ్చినయ్. పెళ్ళాం మొగుడ్ని ద్వేషిస్తూనే కాపురాలు కాల్చుకోవటం అలవాటైపోయింది. సమస్యామయమైపోయింది జీవితం. ఎక్కడా శబ్దాలే – రోడ్డుమీద, యింట్లో, నీటిలో, నింగిలో – కుజగ్రహ మంతా శబ్దమయమై పోయింది. అశాంతికి ఆలవాలమై పోయింది. ప్రతిదేశం రకరకాల మారణాయుధాలు చెయ్యటం మొదలుపెట్టింది. రాబడిలో మూడువంతులు యుద్ధ పరికరాలకే వినియోగించేవారు. దాని ఫలితం ప్రజాశ్రేయస్సుకోసం ఖర్చుపెట్టగలిగింది తగ్గిపోయింది. మూడువంతుల ప్రజ కడుపు నిండక నకనకలాడిపోయే వారు. ఆకలికడుపులను అసహ్యంతో నింపుకున్నారు. ఎక్కడ చూసినా ఒకడికి ఇంకొకడికి మధ్య అసూయ – అది రేపిన జగడాలు. జగడాలవలన అశాంతి, అలజడి. ఆవేశాలు, అక్కసు – రేడియో వేసుకుంటే యీ మాటలే వినటం, పత్రికలు తిరగవేస్తే యీ కల్లోలమే చదవటం – మారిటన్ మనుషులు పశువులకంటె కనాకష్టంగా తయారవుతుంటే, ఒకనాడు కలకాలం ఆ అందమైన గ్రహంమీద బతకాలని కోరుకున్న మాలాంటివాళ్ళం, చావువల్లనే శాంతిని పొందుతామని భావించి, చావును ఆహ్వానించేవాళ్ళం."

"అక్కడా చావుందన్నమాట. అక్కడా యుద్ధాలు జరుగుతున్నాయన్న మాట – అక్కడా అటంబాంబులు కనిపెట్టారా ?"

"విను. అంతా చెప్తాను. ఆ బాంబులే అసలు అనర్థాన్ని తెచ్చిపెట్టాయ్. మనిషి మెదడు ఆరోగ్యంగా వున్నప్పుడు, యీ బాంబులు తనను యింకొకడినుంచి రక్షించుకోడానికి చేసుకున్నాడు. అది కారంలో వున్న మనిషికి ఈ నమ్మెలు, శబ్దాలు, పెరిగిపోతున్న జనాభా, నిరుద్యోగం, ఆకలి హాహాకారాలు, ఆవేశాలతో పారే నెత్తుటివరదలు,




యింట్లో భార్యవలన పడ్డ అశాంతి — ఇవన్నీకూడి మెదడుతాలూకు అరోగ్యాన్ని దెబ్బతీయసాగాయ్. సరిగ్గా ఆలోచించలేని పరిస్థితి వచ్చినా అధికారం అనే మత్తుపదార్థం త్రాగటానికి అలవాటుపడిపోయాడేమో. ఒకనాడు పొరపాటున మీట నొక్కేశాడు. ఈ ఆటంబాంబు యింకో దేశంయొక్క పెద్దపట్టణంమీద పడి సర్వనాశనం చేసింది. వాడు తక్కువ చదువుకున్నాడా? అవతలివాడు కావేశంకొద్దీ రెండు విడిచిపెట్టాడు. ఈ కల్లోలం విని నేను దిగ్భ్రాంతి చెందాను. సర్వనాశనం చేసి పీకలు తెగేసి సమస్యలను పరిష్కరించాలన్న దృక్పథం పరిపాటయిపోతోంది. పదుగుర్ని పెంచుతూ సాధించినవాళ్ళే ఘనులు — చంపుతూ సాధించినవాడు పెంచుతాడని యెలా అనుకుంటాం? అంచేత నాలాంటి శాస్త్రవేత్తకు మారిటన్ మనుషులమీద విశ్వాసం పోయింది. ఇంకెక్కడయినా మాలాంటి ప్రాణు లుంటే ఆ గ్రహం లోనికి పోదామనిపించింది. భయంలేని మనసుతో సద్వినియోగం చెయ్యగలిగా నన్ను తృప్తియిచ్చే ప్రాణుల మధ్యకు అశాంతి యెరుగని అపూర్వమైన లోకానికి పోదామని వువ్విళ్ళూరాను. నాదృష్టి యెప్పుడూ భూమిమీదనే వుండేది. నా కుజగ్రహంనించి టెలిస్కోపుతో చూస్తుంటే అక్కడక్కడా పచ్చదనం వున్నట్లే భ్రాంతి చెందేవాడిని. నా సహచరులు భూమిమీద ప్రాణులుండే అవకాశం లేదని కొట్టిపారేసేవారు.''

"ఇక్కడ ఇన్నికోట్ల మనుషులు మేం వుంటే..."

మారిటన్ మనిషి నవ్వాడు.

''మా సహచరులు చెప్పిందే నిజం ఆ సంగతి యెలా నిజమో తర్వాత

నిరూపిస్తాను. ఏం జరిగిందో విను. అంతరిక్షయానంకోసం జరిగే ప్రయోగాలలో నేనూ పాల్గొన్నాను. నన్ను భూమికి దగ్గరగా వెళ్ళి ప్రాణులుండే అవకాశం వుందోలేదో పరిశీలించి తిరిగి రమ్మన్నారు. సరే నన్నాను. ఇదిగో యీ నావ తయారుచేశారు. దీనికి స్వశక్తి వుంది. సూర్యరశ్మితో తరుగుతున్న శక్తిని నింపుకుంటుంది. ఒకనాడు ఉదయాన్నే బయలుదేరాను. రావటం భూమికి దగ్గరగా వచ్చాను. ఫొటోలు కూడా తీసి తిరగి టెలివిజన్ ద్వారా పంపించాను. అప్పుడు భూమి వేడితో మండిపోతోంది. ఇక్కడ ప్రాణి లేదు అని సమాచారం అందజేశాను. అయితే తిరిగి వచ్చేయమన్నారు. నేను రానన్నాను. ఎందుకు రావన్నారు? ఈ మారిటన్లపై నా కున్న అక్కసునంతా తిట్టుతూ వెళ్ళగ్రక్కాను. ఆ అనాగరికుల మధ్యకు మళ్ళీ రానని నొక్కి చెప్పాను. ఎక్కడకు పోతావన్నారు. ఈ విశాల విశ్వం అంతా గాలించి యెక్కడైతే నేను మనశ్శాంతినీ, తృప్తినీ పొందగలుగుతానో ఆ ప్రదేశంలో దిగుతాను."

"పొరపాటు పని చేసావు. ఇక్కడా నీకు ఆ మనశ్శాంతీ, తృప్తీ కలగవు."

"వినుమరి. విశాల విశ్వంలో లక్షలాది సంవత్సరాలు యీ నౌకపై తిరిగాను."

"లక్షలాది సంవత్సరాలే."

"విశాల విశ్వంలో కాలపరిమితి అంటూ లేదు. కాలాన్ని కొలవలేవు. సరిహద్దులంటూ లేవు. నేను ప్రయాణం చేసిన దూరాన్ని చెప్పడానికి మీకు అంకెలు లేవు. ఆ అందాన్ని, ఆ విశాలాన్ని, ఆ భావాలను, అనుభూతులనూ చెప్పడానికి తగ్గ భాష లేదు. అక్కడ చావులేదు. ముసలితనం అసలే లేదు. ఆయాసం, అల్లకల్లోలం మచ్చుకైనా కనపడదు. అడ్డులేని అనంతం – ఆకలి యెరుగని చోటు – ఇలా తిరిగి తిరిగి నేను మారిటన్ మనిషిననే మర్చిపోయాను. ఒకసారి యేం జరిగిందంటే... అల్లంతదూరాన నాలాంటి నావనే చూశాను. ఆ నావను చూడగానే నా గతం జ్ఞప్తికి వచ్చింది. నేను మారిటన్ మనిషినని గుర్తుకు తెచ్చుకున్నాను. నాకు నా గ్రహం మీదకు మనసుపోయింది. నావాళ్ళను చూడాలన్న ధ్యానం హెచ్చిపోయింది. నా పూర్వ ప్రదేశాన్ని, దాని చక్కదనాన్ని తలచుకోసాగాను. నా తల్లివంటి దా గ్రహం. ఎంత చెడ్డదైనా తల్లిని ద్వేషిస్తానా? ఇన్ని యుగాలు నే నెలా మరచిపోగలిగానూ? నా అసూయే నన్ను మరిపించిందా? అవును – నా గ్రహం పచ్చని అడవులతో పూలు కప్పిన వుద్యానవనాలతో అందమైన పట్టణాలతో, నదులూ, సముద్రాలు, మంచుతో కప్పబడిన పర్వత శిఖరాలూ,

శిల్పాలు, కట్టడాలు, మహోన్నతమైన నాగరికతతో విలసిల్లి – శరీరాలను పులకింపజేసే సంగీతం, నాట్యం, చిత్రలేఖనము, మధురమైన కావ్యాలు, నాటకాలు, కళలతో భాసిల్లుతున్న నా తల్లిని చూడకుండా యింకెంతకాలం తిరుగుతాను? నా కేంటో వింత వింత కోర్కెలు కలిగాయ్. ఎన్నియుగాలు బ్రతికినా యీ ఒంటి బ్రతుకు యేం బ్రతుకు? ఇదేం శాంతి? చచ్చిపోయిన మనిషిలా ఆలోచనలు రేకెత్తించే సమస్యలు లేని యీ బ్రతుకు యెన్నాళ్ళు? బ్రతికితే యేం లాభం? నా కేంటో అప్సరసలా వున్న అందాల అతివ వక్షంపై తల ఆన్చి కౌగలించి కన్నీరు కార్చాలన్న ఆవేశం– పాలబుగ్గల నా పసిడి సంతానం బోసి



నోటి నగవు చూస్తూ, ముద్దాడి పరవశం చెందాలన్న ఆవేదన—ఆర్జించి సుఖాలను అనుభవించి, ఆ అనుభవంతో వచ్చిన విజ్ఞానాన్ని నా తరవాత తరాలకు పంచిపెట్టాలన్న కోర్కె—నాదీ అన్న భావంతో ఆ కనిపించే అంతరిక్ష నావ వేపు నా నావను నడిపించాను."

"ఆ నావలో మనిషి భూలోకం వాడా ?'

"కాదు ; అతను నాలా మారిటన్ మనిషే. అందుకే యిద్దరం బయటకు వచ్చి ఒకరి నొకరం ఆలింగనం చేసుకున్నాం. కుశల ప్రశ్నలు వేసుకున్నాక అతను నా కంటె చాలా వెనుక బయలు దేరాడు కాబట్టి మాగ్రహం వింతలూ విశేషాలూ అడిగాను. అతను మౌనం దాల్చాడు. నా కోరికలన్నీ వుత్సాహంతో యేకరువు పెట్టాను. కాసేపయ్యాక 'మాటాడవేం,' అని అడిగాను. అతడి కంటివెంబడి కన్నీరు ధారగా కారజొచ్చింది. 'ఏమైంది ? ఇక్కడ కన్నీరు వుబికిందంటే యెంతో ఘోరం జరిగుండాలి.' 'జరిగింది' అన్నాడు. 'అదిగో చూడు...ఆ కనిపిస్తున్న గ్రహము అదే కుజగ్రహం—మన తల్లిని సరిగ్గా చూడు. నువ్వు దానిమీద వుండేటప్పుడు దానికి యెన్ని చంద్రు యుండేవి ?' అన్నాడు."

" 'నే నుండేటప్పుడుమూ డుండేవి. ఒకటి తరువాత ఒకటి వుదయిస్తూంటే యెంత అందంగా వుండేవి ? ఆ చల్లని వెలుగుల్లో యెంత శృంగారం మనం వర్ణించుకునేవాళ్ళం. ఎన్ని ప్రేమలు పూలుగా వికసించి పళ్ళుగా మారేవి ? ఆ వెన్నెల్లో మన ప్రకృతి యెంత మనోహరంగా వెలిగిపోయేది ? ఆ అందాన్ని తల్చుకుంటే ఒళ్ళు పులకరిస్తోంది. వెంటనే నాగ్రహంపై వాలాలని వుంది,' అన్నాను. అతను మెల్లగా 'అదంతా మరచిపో' అన్నాడు. 'నువ్వు విసిగి వచ్చావన్నావు; నేను విసిగిపోయి రాలేదు. విధిలేక వచ్చాను. నువ్వు గ్రహాన్ని వదిలేక చాలా మార్పులు జరిగాయ్. మారిటన్ మనుషుల జనాభా వంద సంవత్సరాల్లో పదిరెట్లు పెరిగింది. దానికి తగ్గట్లు కూడూ గుడ్డా పెరగలేదు. ఆకలితో ఒక మనిషిపై యింకో మనిషికి ద్వేషం పెరిగింది. ప్రతిదేశం తన బాగోగే చూసుకుంది. ప్రతి మనిషీ తన సంగతే చూసుకోసాగాడు. ఈర్ష్యలు పెరగ్గానే రక్షణ అవసరం కూడా కలిగింది. ప్రతి దేశం ఆటం బాంబు తయారుచెయ్యటం మొదలు పెట్టింది. అందులో ఒక దేశం నాయకులకు హృదయంలేదు; గానీ విశాలమైన దేశాన్ని అన్యాయంతో సృష్టించుకున్నారు. సముద్రంలోనూ, భూమిమీదా పరీక్షలని రోజూ యేదో ఒక ఆటం బాంబు పేలుతూనేవుండేది. సముద్రంలో చేపలు చచ్చాయ్. ఉన్నవి కలుషిత

మయ్యాయ్. నేల దద్దరిల్లి భూసారం బుగ్గయిపోయింది. సకాలంలో వర్షాలు లేవు. ఉప్పెనలు, భూకంపాలు, అగ్ని పర్వతాలు నిత్యం బాధపెట్టుండేవి. పంట తరిగిపోయింది. ఆకలి హెచ్చి పోయింది. దానితోపాటు కావేశాలు పెరిగిపోయాయ్. ఒక దేశం దగ్గరగా నున్న చంద్రునిమీద దిగింది. వాళ్ళ మనుషుల్ని అక్కడ దించి ఒక సామ్రాజ్యం స్థాపించింది. మన గ్రహం పై నున్నవాళ్ళంతా అక్కడకు పోదా మని ఆతృతపడసాగారు. చంద్రగ్రహం ఒక స్వర్గంలా అనిపించింది. మన గ్రహం ఒక నరకం అనిపించింది. ఉన్న పెట్రోలు, ఖనిజాలు అన్నీ ఖాళీ అయిపోతున్నాయ్. నేల గుల్ల అయి. పోతోంది. ఈ బాంబుల ప్రయోగాలతో నేల బీటలువారింది. అక్కడా కొట్లా టలు, అశాంతి, అసత్యం - నడుస్తూనే కొందరు పిచ్చివాళ్ళయిపోతుండేవారు. పిచ్చాసుపత్రులన్నీ మూసేశారు. ఎందు చేతంటే లోకంలో పిచ్చివాళ్ళే హెచ్చ యిపోయారు.' "

" 'ఆపిచ్చివాళ్ళలోఒకడేం చేశాడంటే తను ఆ చంద్రుని దగ్గరకు వెళ్ళలేక పోయాడు. ఇంకో చంద్రుని దగ్గరకు వెళ్ళే శక్తిలేదు. చంద్రుని దగ్గరనుంచి తెచ్చుకున్న బంగారంలో వంతు ఇస్తావా లేదా? అన్నాడు. అవతలివాడు ఫో పొమ్మని హేళన చేశాడు. డబ్బులేదు. తన దేశంలో దుర్భిక్షం - అవతలివాడి దేశంలో ఆ బంగారంతో అన్నీ కొల్ల లుగా దొరుకుతున్నట్లున్నాయ్. ఇవ్వ ననగానే పంతాలు పెరిగాయ్. నువ్వేం తంటే నువ్వేంత అనుకున్నారు. ఈ పిచ్చి అధిపతి అవతలివాడ్ని జయించ లేదు. వాడి వున్నతికి కారణమైంది యీ చంద్రుడు. 'సరే కానీయండి' అన్నాడు. పది బ్రహ్మాండమైన రాకెట్లకు పది హైడ్రోజన్ బాంబులు తగిలించాడు. చంద్రగ్రహం మీదికి వదిలేసాడు. ఈ పది బాంబులు అనుకున్నట్లే చంద్రుని తాకాయ్. చంద్రునితోపాటు కుజగ్రహం కూడా గడగడలాడింది. ఆ క్షణంలో నేను అంతరిక్షయానం కోసం యీ నౌకలో వున్నాను. ఆ చంద్రుడు పిప్పి పిప్పి అయిపోయి గుండ కావడమే తడవుగా, కుజగ్రహం తన ప్రదేశం వదలి సూర్యునికి దూరంగా పరుగెత్తింది. నేను నా నౌకనించి చూస్తూండగానే భరించలేని చల్లదనంతో మారిటన్ మనుషులంతా ఒక్కుమ్మడి చచ్చిపో యారు. లక్షలాది మారిటన్లు వేలకొద్ది సంవత్సరాలు శ్రమించి నిర్మించుకున్న నాగరికత ఒక పిచ్చివాని చేతిలో ఆహు తై పోయింది. ఇప్పుడు ఆ గ్రహంమీద ప్రాణికోటి లేదు. నేను యిలా తిరుగు తున్నాను. ఇప్పుడు చూడు. ఆ గ్రహా నికి రెండే చంద్రులు వున్నారు. అంత రిక్షయానంలో నీకు అక్కడక్కడ

ధూళి కనపడింది కదూ? అదే యీ చంద్రుని తాలూకు శేషం.' "

"ఇది నా మిత్రుడు చెప్పగానే నా నడుం విరిగిపోయింది. నా చింతకు అంతు లేకపోయింది. ఈ విశాలవిశ్వంలో నా కోరిక తీర్చుకోడానికి యెక్కడా ప్రాణి కోటి లేదనుకున్నాను. నా కేంటో బ్రతకాలని లేదు. కానీ బ్రతకటం తప్పించి చావలేను. ఇలా లక్షలాది సంవత్సరాలు మళ్ళీ విశ్వంలో ప్రయాణం చేస్తూనే వున్నాను. ఒకసారి నా టెలిస్కోపుతో చూస్తుంటే పచ్చగా ఒక గ్రహం కనిపించింది. మళ్ళీ ఆశ చిగురించింది. నా కుజగ్రహం మళ్ళీ ప్రాణికోటితో తొణికిసలాడుతుం దనిపించింది. పరిశీలించి చూడగా అది కుజగ్రహం కాదు. కుజగ్రహానికయితే యిద్దరు చంద్రులుంటారు. దీనికి ఒకే చంద్రుడున్నాడు. ఆశ్చర్యం! ఈ గ్రహం యిదివరకు నేను సోదాచేసి ప్రాణికోటి లేదన్న గ్రహమే. ఇక్కడికెలావచ్చింది? ఇదివరకు యిక్కడ కుజగ్రహం వుండేది. ఈ గ్రహాలూ వుపగ్రహాలూ ఒకదానికొకటి పరస్పర ఆకర్షణలవల్లనే విశ్వంలో శాంతంగా కదులుతున్నాయ్. ఒక ఉపగ్రహం వూడిపోగానే సూర్య కుటుంబంలో కల్లోలం బయలుదేరింది. గ్రహాల స్థానసంచలనం కలిగింది. ఇదివరకు కుజగ్రహం వున్న స్థానంలోనికి భూమి వచ్చింది. భూమిమీద అప్పుడు



ప్రాణికోటి వుద్భవించడానికి అనుకూల మైన వాతావరణం ఏర్పడింది. సంతో షంతో పరిశీలిస్తూ భూమిచుట్టూ తిరుగు తున్నాను. మీరుకూడా ఒకప్పుడు మేం చేసిన ఘనకార్యాలు చేస్తున్నారు. గగన ములో మీ నౌకల సంచలనం చూశాను. క్రిందికి చాలాసార్లు దిగాలని ప్రయ త్నించాను. మీ వాళ్ళు నా ఓడను ఫ్లయింగ్ సాసర్ అంటున్నారు. మీ విమానాలు నన్ను వెంట తరమలేవు. మీ శతఘ్నులు నన్ను గురిపెట్టి కాల్చ లేవు. మీ ఆటంబాంబులు పేల్చినా నేను చెక్కుచెదరను. ఈ మనిషి సృష్టించిన మారణాయుధాలను, వాటితో వీళ్లు ప్రద ర్శిస్తున్న హేయమైన యుద్ధాలనూ, ఆ యుద్ధాలు తెచ్చిన రక్తపుటేరులనూ,



బీభత్సాన్నీ, ద్వేషాన్నీ, ఆక్రందననీ, ఈ ధీరుల్నీ – కాదు ఈ భీరుల్నీ చూడాలని నేను రాలేదు. ఈ భూమిమీద పచ్చనిపచ్చదనం, కమ్మని గొంతుక లతో కిలకిలలాడే రకరకాల పక్షులూ, నోటిలో అమృతం వూరించే ఆడవాళ్ళ అందాల సోయగం, విశ్వం ఆలాపించే ధ్వనికి తీసికట్టన్న సంగీతం, ప్రాణం పోసుకున్న శిలలూ, శృంగారం నిండిన సాహిత్యపు గొంతుకలు, గలగలా పారే నదులూ, మబ్బులు తాకే పర్వతాలూ, మంచూ, చల్లనిగాలీ, చక్కటి యెండా, చీకటిరాత్రులూ, చిటపట చినుకులూ, మెరిసే నక్షత్రాలూ ఇవన్నీ చూస్తుంటే, వింటుంటే నా ఒళ్లు పులకరిస్తోంది. మానవనేస్తమూ, నేను వుత్తేజంతో వువ్విళ్ళూరిపోతున్నాను. ఈ అందాల ప్రకృతిపై పవశించి, హాయిగా ముద్దాడి మురిసిపోయి – నవ్వుతూ అదృష్టవంతుడ్ని కావాలని వుంది. మిత్రుడా ! నాకు దారి చూపించు. – మాటాడవేం ? తల దించావేం ? నేను పెద్దకోరిక కోరానా ?"

"ఒకప్పుడు మీ రేం చేశారో మేమూ అదే చేస్తున్నాం. మా అంత్యం తల్చుకోవడమంటే నాకు భయంవేస్తోంది." అన్నాను,

"ఇప్పుడైనా సమయం మించిపోలేదు" అంటూనే అతను ఆయాసపడిపోతున్నాడు.

"ఏం ఆలా ఆయాసపడుతున్నావ్ ?"

"నా వూపిరి తిత్తులు చిన్నవి. ఈ వాతావరణం వేరు. ఇంతవరకూ యెలాగో వుత్సాహంతో బాధను గమనించలేదు. నా కోరిక తీర్చుకోకుండానే తిరిగి వెళ్ళిపోతున్నాను ... వస్తాను... మిత్రుడా ... వస్తాను."

చూస్తూండగానే నావ అంతరిక్షానికి యెగిరిపోయింది ! నా అశాంతికి కారకుడైన మిత్రుడ్ని అసహ్యించుకున్నందుకు సిగ్గుపడ్డాను. అతనివలననే నా కో దివ్యానుభూతి కలిగి ఒక వూహాచిత్రాన్ని మనసులో సృష్టించుకోగలిగాను. అశాంతి ఒక జబ్బుకాదు. అశాంతి వుండటంవలననే మనిషి అన్వేషిస్తాడు. అన్వేషణతో వున్నవి సాధిస్తాడు. కానీ అశాంతితో మనసు పట్టు విడిచిపెట్టిన వాడు పిచ్చివాడవుతాడు. అలాంటి చపల చిత్తులకు అధికారం అప్పజెప్పకండా మానవజాతి జాగ్రత్తపడాలి.

*

పాలగుమ్మి
పద్మరాజు

# ఖండసరి చక్కెర కాశీమజిలీలు

సుందర్రామయ్యకి ఖండసరి చక్కెరతో సంపర్కం ఎల్లా ఏర్పడిందంటే – చినబాబుగారిద్వారా. అయితే చినబాబుగారికీ ఖండసరి చక్కెరకూ ఎలాంటి సంబంధమూ లేదు. ఆయనకు కలిగిన సంపర్కమల్లా బుచ్చినాయుడుతోటి.

బుచ్చినాయుడు పెద్ద పలుకుబడిగల ఊరిపెద్ద. అంటే స్వాతంత్ర్యం వచ్చిన తరువాత పలుకుబడీ పెద్దరికం సంపాదించిన వ్యక్తి. బుచ్చినాయుడు తండ్రి సూరపనాయుడు పెదబాబుగారి జమీలో కాసావాడు. జమీ పోయాక పెదబాబుగారు పోయాక, చినబాబుగారికి మిగిలిందల్లా వెనుకటి హోదా. జమీందారీ కుటుంబంలో పుట్టినవారికి మరో పని చెయ్యడానికి తరిఫీదుగాని, మనస్సుగాని లేనికారణంచేత వారు వెనకటి తరాలవారు చేసినపనులే ఇప్పుడు చేస్తున్నారు. ఒక్క జమీ పరిపాలించడం తప్ప. తమ పలుకుబడి ఇంకా తరిగిపోలేదని వారి అనుమానం. ఆ పలుకుబడి నిజంగా ఉందోలేదో తేల్చుకోడానికి వారికి కొంచెం సంకోచం. అయితే సూరపనాయుడు కొడుకు ఎమ్.ఎల్.ఎ. ఐతే తమకి 'చిన్న తనంగా ఉంటుందని ఆయనకి తెలుసు. ఎందుకంటే, చినబాబుగారు కాంగ్రెసు ప్రమాణపత్రం సంతకంపెట్టి, తమ ప్రాంతానికి ఎమ్.ఎల్.ఎ. అభ్యర్థిగా తమర్ని నిర్ణయించవలసిందిగా దరఖాస్తు పెట్టారు కాంగ్రెసు కార్యవర్గానికి. అయితే బుచ్చినాయుడుకూడా దరఖాస్తు పెట్టాడన్న సంగతి మొదట్లో ఆయనకు తెలీదు. తీరా కాంగ్రెసు అభ్యర్థిగా బుచ్చినాయుణ్ణి కాంగ్రెసువారు నిర్ణయించారని తెలియగానే ఆయనకి అరికాలిమంట నెత్తికెక్కింది. తనకన్నా బుచ్చినాయుడులో



ఏమి ఘనత ఉందని కాంగ్రెసువారతన్ని నిర్ణయించారు? పోనీ తన కన్నా బుచ్చినాయుడు ఎక్కువ కాంగ్రెసు మనిషా? వాళ్ళ నాన్న సూరపనాయుడు కూడా పెదబాబుగారితోపాటు జస్టిసు పార్టీయేగా వెనుకటి రోజుల్లో. అందులో నాయకుడన్నా కాడు. కేవలం పెదబాబుగారి సేవకుడు, అనుచరుడు. అయితే బుచ్చినాయుడికి వ్యతిరేకంగా స్వతంత్రపార్టీ తరఫున నిలబడడానికి ఆయనకి చిన్నతనమనిపించింది. అంచేత స్వతంత్రపార్టీ తరఫున బుచ్చినాయుడు మేనత్తకొడుకైన గోపినాయుణ్ణి నిలబెట్టి దండిగా డబ్బు ఖర్చుపెట్టి, బుచ్చినాయుణ్ణి ఓడించారు. బుచ్చినాయుడు సామాన్యుడా. గోపినాయుడు మైనరైనందున– అతని ఎన్నికపత్రంలో వయస్సు తప్పుగా వేసినందున, అతని ఎన్నిక చెల్లదని దావా వేసి, రద్దుచేయించాడు. ఈ లావాదేవీల మూలంగా రుజువైనవి రెండు– బుచ్చినాయుడు కన్నా, చిన్నబాబుగారి పరపతి ఎక్కువ – ఆ ప్రాంతాల్లో. అయితే– పైకి వెళ్ళినకొద్దీ – అంటే రాజకీయ నిచ్చెనమెట్లు ఎక్కినకొద్దీ – బుచ్చినాయుడు పరపతి ఎక్కువది.

అయితే ఎవరి పరపతి ఎక్కువ? అన్న మూలసమస్య తేలకుండానే ఇద్దరికీ రాజీ కుదిరిపోయింది. ఒకటి రెండు పరిస్థితులు ఆ రాజీకి దోహదం చేశాయి. ఒకటి గోపీనాయుడు ఎన్నికలకు చినబాబుగారు చాలా అప్పులు చేశారు. అంచేత ఆయనకి దినవెచ్చాని కిప్పుడు అప్పులు పుట్టడం కష్టమైపోయింది. ఇంక బుచ్చినాయుడు విషయం. చిన

బాబుగారు ఎదురు తిరిగితే తను ఎమ్. ఎల్. ఎ. కావడం కష్టం. ఈరకంగా పదునుపడ్డ నేలమీద మన సుందర్రామయ్య రాజీకి విత్తనాలు జల్లాడు.

తామరసాక్షి ఇంటివద్ద ఒక రాత్రి ఇద్దరికీ సమావేశం ఏర్పాటు చేశాడు. మనోల్లాసకర ద్రవ్యాలు బుచ్చినాయుడు తెచ్చాడు. మంచి కోడికూర చినబాబుగారు చేయించారు. తామరసాక్షి రెండూ ఇద్దరికీ వడ్డించింది. కొంత సఖ్యం ఏర్పడి, బుచ్చినాయుడూ, చినబాబుగారూ ఒకరి నొకరు కౌగలించుకుని, కంటతడి పెట్టుకుంటూ, వెనకటి రోజులు తడబాటు మాటల్లో గుర్తుతెచ్చుకోడం మొదలెట్టాక, తనొక గ్లాసు తెచ్చుకుని సుందర్రామయ్య వారిపక్కన వచ్చి కూర్చున్నాడు.

ఆ రాత్రి నోటూ పత్రం లేకుండా ఇరవై వేలు బుచ్చినాయుడు చినబాబుగారి కిచ్చాడు. చినబాబుగారు ఒక వెయ్యి సుందర్రామయ్య కిచ్చారు. పన్నెండు వేలు తామరసాక్షి వజ్రాలహారం కొనుక్కోడాని కిచ్చారు. మిగిలిన సొమ్ము తమతాలూకు చిల్లర బాకీలు తీర్చడానికి సుందర్రామయ్యకే ఇచ్చారు.

ఐతే ఒక చిక్కుపరిస్థితి ఏర్పడింది.

డబ్బు అవసరం వచ్చినప్పుడల్లా చినబాబుగారు సుందర్రామయ్యని బుచ్చినాయుడుదగ్గరకు పంపుతుండేవారు. ఐదు సంవత్సరాల అనంతరం రాబోయీ ఎలెక్షన్ మింజుమలె సంవత్సరానికి దాదాపు అరవై వేల చొప్పున 'రాజా'వారికి పెట్టుబడో, అప్పో, దానమో తెలియని పరిస్థితిలో ఇవ్వడం బుచ్చినాయుడుకి కొంచెం బాధగానే ఉంది. అయితే ఇవ్వనంటే, ఇచ్చిందంతా పోతుంది. పైగా ఎన్నికల్లో దెబ్బ. బుచ్చినాయుడు నుయ్యికీ, గొయ్యికీ మధ్యపడ్డాడు. ఈ విషయం ఇలా మూకఉమ్మడిగా అట్టేపెట్టడం ఇష్టంలేక, సుందర్రామయ్యతో సంప్రతించాడు. అసలు చినబాబుగారి మనస్సేమిటో కాస్త సూచనగానైనా తెలుస్తుందని సుందర్రామయ్య అన్నాడు :

"నాయుడూ, చినబాబుగారికి రాబడి సున్నా, ఖర్చు తగ్గలేదు. నువ్వే ఏదో సంపాదన ఏర్పాటుచేసి, అందులోంచి నీ బాకీ మినహాయించుకోవాలి. ఒకవేళ ఇంతవరకూ ఇచ్చింది, ఆయన బాకీ కింద లెక్కకట్టుకోకపోయినా, యిక మీద నీ దగ్గరకు అప్పుకి రాకుండా ఉంటే అదే పదివేలు."

"ఆరికి సంపాద నెట్టాగబ్బాఏరుపాటు జేసేది ?" అన్నాడు బుచ్చినాయుడు.

"చూడు నాయుడూ, నీ చేతులో లక్షా తొంభై వ్యాపారా లున్నాయి. అందులో ఒకటన్నాసరే – లేదంటావా, ఏదన్నా కొత్తవ్యాపారమన్నాసరే – ఆయనపేర పెట్టు. తంటాలు పడ్డానికి నేనున్నాను. ఇంకో చిన్న రహస్యముంది. నీ దగ్గర 'బ్లాక్'డబ్బు చాలావుంది. చినబాబు

గారిని అడ్డెట్టుకుని అదంతా 'వైట్' చెయ్యడానికి నీకో మార్గం చూపిస్తాను."

"ఎట్టాగయినా కరణంబుర్ర కరణం బుర్రే" అన్నాడు నాయుడు. అప్పు డాలోచించాడు ఖండసరి చక్కెర వ్యాపారం సంగతి.

నాయుడి రాజకీయ మిత్రుడి కొకరికి విశాఖపట్నం జిల్లాలో ఒక ఖండసరి చక్కెర ఫాక్టరీ ఉంది. సరుకు చాలా దిగబడిపోయిందనీ, మద్రాసు, కేరళ, మైసూరు రాష్ట్రాలకు దాన్ని ఎగుమతి చేసినట్టయితే మంచి లాభా లొస్తాయనీ అత నోసారి అన్నాడు నాయుడితో. చినబాబుగారి పేరుతో, నాయుడి డబ్బుతో సుందర్రామయ్య సంతకం హక్కుతో ఖండసరి చక్కెర అమ్మకం కంపెనీ ఒకటి తయారయింది.

వెయ్యి రూపాయలు చేత పుచ్చుకుని సుందర్రామయ్య మద్రాసులో దిగాడు. సెంట్రల్ స్టేషన్ పక్కనున్న ఒక హోటల్లో మకాంపెట్టాడు, తామరసాక్షి దూరపుచుట్టం ఒకాయన తన ఇద్దరు కుమార్తెలతో పాత మాంబళంలో ఉంటున్నాడు. కుమార్తెలు సినీమాల్లో చిన్నచిన్న వేషాలే వేస్తున్నా, పెద్ద ఖరీదైన దుస్తులే వేసుకుంటున్నారు. సుందర్రామయ్య వెళ్ళి, 'బావనీ' 'కోడళ్ళ'నీ పరామర్శ చేశాడు. ఎలెక్ట్రిక్ ట్రెయిన్ ఎక్కి సెక్రటేరియట్ మహాసముద్రంలో పడ్డాడు, ఆరితేరిన కరణం గనక, మునిగిపోకండా మెల్లగా అడంగుకి చేరుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఆ ప్రయత్నంలో కాస్త చిన్న తెప్పలా సహాయపడ్డవాడు పీతాంబరం. అత నొక గుమాస్తా - కాస్త వయసు మళ్ళిన గుమాస్తా. అతను తోటి గుమాస్తాల నడిగి విషయం తెలుసుకుని, ఆఫీసు టైపురైటర్‌మీద ఒక దరఖాస్తు టైపు చేసి, అది ఎక్కడ నమోదు చేయించాలో అక్కడ చేయించి, తన శ్రమకి ప్రతిఫలంగా ఒక ఏభై రూపాయలు పుచ్చుకున్నాడు.

"నువ్వేం దిగులు పెట్టుకోమాక, వొస్తాదిలే పరిమిట్టు. నే నుంటినిగా," అన్నాడు డబ్బు పుచ్చుకుంటూ. సుందర్రామయ్య సగం పని అయినట్టు సంతోషించి, హోటలుకి వెళ్ళి సుఖంగా భోజనం చేసి నిద్రపోయాడు.

పర్మిట్టు రావడానికి వారంరోజులన్నా పడుతుంది. ఈలోగా ఇంటికి వెళ్ళి తిరిగి రావడం అంటే శ్రమ; పైగా రైలు ఖర్చులకింద అయేది హోటలుబిల్లుకి సరిపోతుంది. అంచేత ఆ వారంరోజులూ మద్రాసులోనే ఉండిపోయాడు సుందర్రామయ్య. లాంఛనానికి పదిగంటలకి సెక్రటేరియట్‌కి వెళ్లేవాడు. ఆ తరవాత గనిరాజు— అంటే తామరసాక్షి దూరపు అన్నగారు—ఇంటికి వెళ్ళి — 'కోడళ్ళ'తో కబుర్లు చెప్పేవాడు. సాయంత్రం ఆరు గంటలవేళ పీతాంబరం'బాబాయి' ఇంటికి



వెళ్ళి, 'పిన్నమ్మ'నీ పిల్లల్నీ పరామర్శించి ఎనిమిది గంటలకి హోటలుకి చేరుకునేవాడు. ఇదీ అతని దినచర్య.

సరిగ్గా, పీతాంబరం చెప్పినట్టే, వారం రోజుల్లో దరఖాస్తుకి సమాధానం వచ్చింది, సెక్రటేరియట్ నించి.

సుందర్రామయ్య కవరు చింపి చదివాడు. మంచిమర్యాదగల ఆంగ్లభాషలో ఉంది ప్రభుత్వ ఉత్తరం. సారాంశం ఏమిటంటే :

"ఖండసరి చక్కెర యనగా నేమి ? దరఖాస్తుదారు ఈ విషయమును స్పష్టముగా వివరింప ప్రార్థన."

పీతాంబరం కింద సంతకం చూశాడు.

"ఓరి వీడి తస్సాల్ చెక్క ! మా రామయ్యార్‌గాడు. వాడిలాంటిపనులే చేస్తుంటాడు."

ఖండసరి చక్కెర దిగుమతి దరఖాస్తు రామయ్యార్ దగ్గరకు చేరిందన్న మాట. ఇది మొదటి మజిలీ.

* * *

రామయ్యార్ ఇల్లు ట్రిప్లికేన్‌లో దక్షిణ మాడావీధిలో ఉంది. ఆయనకు ఆరుగురు సంతానం. భార్య ముక్కున వజ్రపు ముక్కుపుడక ఉంది. దానిమీద వెలుగు పడి మెరవడానికిగాను, ఆమె మేలుకున్న ఘడియలన్నీ పెదవులూ, ముక్కూ కదుపుతూ మాట్లాడుతుంది. ఆరుగురు పిల్లలూ ఆంగ్ల తమిళ భాషల్లో పాఠాలు వల్లిస్తుంటారు. అంచేత వాళ్ళ

ఇల్లు నిత్యపూజ జరుగుతున్న పార్థసారధిస్వామివారి ఆలయంలా ఉంటుంది. అదే కారణంగా రామయ్యర్‌కి గొంతుక పెంచి మాట్లాడ్డం అలవాటైపోయింది.

ఆరుగంటల ప్రాంతాన్ని రామయ్యర్ ఇంటికి వెళ్లారు, పీతాంబరం, సుందర్రామయ్యా కలిసి. ప్రభుత్వ సమాధానం అతని చేతికే ఇచ్చారు. రామయ్యర్ అది చదువుకుని_

"ఎన్న పీతాంబరం _ నమ్మ ఫ్రెండన్ను ఒరువార్త శొల్లకూడాదు ?" అన్నాడు. ఆ తరువాత అసలు ఖండసరి చక్కెర అనబడే పదార్థం ఏమిటి ? అన్న విషయం చర్చకు వచ్చింది.

"చక్కెరే అనుకోండి. కొంచెం సన్నగా ఉంటుంది. రంగు తక్కువ. ఐతే రెట్టింపుతీపి ఉంటుంది," అన్నాడు. పీతాంబరం.

"పార్కలామే," అన్నాడు రామయ్యర్.

ఈ 'చూడ్డం' ఖండసరి చక్కెరని గాని కాగితాన్ని కాదని సూక్ష్మబుద్ధిగల సుందర్రామయ్యకు అర్థమైంది.

అర్థమణుగు ఖండసరి చక్కెర అర్జంటు టెలిగ్రాం ఇచ్చి తెప్పించాడు, ఎందుకైనా మంచిదని _ కరణంగనక_ రెండు వీశెలేనని చెప్పి _ పీతాంబరానికీ, రామయ్యర్‌కీ చెరొక వీశే ఇచ్చాడు.

ఖండసరి చక్కెర మామూలు చక్కెరకన్న బాగా తీపిగా ఉంటున్నదని, రామయ్యర్ పిల్లలు రుజువుచేసిన మీదట, మరొక రెండు వీశెలు, తిరిగి తెప్పించినట్టు నాటకమాడి పీతాంబరానికి తెలీకండా రామయ్యర్ భార్యకి ముట్టజెప్పినమీదట, దరఖాస్తు రామయ్యర్ బల్లమీదినుంచి, సంబందం మొదలియార్ బల్లమీదికి చేరుకుంది. ఇది _ రెండవ మజిలీ.

* * *

సంబందం మొదలియార్‌కి చాలా ముఖ్యమైన 'సంబంధా' లున్నాయి. అంచేత అతనికి అతి తొందరగా ప్రమోషన్లు వస్తుంటాయి. అంచేత సెక్రటేరియట్‌లో గుమాస్తాలకందరికీ అతనంటే భయమూ, భక్తీ, ఈర్ష్యా. అసిస్టెంట్ సెక్రటరీ తరహావాళ్ళకి కొంత భయమూ ఎక్కువ ప్రేమా.

అతను రామయ్యర్‌లాగ 'పార్కలామే 'అనడు; 'పట్టుకోరా,' అంటాడు. అతనికొచ్చిన తెలుగుపదం అదొక్కటే. ఎల్లాగైనా సుందర్రామయ్య కరణం బుర్రగదా.

"నూటయాభై టన్నులు గోడౌన్‌లో మూలుగుతోంది బాబూ! తమరికి వీశె, అరవీశె అయితే ఏమూలకి ? త్వరగా దిగుమతి పర్మిటు పారేయించారంటే, ఓ మణుగు తమ ఇంటికి చేర్పిస్తాను. లేకపోతే ఎక్కువగా తెప్పించడానికి




వీలుండదు; పట్టుకుంటారు," అన్నాడు లౌక్యంగా.

"ఓ," అన్నాడు. సంబంధం మొదలియార్, పర్మిటు అతి త్వరలో ఇచ్చెయ్యొచ్చని నోట్ రాసి, అసిస్టెంట్ సెక్రటరీ పుట్టకట్ దగ్గరకు పంపించాడు. ఇది _ మూడవ మజిలీ.

* * *

ఇక నాలుగవ మజిలీ.

పుట్టకట్ కేరళీయుడు. అతను అందరితోనూ అతికులాసాగా ఉంటాడు. అయితే అతనికి రూల్సన్నీ కంఠస్థం. ఈ కంట్రోళ్ళ రోజుల్లో రోజు రోజుకీ వందలకొద్దీ పుడుతున్న రూల్సు, ప్రభుత్వ ఆర్డర్లు గుర్తుంచుకోడం గుమాస్తాలకి సాధ్యమా? అతనికి కింద గుమాస్తాలతో ఆడుకోడం సరదా.

గుమాస్తా నోటురాసి అతని దగ్గరకు పంపిస్తాడు. అతను తిరిగి నోటురాసి, ఆ గుమాస్తా దగ్గరకే పంపిస్తాడు.

"దివి 6_2_64 న మంత్రివర్గ నిర్ణయాలను జాగ్రతగా చదువుకుని మరీ నోట్ వ్రాయవలసిందిగా ప్రార్థన."

"ప్రార్థన," అనిమాత్రం అతని ప్రతి నోట్‌లోనూ ఉంటుంది. చాలా మర్యాదస్తుడు.

గుమాస్తా అది చదువుకుని, ఆ ఫలానా మంత్రివర్గ నిర్ణయాలను జాగ్రత్తగా పరిశీలించి, మరొక నోట్ రాసి, పుట్టకట్‌గారి ఆమోదం సంపాదించాననుకుంటాడు. కాని అక్కడే పప్పులో కాలువేస్తాడు. పుట్టకట్ తిరిగి నోట్ వ్రాసి ఆ గుమాస్తాకే పంపిస్తాడు.

"శ్రీయుత గుమాస్తాగారికి నేత్ర

దోషమా? లేక అంతకన్నా ప్రమాద కరమైన మానసికదోష మేమన్నాఉందా? వెంటనే వైద్య సలహా పొందడం అవసరమేమో నని నా స్నేహపూర్వక సూచన. మంత్రివర్గ నిర్ణయ పత్రానికి వెనక షరా లున్న సంగతి పాపం వారి కగమ్యం కావడం విచారకరం. చూ. ప్రభుత్వ ప్రకటన ఆఖరు పుట అడుగున మూడవ షరా."

ఈ విధంగా ఒకొక్క కాగితం ఉయ్యాల ఊగి ఊగి పైకో, మరొక మెట్టు కిందకో పోవడం సంప్రదాయం.

సుందర్రామయ్య దరఖాస్తు పుట్టకట్ దగ్గరనుంచి, తిరిగి సంబందం మొదలియార్ దగ్గరకే వొచ్చింది. దానిమీద సంబందం మొదలియార్ కాగితం చేత పుచ్చుకుని స్వయంగా పుట్టకట్ దగ్గర కొచ్చి నవ్వుతూ–

"అణ్ణా!" సంబోధనతో ప్రారంభించి, ఈ దరఖాస్తు ఆమోదించి, ఖండ సరి చక్కెర దిగుమతి పర్మిటు ఇవ్వడానికి ఏ రూల్సు ఒప్పుకుంటాయో చెప్పమని అడిగినమీదట, సంబందం మొదలియార్ కున్న ఇతర సంబంధాలదృష్ట్యా పుట్టకట్ – ఆ రూలు వివరించాడు. అది ఉదహరించి సంబందం మొదలియార్ స్వయంగా పై అంతస్థుకి తీసుకుపోయాడు దరఖాస్తుని. ఇది – నాలుగవ మజిలీ అని ముందరే వివరించాం.

అయిదవ మజిలీ పై అంతస్తులో ఉందని మాత్రమే సుందర్రామయ్యకి తెలుసు. సంబందం మొదలియార్ ఆ మూలవిరాట్టును "వారు" అని మాత్రమే అంటాడు. పేరు తెలిస్తే అటునించి నరుక్కు రావచ్చునని సుందర్రామయ్య ఆశ. అయితే తనకింద సహాయం చేస్తున్న సంబందం మొదలియార్ని "వారి" పేరు అడగడం సమంజసం అవునోకాదో అర్థంకాలేదు.

* * *

అయిదవ మజిలీ కాస్త పెద్దది. అక్కడికి ఏ కాగితమన్నా చేరడమూ కష్టమే. చేరిన తరువాత ఊడిపడ్డమూ కష్టమే.

ఆరురోజుల అనంతరం సంబందం మొదలియార్ ఒక వార్త తెచ్చాడు. ప్రభుత్వానికి దిగుమతి పర్మిటు ఇవ్వడానికి ఏమీ అభ్యంతరం లేదు. అయితే మద్రాసులో ఏ వ్యాపారస్థుడయినా అది కొనడానికి అంగీకారం తెలియజెయ్యాలి. అంచేత ఒకణ్ణి ఎవణ్ణయినా పట్టి, అతను ఎంతకొనడానికి సిద్ధంగా ఉన్నాడో ఒక ఉత్తరం పట్టుకొచ్చి దరఖాస్తుకు జతపరిస్తే అరగంటలో వస్తుంది పర్మిటు.

సుందర్రామయ్య గోడౌన్ వీధిలో పడ్డాడు. నాలుగయిదు రోజులు తిరిగాక అతని కర్థమైన దేమంటే, ఖండసరి చక్కెర అమ్మకంవల్ల ఏమాత్రం లాభం లాభిస్తుందో ఆ వర్తకులు తేల్చుకోలేకుండా ఉన్నారు. అంచేత వాళ్లేమన్నా




రంటే, ముందు దిగుమతి చెయ్యండి, ఆ తరువాత అందరం కొంటాం. అన్నారు. వాళ్ళ దృక్పథం ఏవిటంటే, నూటయేభై టన్నులు ఇప్పుడు నాలుగు వందలమైళ్ళ దూరంలో సురక్షితంగా ఉంది. అది మద్రాసు ముందు తీసుకు వస్తే, చీమలూ, ఇతర క్రిములూ కలగ జేసుకుంటే, ఇంక తాము అడిగిన ధరకు అది చేతులో పడుతుంది.

అయితే సుందర్రామయ్య కరణం. సంబందం మొదలియార్‌తో పరిస్థితంతా చర్చించాడు.

"వాళ్ళూ వీళ్ళూ తింటే మనకి మిగిలే దేముందండి. మా వాడొకడున్నా డిక్కడ, గనిరాజని – బాగా ఉన్నవాడే లేండి. వాణ్ణి కిరాణా వ్యాపారస్థుల జాబితాలో చేర్పించండి. మీ కష్టం మేం ఉంచుకోం."

"మీ కష్టం మేం ఉంచుకోం," అన్న పదానికి అర్థం క్రియారూపంగా సంబందము మొదలియార్‌కి ఇదివరకే అర్థమైంది. అదీగాక గనిరాజు కిద్దరు "సినీ తారలు" కూతుళ్ళున్నారనీ మంచి హుషారయినవాళ్ళనీ, చాలా మంచి పిల్లలనీ మాటల సందర్భంలో వదిలాడు సుందర్రామయ్య. అప్పుడు సంబందం మొదలియార్ కళ్ళు మెరిశాయి.......

ఈవిధంగా రెండు శనివారాలు గడిచిన తరువాత సుందర్రామయ్య దగ్గర డబ్బయిపోయింది. బుచ్చినాయుడికి

రాశాడు. తనే వేరేపనిమీద వస్తున్నా నని బుచ్చినాయుడు జవాబు రాశాడు.

*　　*　　*

ఇక ఆరవ మజలీ.

ఆ మజలీ చేరడానికి బుచ్చినాయుడు కారకుడు. అతనికోసం వుడ్‌లాండ్సులో గది ఏర్పాటుచేశాడు సుందరరామయ్య.

ఆరాత్రి సొంతపనిమీద "వారు" బుచ్చినాయుణ్ణి చూడ్డానికి రావడం, కొంత బెట్టుసడలి సుందరరామయ్యని వారు కౌగిలించుకునేదాకా రావడం, ఆ తదుపరి మర్నాడు పదకొండు గంటల కల్లా సెక్రటేరియట్‌కి వచ్చి పార్థసారధిని చూస్తే పర్మిటు చేతులో పెడతానని హామీ ఇవ్వడం – అతిసులభంగా జరిగిపోయింది.

పార్థసారథి చిరాకుమనిషి. అతని భార్య రాత్రి జెలగై అతని రక్తాన్ని పీలుస్తుంటుందని కొందరూ, అతనికి మూలశంక ఉండడంవల్ల ఇలా ఉంటు న్నాడుగాని, అసలు మంచిమనిషేనని కొందరూ అంటుంటారు.

"వారి కేమయ్యా, వారు వరాలిచ్చే స్తూనే ఉంటారు. కాని రూల్సొప్పుకో వొద్దూ?" అన్నాడు పార్థసారధి, దరఖాస్తు చూసి.

"అంటే ఇదివరకు ముగ్గురి కిచ్చా రండి," అంటూ ఆరునెల్లక్రితం ఇచ్చిన దిగుమతి పర్మిట్లన్నీ ఉదహరించాడు సుందరరామయ్య.

"మరి నెలా పదిహేను రోజుల క్రితం కొత్తరూల్సు రావే?" అని ఎదురుప్రశ్న వేశాడు పార్థసారథి.

సుందరరామయ్య పార్థసారథి భార్యకి కంచిపట్టుచీర ఇచ్చి మంచిమాట చేసు కున్నాక, నాలుగు వారాలు రూల్సన్నీ చదివి పార్దసారథి కాస్త చిరునవ్వుతో– 'పని జరుగుతుందిలే,' అని హెచ్చరించాక– 'అమ్మయ్య' అనుకుని నిట్టూర్చాడు సుందరరామయ్య.

ఆరురోజుల అనంతరం వచ్చిం దొక ఉత్తరం.

"ఖండసరి చక్కెర ఉత్పత్తి ఆంధ్ర రాష్ట్రంలో కావడంచేత, ఆంధ్ర ప్రభుత్వం వద్దనుంచి దరఖాస్తుదారు ఎగుమతి పర్మిటు తెచ్చినట్లయితే, మద్రాసులోకి దిగుమతి కొరకు పర్మిటును ఈ ప్రభుత్వం ఇస్తుంది," అని దాని సారాంశం.

అప్పటికి సుందరరామయ్య వద్ద బుచ్చినాయుడిచ్చిన రెండోవెయ్యి ఖర్చై పోయింది – రెండు మాసాల హోటల్ బిల్‌కీ, తన ప్రయాణపు ఖర్చులకీ ఆరు వందలు మనీఆర్డరు తెప్పించుకుని, సుందరరామయ్య హైదరాబాదుకి ప్రయాణ మయ్యాడు.

హైదరాబాదు సుందరరామయ్యకు కొట్టిన పిండి. అంచేత ఖండసరి చక్కెర ఎగుమతి పర్మిటుకోసం సెక్ర




టేరియట్‌లో దరఖాస్తు పెట్టి, అది ఆడంగుకి చేరడానికి ఏర్పాటు చేసి, సుందర్రామయ్య పాత స్నేహితుణ్ణి చూడ్డానికి హిమాయత్‌నగర్ వెళ్ళాడు. అనుకోకుండా అక్కడ తాజ్‌మహల్ హోటల్లో కాఫీకని వెడితే, అక్కడ తారసిల్లాడు రామేశం.

రామేశం బుచ్చినాయుడికి స్నేహితుడు, ఎమ్.ఎల్.ఏ., ఖండసరి చక్కెర ఫాక్టరీ యజమాని.

కాఫీ తాగుతూ, అతను యధాలాపంగా చెప్పిన చావుకబు రేమిటంటే – కేరళ ప్రభుత్వంవారు దిగుమతి పర్మిటిచ్చిన కారణంగా, వారంరోజుల క్రితం నూటయాభై టన్నుల చక్కెరా అతడు ఎర్నాకుళానికి ఎగుమతి చేసేశాడు. ఈ యాత్రా ఫలితంగా, గనిరాజు కుమార్తెలు రెండుమూడు తమిళ చిత్రాల్లో కూడా చిన్నవేషాలు వేస్తున్నారు. సుందర్రామయ్య దరఖాస్తు హైదరాబాదు సెక్రటేరియట్‌లో మజిలీలు దాటుతోంది మెల్లగా. ఈనాటివరకూ దానియాత్ర ముగియలేదు.

ఖండసరి చక్కెర మాత్రం తన కాశీ చేరుకుంది.



"వారంరోజుల్లో, బ రాం స్థానంలో ముసలికోటయ్య వచ్చాడు. కారణం నాకు తెలుసు.

ఒకరోజు హఠాత్తుగా అన్నారు. "ఛీ, ముసలి వెధవ లని పేరేగానీ, వయసు ముదిరినాగాని. వాంఛలు చావలేదు."

"ఎవరిసంగతీ మీరు చెబుతూంట?" అర్థంగాక అడిగాను.

"అదో వా ళ్ళిద్దరే! ఖాసిం, కోటయ్య! నువ్వంటే వయసులో వున్నదాని వనుకో! వాళ్ళు ముసలి పీనుగలే? వాళ్ళ కేం పొయ్యేకాలం? అస్తమానూ నీ వేపే వారి చూపులు..."

నే నిక వినలేకపోయాను. బయటికి వెళ్తే పరపురుషులకంట బడ్తానని ఇంట్లో అష్టదిగ్బంధనచేశారు; బాధపడలేదు డాక్టర్‌దగ్గరకు ప్రాణాపాయస్థితిలో వెళ్ళానని పదేపదే దెప్పుతున్నా సహించాను. కానీ, వీరిగాడు, బలరాం, ఖాసిం, కోటయ్యలవంటి నౌకర్లతోకూడా కలిపి నన్ను శంకిస్తున్నారు! ఇకబ్రతికే దెలా!

మనస్సు గాజుపాత్రవంటిది. ఒకసారి చేయిజారితే మరి అతకదు. అలాటి

## జరిగిన కథ

[శ్రీనివాసరావు తన దుర్గుణాలు కారణాంగా భార్య శారద చావుకు కారకుడయ్యాడు. చివరిక్షణాల్లో ఆమె భర్తయందు చూపిన ప్రేమాదరాలు అతనిని పూర్తిగా మార్చివేశాయి - పశ్చాత్తాపం కలిగింది.

చెల్లెలు ఇందిరకు జబ్బు జాస్తిగా వున్నదని చూడబోతే ఇందిర తన గాథ అన్నకు ఆమూలాగ్రంగా తెల్పింది - అత్తవారింటికి పోయినక్షణంనుంచీ తన భర్తకు అనుమాన పిశాచం ఆవరించి తనను ఎన్నెన్నో బాధలకు గురిచేశాడు. తన ఆరోగ్యం క్రమేణా క్షీణించడం మొదలైంది, కడుపులోని దిగులుతో. దానికితోడు బాబు కడుపులో పెరిగి భూమ్మీద పడ్డాడు. అప్పటికీ తనబాధలు మామూలుగానే వున్నాయి - అని సవిస్తరంగా చెప్తోంది.]

— ఇక చదవండి.

గాజుపాత్రపై, అనుక్షణం సమ్మెటపోట్లు పడ్తుంటే అది వ్రయ్యలు కాక ఎలా వుంటుంది.

నా హృదయం ఈ బాధతో నిండిపోయింది. వారు నన్నీ జన్మలో నమ్మరు; నమ్మలేరు. వారి కుశంకాపూరిత హృదయంలో గూడుకట్టుకుని వున్న అనుమానం, నే నెంత స్వచ్ఛంగా వున్నప్పటికీ, కాస్తంతయినా కరగదు! ఇలా భర్త చేత నిముషనిముషమూ అనుమానదృష్టితో చూడబడ్తూ జీవించేంతటి అవమానం మరొకటుంటుందా? చెయ్యని నేరాలకూ, కలలోకూడా భావించని నైచ్యాలకూ నేను శిక్షింపబడ్తున్నాను; పరీక్షింపబడ్తున్నాను. ఈ అగ్నిపరీక్ష నానాటికి పెరుగుతోందేగానీ తరగటంలేదు. తరతమ భేదాలుగా దిగజారివస్తోంది వారి అనుమానం.

ఖాసిం, కోటయ్యలనుకూడా ఇంటిపనులకు నియోగించడంలేదు తరచూ. ఇంటి చాకిరీ నేనే చేసుకుంటున్నాను ... ఏదో అలసట, నిస్పృహ, ఆవేదనలతో, ఓ విధమైన విరక్తి ఏర్పడింది నాలో. అది రోజు రోజుకూ పెరిగి పెద్దదవుతోంది ...

"అస్తమానూ నన్ననుమానిస్తూనే, భ్రష్టురాలినేమో ననే శంకతోనే, నన్నెందుకు మళ్ళీ దగ్గరకు తీసుకుంటారు?'' ఏహ్యభావంతో ప్రశ్నించా నోసారి.

''ఇల్లు అంటూ ఉన్నపుడు, రోజూ దుమ్మూధూళీ చేరుతూనే వుంటుంది. ఏరోజు కారోజు శుభ్రంచేసుకుని మనం నివసిస్తున్నామా, లేదా? అల్లాగే ఇల్లాలుకూడా! నిరంతరం స్త్రీలో మలినభావాలు తలెత్తుతూనే వుంటాయి. పురుషుడు తన తెలివి తేటలతో వాటిని తుడిచివేస్తూ, గ్రహిస్తూండాలి ఆమెను..."

గొప్పసిద్ధాంతం! అసహ్యంతో ఇక ఆ ప్రస్తావన తేలేదు.

శారదఒదిన చనిపోవడానికి కొద్దిరోజులు ముందుగా అక్కడి కొచ్చాను, బాబును తీసుకుని. అప్పటికే వాడికి లివర్ ముదిరివుంది. ఏ డాక్టర్ దగ్గరికేనా

తీసికెళ్తే పిల్లాడితోబాటు, తల్లినికూడా డాక్టరుకళ్ళు చూస్తాయేమోనని వారిభయం. పోనీ వారికి బాబునుమాత్రం ఇచ్చి పంపుదామంటే, బాబు నేనులేకుండా, టేబిల్ మీద నిలిచేవాడుకాడు! ఓసారి బాబును చూపించటానికి వెళ్ళి, హాస్పిటల్‌లో దగ్గాను. ఊపిరి తిరగలేదు. డాక్టర్ సుధాకర్ నన్నొక్కమారు పరీక్షగా చూచి– "అలా ఎన్నాళ్ళుగా వస్తోంది దగ్గు?" అన్నారు.

"అబ్బే, ఇప్పుడేనండీ!" అన్నాను.

సుధాకర్ ఆశ్చర్యంగా చూచారు నావేపు నమ్మలేనట్లు? మళ్ళీ వారిని ప్రశ్నించాడు. "మిస్టర్ ఆనంద్! ఆవిడను పరీక్షచేస్తే బావుండు ననిపిస్తోంది ... ఆదగ్గు ఇప్పుడే తగ్గించటం మంచిది; మీ ఉద్దేశ్యం...?"

వారు నావేపు చూచారు. నాకు తెలుసు ఆ చూపులవెనక దాగివున్న భావం. "అహం, నా ఒళ్ళు బావుందండీ..." అన్నాను.

డాక్టర్ సుధాకర్ విన్పించుకోలేదు. వారు గంభీరంగా వప్పుకున్నారు.

ఏడవటం మినహా, మరేమీ చెయ్యలేక టేబిల్‌మీద పడుకున్నాను. డాక్టర్ సుధాకర్ గుండెంతా పరీక్షచేశాడు... "ఎందుకేనా మంచిది.. ఎక్స్‌రే తీయించండి. నాకేదో అనుమానంగా వుంది..." అన్నాడు.

ఇంటికొచ్చాం. "అడ్డమైన వెధవలకూ నీ గుండె పరీక్షచెయ్యాలనే ఆకాంక్ష! వాడిమొహం వెధవ..."

మరే డాక్టర్ దగ్గరకూ వెళ్ళలేదు. అక్కడ కొచ్చాను. అమ్మ బలవంతంమీద లేడీడాక్టర్‌దగ్గిరి కెళ్ళొచ్చాను. "క్షయ రాబోతోంది .... బాగా మందులు వాడాలి. ఎక్స్‌రే తీయించుకోవాలి. వారాని కోమారయినా మంచి అనుభవజ్ఞుడైన డాక్టర్ దగ్గర పరీక్ష చేయించుకోవాలి," అని చెప్పింది. నాకా క్షణంలో ఆనందమే కల్గింది.

అనుమానపిశాచంతో, భర్త అనురాగంలోని స్వచ్ఛతకు దూరమైన నాకు, మరణమంటే ఆనందమే కల్గింది.

మళ్ళీ వచ్చేశాను పదిరోజుల్లో. బాబు చనిపోయాడు. లోకం శూన్యమైనట్లయిపోయింది. అన్ని మానసిక క్లేశాలనూ బాబుదగ్గర మర్చిపోకలిగేదాన్ని. ఆ బాబునూ లాక్కున్నాడు దేవుడు... ఎవరికో దాన మిచ్చిన పండును వంచించి లాక్కున్నానేమో నేను!

"ఎంతసేపూ నీ ఒళ్లూ, నీ ఆరోగ్యమూ, నీ పరీక్షతప్ప, బాబు ఆరోగ్యం పట్టించుకున్నావా? నీ శరీరాన్నిగురించి, డాక్టర్లదగ్గర నీ శరీరంకోసం చేయించుకున్న పరీక్షలలో వెయ్యోవంతు శ్రద్ధ బాబుకోసం చూపినా, బాబు దక్కేవాడు!"




వారు నిజంగా ఎంత వజ్రసంకాసహృదయులో? బాబు మరణంతో అలమటిస్తున్న నా హృదయానికి దొరికిన ఆస్వాద నది! లాలన అది!

శారదవదిన చనిపోయిందని వైర్ వచ్చింది. నాకు తెలుసు, ఏనాడో అలాటి ఘోరం జరుగుతుందని. త్వరలోనే ఇలాటివైర్ వారుకూడా ఇవ్వవలసిఉంటుందనీ నాకు తెలుసు.

స్త్రీ జీవితమే చిత్రమైనది. ఊహకందనిది! ఈనాటి స్త్రీ స్వరూపం మరీను! శారదవదినలా పరమసాధ్వీలలామలు కొందరైతే, అతినికృష్టస్త్రీలు మరికొందరు. ఒదినలా, నాలా (ఇదిసోత్కర్షకాదు ... నాగురించిన నిజం) భర్త లాలనకోసం, స్వచ్ఛమైన అనురాగంకోసం పరితపించేవాళ్ళు కొందరైతే, భర్తను దాసునిలా చేసుకుని అతణ్ణి నీచంగా చూచే ఉమలాటివారు మరికొందరు. కారాగారాల్లో బంధింపబడినట్లుగా భర్తచేత ఆంక్షలు పెట్టించుకుని బ్రతుకుతున్న స్త్రీలు కొందరైతే, 'సోషల్‌మువింగ్' పేరిట స్వైరవిహారం చేస్తున్న జారిణులూ, జాణలూ కొందరు. ఆ భర్త కళ్ళెదుటే పరాయిపురుషులతో కులుకుతున్న "నాగరికత" ముసుగు తొడుక్కున్న నారీమణులు మరికొందరు!

ఏది ఈనాటి స్త్రీరూపం? ఎన్ని విద్యాసౌకర్యాలూ; ఉద్యోగ అవకాశాలు వున్నా, స్త్రీలు, పురుషుల కాఠిన్యానికి బలిఔతూనేవున్నారు. ఎంతటి దేశీయ సంస్కృతిని

చెవులలో శంఖారావంలా నూరిపోసినా, భారతీయ స్త్రీత్వాన్ని గురించి ఉపోద్ఘాతలు చేసినా, విదేశీ అనుకరణా వ్యామోహంలో, కురులు కత్తిరించుకుని, బనియన్లు తొడుక్కుని, శరీరప్రదర్శన చేసుకుంటూ స్త్రీత్వపు ఉన్నతశిఖరాలనుంచి, పతనం చెంది అంతమౌతునే వున్నారు స్త్రీలు! రెండువిధాలుగా స్త్రీ చరిత్ర పతనమే అవుతోంది.

కాని ఒక్కటే తేడా! మొదటికోవకు చెందిన స్త్రీలు కీర్తి నిలుపుకుంటున్నారు. అలాటివారు కొందరుండబట్టే భరతావని ఈమాత్రం పవిత్రంగా వుంటోందని చెప్పటాని కవకాశం కల్పిస్తున్నారు.

రెండోరకంవారి ప్రవర్తనతో, భరతావనికూడా పాపాలూ, అపవిత్రతా చెయ్యటంలో, అవకాశం దొరికితే వెనుకంజ వెయ్యదని నిరూపిస్తున్నారు! అంతే!

నానాటికీ నా ఆరోగ్యం దిగజారిపోతోంది. ఏ డాక్టర్‌కూ చూపించుకోవా లనే ఆకాంక్షకూడా నాకు లేదు.

అన్నయ్యా! అయిపోయింది. ఈ జీవనజ్యోతి ఇక చాలా కొద్దికాలంమాత్రమే మనగలదు...

కానీ ఈ కొద్దికాలంలోనే చాలా సంతోషకరమార్పులు చూచాను. నువ్వు మారావు. త్రాగుడు మానేశావ్. చెడుగా తిరగటంలేదు ...వదిన పోగానే నువ్వింతగా మారుతావని కలలోకూడా అనుకోలేదు.

ఆమధ్య అమ్మ నా జబ్బుకో తాయెత్తు కట్టించింది. ఎందుకో తెలుసా? నాకు శారదొదిన దెయ్యమై పట్టివుంటుందని ఆమె అనుమానం! అది తెలియగానే తాయెత్తుతీసి విసరి బావిలో వేసేశాను! అమ్మ కర్కశత్వపు హృదయంలో ఇంకా మార్పు రాలేదనయ్యా!

బహుశా అది నా మరణంతోగాని రాదు. వారిలో ఎలాగూ మార్పురాదు. అది నాకు తెలుసు; కానీ అమ్మ ఇంతవరకూ గర్భశోకమంటే ఏమిటో, కన్నబిడ్డ భర్త చేత బాధపడటం అంటే ఏమిటో తెలుసుకోలేదు. అందువల్లే, అమ్మ వదినెను అంతగా హింసించగలిగింది.

ఈనాడు నేను చెప్పిన సంగతులన్నీ, ఏదీ దాచకుండా అమ్మకు చెప్పన్నయ్యా.

నా చావుతో అమ్మకళ్ళు తెరిపిడి పడతాయి! వారికీ నిరంతర వ్యాకులత తగ్గుతుంది.

అన్నయ్యా! తప్పక చెబుతావుకదూ?''

* * *



ఇందిర ఆయాసపడుతోంది. తెరలుతెరలుగా దగ్గు వస్తోంది... డాక్టర్ వచ్చాడు. ఇందిర కళ్ళుమూసుకు, అటుతిరిగి పడుకుంది.

"ఆయాసం ఎలా ఉందమ్మా ఇందిరా!" డాక్టర్ ప్రశ్న

"ఏమిలేదండీ!" ఇందిర జవాబు. డాక్టర్ వెళ్ళిపోయారు.

నా కళ్ళు అశ్రుపూరితాలైపోయాయి. నాకంటే ఎంతో చిన్నదయిన, నా చెల్లెలు జీవితానుభవాలెన్నిటినో జీర్ణింపజేసుకొని, ఇరవైమూడు సంవత్సరాలు నిండక ముందే, మృత్యుసాన్నిధ్యంలోకి చేరుకుంటోంది. ఆనంద్‌పై పీకలవరకూ కోపం వచ్చింది. కానీ క్షణకాలంలో శారద గుర్తుకొచ్చింది. నా పై శాచిక ప్రవర్తనతో శారద పతనం చేసిన నేను, ఆనంద్‌ను సరిదిద్దగల అర్హతేనాడో కోల్పోయాను.

మూడోరోజు, మళ్ళీ నాన్నగారికీ, అమ్మకూ టెలిగ్రాం ఇవ్వమని డాక్టర్ హెచ్చరించాడు. ఆయన భయపడటానికి కారణమేమిటో నాకు బోధపడలేదు. రోజూకంటే హుషారుగావుంది ఇందిర. తేలిగ్గా, స్వచ్ఛంగా నవ్వుతోంది. ఆనంద్‌తో బాగా కబుర్లు చెబుతోంది. వాళ్ళిద్దరి సంభాషణలకూ అంతరాయం కల్గించటం ఇష్టంలేక, నేను వరండాలోనే ఉండిపోయాను.

"ఇక నేను ఎవ్వరివేపూ చూడను, నావేపూ ఎవ్వరూ చూడరు..." అంటోంది ఇందిర.

ఆనంద్ ఏమంటున్నాడో స్పష్టంగా తెలియలేదుగానీ, ప్రసన్నవదనంతో చిరు నవ్వు, నవ్వుతూండాలి బహుశా!

సాయంత్రం నాతో మాట్లాడుతోంది ఇందిర. ఏవేవో కబుర్లు చెబుతోంది. బాల్యంలో సంగతులూ, ఆటలూ పాటలూ ఆగకుండా చెబుతోంది.

హఠాత్తుగా, దగ్గుతెర వచ్చింది... ఆ దగ్గు ఇక ఆగలేదు. బొళబొళ రక్తం, గుండె పగిలినట్లు, కక్కుకుంది...

"అమ్మా! ఇందూ! ఇందిరా!" చేతుల్లోకి తీసుకున్నాను.

ఆనంద్ మరోవేపు పట్టుకున్నాడు... కానీ ఇంది రప్పటికే మా పిలుపులకూ, మాటలకూ, రోదనకూ అందనంతటిదూరం వెళ్ళిపోయింది.

"ఇందిరా;" గుండెలు పగిలేలా అరిచాను!

ఆనంద్ పొగిలిపొగిలి దుఃఖిస్తున్నాడు. ఆనంద్‌తల్లి క్రిందపడి దొర్లుతోంది. రాత్రంతా గడిచిపోయింది. తెల్లగా తెల్లారినా, నాన్నగారూ, అమ్మా రాదలేదు...

పదిగంటలవేళ ఇందిర మృతకళేబరాన్ని దహనానికి తీసికెళ్ళారు.

"ఆనంద్! ఇక నిశ్చింతగావుండు... నీభార్య బాడిదకూడా ఏ పరపురుషుల కంటా పడదిక..." అన్నాను కర్కశంగా!

ఆనంద్ తల విదల్చుకుని దుఃఖిస్తూ వెళ్ళిపోయాడు. ఇందిరరూపం సమూలంగా అదృశ్యమైపోయింది.

రాత్రికి నాన్నగారు, అమ్మ, కళ్యాణి, హైమ వచ్చారు.

అమ్మ, నాన్నగార్ల దుఃఖాని కంతులేకపోయింది. ఇందిర కోరిక మేరకు, అమ్మకు అంతా చెప్పాను వీలుచూచుకుని. నిశ్చేష్టురాలై కూర్చుంది. చివరిచూపు కూడా లేకుండా పోయిందనే బాధ అమ్మని నమిలివేస్తోంది...

ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లిపోయింది అమ్మ. తిరిగి ప్రయాణమై వస్తూండగా నాన్నగా రన్నారు: "శీనూ! స్వర్గనరకా లెక్కడో వున్నాయని భ్రమపడతాం. ఈ జన్మతాలూకు సుఖదుఃఖాలు, కష్టాలు అక్కడెక్కడో అనుభవిస్తామని వూహా గానాలు చేస్తాం... లేదునాయనా! ఇక్కడే ఇప్పటికిప్పుడే అనుభవిస్తాం... ఏమే! నీకు గుర్తుందా? శారద మనల్ని నట్టేట ముంచి వెళ్ళిననాడు నీకు గుర్తుంది కదూ? వాళ్ళమ్మా, నాన్నా ఏడుస్తూ అన్నమాటలు...? వాళ్ళ గర్భశోకం ఈనాడు నీ కర్థమౌతుందికదూ!?" నాన్నగారు తువ్వాలులో ముఖం దాచుకున్నారు.

"చచ్చిన పాము నెందుకు కొడతా రింకా!" అమ్మ రోదిస్తూ అస్పష్టంగా గొణిగింది...

ఒక్కోసారి పూర్వవాసనలు గుప్పున పైకివచ్చేవి. త్రాగుడు గుర్తుకువచ్చి పిచ్చెక్కినట్లయ్యేది. 'ఆవేశంతో మరణశయ్యమీదున్న వ్యక్తికిచ్చిన మాటకోసం ఏమిటీ బాధ!' అనికూడా అన్పించేది. కానీ అంతలోనే, 'మీ త్రాగుబోతు మాటల్ని విశ్వసించవచ్చా?' అనేలా చూస్తూన్న శారదరూపం ప్రత్యక్షమవుతుంది. మనసు నడుపులోకి తెచ్చుకుంటాను వెంటనే.

ఇందిర పోయింది. బాబు చనిపోయాడు. హైమ స్కూలు కెళుతోంది. సంవత్సరం తిరిగేసరికి బాగా నీరసించిపోయాను. ఏమిటో, బ్రతుకంటే నిస్సారమనిపిస్తోంది. దేనిమీదా ఆసక్తిలేదు. ఏమీ చెయ్యాలనిపించడంలేదు. ఓ విధంగా లోలోపలే ఏకాకిగా మారిపొయ్యాను. నేను వేరు, నా ప్రపంచమే వేరు. తరచూ కలల్లో కన్పించి, నన్ను ప్రేమగా దగ్గరకు తీసుకునే శారదకూడా ఈమధ్య ఎన్నడూ కన్పించటంలేదు!

ఒకరోజు అమ్మ కదిలించింది. "శీనూ! ఎక్కడేనా సంబంధం చూస్తాంరా?" అంటూ.

"మళ్ళీ నా కిప్పుడు పెళ్ళేమిటమ్మా? హైమను సక్రమంగా పెంచితే చాలు!" అన్నాను.

"ఖర్మ ప్రకారం జరిగిందిగానీ నాయనా! వయసుమాత్రం ఏం ఎక్కువుందిరా నీకు? నువ్వు సన్యాసిలా బ్రతుకుతూంటే, నాకడుపు తరుక్కుపోతోంది నాయనా!" అమ్మ ఖోరన విలపించింది.

ఇంది రన్నట్లు. ఇందిర మరణం అమ్మలో నిద్రాణమైయున్న నిజమైన స్త్రీత్వాన్ని మేల్కొల్పింది. కోడలిపట్ల తన ప్రవర్తన కెంతగానో పశ్చాత్తాపం చెందింది.

నేను సమాధానం చెప్పలేదు. బహూశా నాలోనూ నిద్రాణమై యున్న పురుష వికారాలు కొన్ని, మళ్ళీ వివాహం చేసుకోవటమే మంచిదని హెచ్చరిస్తున్న ట్లుంది.

కానీ నా అమానుషత్వం, శారద మరణవృత్తాంతం, చుట్టుప్రక్కల వూరూరికీ కథలుగా, గాథలుగా ప్రాకిపోయింది. తెలిసినంతలో ఎవ్వరూ తమ పిల్లగొంతుక్కోయటాని కిష్టపడరు ... నాలోనిమార్పు గుర్తించినవారు బహూకొద్ది మంది మాత్రమే.

ఆమధ్య తమ్ముడు ప్రభాకర్ కెవరో పిల్ల నిస్తామంటూ వచ్చారు. తీరా స్థిరపడబోయే సమయంలో నాకథ తెలిసిందట వారికి.

"అన్న అంతటి ఘనకార్యం చేశాడు ... తమ్ముడుమాత్రం తక్కువవాడై వుంటాడా?" అని మానుకున్నారట! ఇక ఆ అన్న కెవ్వ రిస్తారు కన్నపిల్లను?

హఠాత్తుగా శాస్త్రిగారు కదలించారొకరోజు నాన్నగారితో.

"మీ అబ్బాయి శీనులో నిజంగానే మార్పు వచ్చిందండీ! నే గమనించాను..." అంటున్నా డాయన.

"అవునండీ! నేనూ గమనిస్తూనే వున్నాను; సిగరెట్లుకూడా మానేశాడు. చెడుకొంపలకు వెళ్ళటంలేదు. పిల్లనెంతో ప్రేమగా చూచుకుంటున్నాడు ... ఇంటి పట్టున వున్నా, ఎంతో నిర్మలంగా ప్రవర్తిస్తున్నాడు..." నాన్నగా రంటున్నారు.

"మీ కభ్యంతరం లేకపోతే ఆతగాడికి మళ్ళీ పెళ్ళి చెయ్యటం మంచిదనిపిస్తోంది ... ఎంతైనా మగవాడు ... జీవితాంతం అలా వుండాలంటే..."

శాస్త్రిగారి భావాని కనుగుణంగా నాన్నగారు తలూపుతున్నారు.

"నాకూ అదే వుద్దేశ్యంవుంది ... కానీ కట్టుకొత్తి పదే దెవరండీ? ఎవరో. అంతకూ తెగించిన వాళ్ళు రావాల్పిందేగానీ, గుణమూ, సంస్కారమూ వున్న ఆడది సాహసిస్తుందంటారా?"

"నాకు తెలిసిన సంబంధం చెప్పమంటారా?" శాస్త్రి ప్రశ్న.

"తప్పకుండా;"

"తండ్రి సరిగ్గా, మొదట్లో మీ అబ్బాయిలాటివాడే! అమ్మాయికి తల్లిగుణాలు వచ్చాయిలెండి ... ఇక మారుతల్లి నిరంకుశత్వంలోనుంచి, తన కూతురిని బయటికి లాగాలని, శతవిధాల ప్రయత్నిస్తున్నాడు, పశ్చాత్తాపంతో మనిషిగా మారిన తండ్రి. అమ్మాయిపేరు మీనాక్షి; స్కూల్ఫైనల్ పరీక్ష ప్యాసవ్వలేదు గానీ, అంతకుమించిన సంస్కారం వుంది ... చూడటానికి బాగానే వుంటుంది ... కొంతవరకూ కష్టాలనుభవించి రాటుదేలిన మనిషి కాబట్టి, మీ అబ్బాయి సంసారాన్ని చక్కదిద్దగలదనే విశ్వాసం..."

నాన్నగారు మౌనం వహించారు.

"తండ్రి విశ్వనాథం నాకు దూరపుబంధువూ, దగ్గరి మిత్రుడూకూడా ... ఆ ఒక్కపిల్ల బరువూ దించుకుని, నిశ్చింతగా వుందామనుకుంటున్నాడు..."

పదిరోజుల్లోనే సంబంధం నిశ్చయమైంది. శాస్త్రిగారు మీనాక్షి ఫొటో ఒకటి తెచ్చారు ...

"అప్పుడే రెండోపెళ్ళా? ఊహతెలిసిన పిల్ల వుండగా, వీడికి పెళ్ళి తక్కువయ్యింది కాబోలు! అయినా ఆ వచ్చేది వీడికీ, వీడింటికీకూడా నిప్పుపెట్టిపోతుం




దీసారి!" అన్నారు కొందరు. అన్నీ వింటూ సంహించాను. అల్లాగే జరిగితే. నా పాపానికి ప్రక్షాళనా, నిష్కృతీ లభిస్తాయనిపించింది. పెళ్ళిమాత్రం నిరాడంబరంగా జరగాలని సూచించాను ... తిరుపతిలోనే చెయ్యాలని నాన్నగారి కోర్కె.

మంగళసూత్రం కడుతూ, భయంతో సిగ్గుతో తలవాల్చి వున్న నిన్ను చూస్తుంటే శారద గుర్తుకొచ్చింది! శారదలోని ఆ తేజస్సే, ఆ కళే నీలోనూ కన్పించింది. కొండంత ధైర్యం వచ్చిం దెందుకో.

"భగవాన్! నీ సాన్నిధ్యంలో ఇలాగే కొంతకాలంక్రితం శారదమెడలో మంగళసూత్రం కట్టాను. శారదతో నా దాంపత్యజీవితం అలా ముగిసింది ... ఈనాడీ అమాయకురాలి మెడలో మళ్ళీ పుస్తె ముడివేస్తున్నాను. సర్వం నీకే వదిలివేస్తున్నాను. మా నూతన దాంపత్యరథానికి నువ్వే సారథ్యం వహించాలి తండ్రీ!"

వేంకటేశ్వరుడు ప్రార్థన విన్నాడన్నట్లు ఎవరో భక్తులు ఆలయంలో మ్రోగిస్తున్న ఘంటారవం, దివ్యంగా విన్పించిం దదే సమయంలో. మనస్సు ఆనందంతో నిండిపోయింది ...

"మీనా! నీ యిష్టం. ఏదీ దాచకుండా నీద్వారా భగవంతుడికి నివేదించుకున్నాను. తల్లిని కోల్పోయిన హైమకు నువ్వు తల్లివి కావాలి. రెండోపెళ్ళి చేసుకుని, ఆ బిడ్డకు తండ్రికూడా లేకుండా పోయాడనే అపకీర్తి. మనల్నిద్దరినీ వెంటాడకూడదు ... శారద చనిపోయినా, అనుక్షణమూ, నన్నొకంట చూస్తూనే వుంటుంది ..."

గతస్మృతుల వేసన, భవిష్యత్ దృశ్యాల దూరదృష్టితోనూ శ్రీనివాసరావు ఓ విధమైన తన్మయత్వంలో లీనమైపోయాడు శారద, ఇందిరల జీవితాల్ని గురించి

చెబుతున్నప్పుడు. చెంపలమీదుగా జారిన అశ్రువుల చారిక లలాగే వున్నాయి. మీనాక్షిపై తాను పెట్టుకున్న ఆశలు కళ్ళల్లో మెరుస్తున్నాయి! పశ్చాత్తాపంతో దగ్ధమయి, ప్రేమవాహినితో పునీతమైన అతడి హృదయం స్పష్టంగా స్వచ్ఛంగా. స్ఫటికంలా కన్పిస్తోంది మీనాక్షికి.

"పశ్చాత్తాపాన్ని మించిన నిష్కృతి మరొకటిలేదు. జరిగిందేదో జరిగి పోయింది ... ఇప్పుడు మీలో ఏలాటికళంకమూ లేదు... మీ నమ్మకాన్ని వమ్ము చేయను... ఇద్దరమూ, పరిస్థితులు వేరైనా, బాధాపూరిత హృదయులముగా కలుసుకున్నాం ఒకేబాటలో! మనిద్దరికీ పరస్పర సాంత్వన కావాలి. ఆ ఊరటే హైమకూ కల్గిస్తాను... హైమకు "సవతితల్లి"ని గురించి పీడకల కూడా రానీయను. కారణం ఆ కాఠిన్యతలను నే చవిచూచాను. పాప కా నీడకూడా పడనివ్వ;... ఇక నిశ్చింతగా వుండండి! మీనాక్షిలోని ఏ అమృతమయ అజ్ఞాతశక్తో స్పష్టంగా పలికించి.

శ్రీనివాసరావు ముఖంలో ఒక్కసారిగా వేయి జ్యోత్స్నలు వెల్లివిరిశాయి, "మీనా! చేతికి దొరికిన వజ్రాన్ని, నిర్లక్ష్యంతో విసిరివేసినవాడికి, మరలా గాజు పెంకు దొరకటం కూడా కష్టమే! కానీ నాకు మళ్ళీ వజ్రమే దొరికింది! నాలాటి అదృష్టవంతు లెందరో వుండరు... దేవుడికి నా కృతజ్ఞ తెలా తెలియజెయ్యాలో తెలియటంలేదు..."

వారు భక్తిపురస్సరంగా, ఆ: యాని కభిముఖమై చేతులు జోడించారు. మీనాక్షి మనస్థితీ అల్లాగే వుంది.

వసుంధర, శంకరంల విషవలయంలోనుంచి బయటపడటానికిగానూ, అంగీకరించిన ఈ వరునిలో, ఎన్ని అవలక్షణా లుంటాయో నని భీతిల్లింది తను. కానీ అనురాగపు పరిపూర్ణతా, ఆనందపు పరాకాష్ఠా తనకోసం హృదయకవాటాలు తెరచి, మూర్తీభవించి వస్తాయని కలలోకూడా వూహించుకోలేదు. భగవంతుడికి తన కృతజ్ఞ తెలా తెలుపుకోవాలో!

భక్తిప్రపత్తులతో అంజలి ఘటియించట మొక్కటే, తను చెయ్యగలపని!

ఎన్నో సంవత్సరాలుగా, పేరుకునివున్న వేదనా, ఒంటరితనమూ ఒక్క క్షణంలో మాయమయ్యాయి. శ్రీనివాసరావు సాన్నిధ్యంలో ఉదయభానుని తీక్ష్ణ కిరణాల తాకిడికి పొగమంచు ఆవిరి అయిపోయినట్లు ఇరువురి హృదయాలలోని వ్యథా అదృశ్యమై పోయిం దాక్షణంలో!

(సశేషము)



# నీడపట్టు మనిషి

శీలా వీర్రాజు

"మీకు మనియార్డరు వచ్చింది. పోస్టుమేన్ మళ్ళీ వస్తానన్నాడు. ఎక్కడికీ వెళ్ళకండి."

వారంరోజులుగా అతని ముందు మూగపిల్లలా కదిలి, కేవలం పరదాలు దించుకున్న ఘోషా చూపులతో సిగ్గుగా, రహస్యంగా, ఉత్సుకతతో పక్కలనించి, కిటికీల వెనకనించి వింతగా ప్రతి కదలికనీ పరిశీలించే నాగావళి ప్రాణం పోసుకున్న విగ్రహంలా మొదటిసారిగా అతని ఎదుట బిగదీసుకుపోయిన పెదాల్ని మెల్లగా కదిల్చి, ఆ వెంటనే తన ప్రమేయం లేకుండా ఆజ్ఞాపించగలిగిన తన కంఠాన్ని గుర్తుపట్టి సిగ్గుపడి అతని ఎదుట వుండలేక లోపలికి వెళ్ళిపోయింది.

సదానంద జోళ్ళు తొడుక్కోబోతున్నవాడల్లా మానేసి వెనక్కి తిరిగిచూస్తే నాగావళి కదిల్చిన గాలిఅలలకు ఎగిరిన దుమ్ము అటూ యిటూ కదుల్తోంది అక్కడ.

వెనక్కి తిరిగొచ్చి గదిలో కూర్చున్నాడు.

గదిలో ఏమీ తోచడంలేదు. ఒంటరితనమూ, నిశ్శబ్దమూ తప్ప తనకొరకు ఆ గదిలో కాలక్షేపానికి వీలుగా ఏమీ లేవు. కూనిరాగాలు తీసుకోడానికి క్రొత్త ప్రదేశంలోని బెరుకూ, స్వేచ్ఛగా కదలడానికి యింకా అలవాటుపడని మనుషులూ, వాళ్ళ పొడిపొడి పలకరింపులూ అతన్ని దిగ్బంధనం చేసేశాయి.

ఉద్యోగానికని వచ్చి వారంరోజు

అయ్యింది. నాగావళి తండ్రి రాఘవరావు గారు రమ్మంటే వచ్చాడు. ఆయన బహు తెలివైనవాడు. ఓ పెళ్ళిలో కలిసిన సదానంద తల్లిని ముందుచూపుతో పలకరించి, అబ్బాయిని తనదగ్గరకు పంపిస్తే ఉద్యోగం వేయిస్తాననీ, తన దగ్గరే వుండే ఏర్పాట్లు చేస్తాననీ మాట ఇచ్చాడు. ఆయన యింట్లో ఎదిగిన కూతురు వున్న సంగతి బంధువులందరికీ తెలుసు. అమ్మాయి బంగారపు బొమ్మ. బంగారపు బొమ్మ ఒంటిమీద బంగారాన్ని పోలిస్తే ఎన్నితులాలు తూగుతుందా అన్న ఆలోచన తప్ప మరో ఆలోచనలేని మనుషుల్ని చూసేసరికి రాఘవరావుగారికి బంగారుపుట్టి ఇతరత్రా ప్రయత్నాలు చేయాలన్న నిర్ణయానికి వచ్చారు.

అలాంటి ప్రయత్నమే సదానందను రప్పించుకుని ఉద్యోగం వేయిస్తాననడం. ఇందుకు సదానంద అంగీకరించాడని తెలిసిన బంధువులు అతన్ని గేలానికి తగులుకోబోతున్న చేపను చూసినట్టు చూసి జాలిపడ్డారు.

పెళ్ళి పందిట్లో చలాకీగా అటూ యిటూ కదిలి చిరుగాలుల్నీ, చిరునవ్వుల సౌరభాల్నీ చల్లుతుని, అందరి చూపుల్నీ తనవైపు తిప్పుకోగలిగిన నాగావళిని చూచి 'ఇల్లాంటి అమ్మాయి తనకు యిల్లాలైతే బాగుండును' అనుకున్నాడు సదానంద. ఆ తర్వాత, ఆ అమ్మాయి తండ్రి రాఘవరావుగారు ఉద్యోగం వేయిస్తాను పంపించమంటే పరుగెత్తుకొచ్చాడు; చేతిలో డబ్బు లేకపోతే అందినతర్వాత మనియార్డరు చెయ్యమని యింట్లో చెప్పి వెంటనే బయలుదేరి వచ్చేశాడు.

వచ్చి వారంరోజు లయింది. రాఘవరావుగారు ఉద్యోగ ప్రయత్నాలైతే చేస్తున్నారు. కోపరేటివ్ సబ్‌రిజిష్ట్రారు ఆయన. పలుకుబడి వున్నవాడే. పని రాళ్ళు వెనకేయాలన్నా చేతగాలేదు రోగిష్టిభార్యా, మంచంలోంచి లేవలేని ముసలితల్లీ, కాలేజీచదువుకు తనమీదే ఆధారపడిన తమ్ముడికొడుకూ, అడపాదడపా నాగావళీ అతని జీతాన్ని పంచుకుని, అకస్మాత్తుగా ఏ లాటరీయో తగులుతేనే తప్ప లేకపోతే తనుచి మిగులులేని సంసారమే - అని నిరూపించారు.

ఈ వారంరోజులూ నాగావళి, చూపుల్లోనే తృప్తిపడుతూ వచ్చింది. ఇవ్వాళే పలకరించింది. అది పలకరింపులా అనిపించనేలేదు అతనికి. ఓ నిమిషం అలానే నిలుచుని, వయసులచి దాసం చేసినట్టు యింత పసరు చిరునవ్వును తనముందు పడేసి, కనురెప్పల పరదాల్ని ఎత్తిపట్టుకుని మరికాసేపు ఆ వెనుక నర్తకిని నాట్యం చేయించి, కంఠంలో యింకాస్త శ్రద్ధతో శృతులు సరిచేసుకుని మంద్రస్థాయిలో "మని

యార్దరొచ్చింది మీకు. పోస్టుమేన్ మళ్ళీ వస్తానన్నాడు. కాసేపు కూచోండి" అని పలకరించి, కొద్దిసేపు అక్కడే నిలిచి, కృతజ్ఞత చెప్పమనే తన చూపుల్ని కూడా అందుకుని సిగ్గుతో అలవోకగా తలవంచుకుని, జారనివపైటను సర్దుకుని, అంతలోకే ఆమె చుట్టూ ఎగురుతున్న చూపుల-తుమ్మెదల రెక్కలక్రింద కదిలిన చిరుగాలులకు పులకరించి, చటుక్కున తన ఎదుటినించి తప్పుకుని పోయివుంటే ఎంత బావుండును! ఇంత పొయిటిక్‌గా ప్రవర్తిస్తే ప్రతిసంఘటననీ ఓ కావ్యంగా సృష్టించగలదు స్త్రీ: ఎదుటి జీవితాల్ని రసాత్మకం చెయ్యగలదు— అనుకున్నాడు అతను.

గదిలో ఏమీ తోచలేదు. ఈ ఏకాంతాన్ని తగలెయ్యడానికి సిగరెట్లు కూడా లేవు. పొద్దున్నే అయిపోయాయి. మూడు ఫర్లాంగుల దూరం వెళ్ళాలి. ఆ యింట్లో సాహిత్యాన్ని మోసే బీరువాదైనా ఎక్కడా కనిపించలేదు. ఇంచుమించు యిల్లంతా చూశాడు ఒక్క గది తప్ప. ఆ గదిని నాగావళి వాడుతోంది. ఏమున్నా వుంటే అందులో వుండాలి. పిలిచి అడగాలనిపించిందిగాని ఏమని పిలవాలి? పేరెట్టి పిలిచేంత చనువు ఏర్పడలేదు. ఉత్తరోత్తరా అర్ధాంగిలయ్యే అవకాశం ఉన్న ఆమెను తెలిసి తెలిసి 'ఏమండీ' అని ఎలా పిలవడం? అలాంటి దేమీ లేకుండా అతితెలివిగా 'చదువుకునే



పుస్తకాలేమైనా వున్నాయా?' అని అడగడానికి ఎప్పుడైనా ఆమె అతనిముందు కొస్తేగా.

చాలా ఇబ్బందిగా ముళ్ళమీద కూర్చున్నట్టు ఆ గదిలో కూర్చున్నాడు సదానంద. అర్ధగంటసేపు అలానే కూర్చుని తన సహనాన్ని తనే పరీక్షించుకున్నాడు. ఇక చేతకాలేదు. వీధి వరండాలోకి వద్దామని రాబోతోంటే నట్టింట్లో కూని రాగం తీస్తున్న నాగావళి అతన్ని చూసి చటుక్కున ఆపేసింది. అలాంటి పరిస్థితికి బాధ్యుడయినందుకు కాస్తంత తత్తరపడి మళ్ళీ గదిలోకి తిరిగి వెళ్ళిపోయాడు.

రాగం బాగానే తీస్తోంది. పాటలు బాగా పాడే సామర్థ్యం వుందో, లేక ఉత్సాహంకొద్దీ కూనిరాగాలతోనే సరిపుచ్చుకుంటోందోమరి. మళ్ళీ రాగం కదిపితే విందామని అతిశ్రద్ధగా తలుపుకు దగ్గర్లోనే తచ్చాడుతూ నిలుచున్నాడుగాని

ఆమెఅక్కడున్న అలికిడే వినిపించలేదు.

పావుగంటసేపు గదిలోనే వుండి, బైటికొచ్చాడు.నాగావళినట్టింట్లోనేవుంది: తలగిద గలీబులకు పూలు కుట్టుకుం టోంది. అలికిడి విని తలెత్తి చూసింది.

"ఇంట్లో ఏమయినా పుస్తకా లున్నాయా?"

"ఏం పుస్తకాలండీ"

"ఏవైనా సరే. ఇంగ్లీషువయినా, తెలుగువయినా నవలలుంటే యివ్వండి. కాలక్షే..." చటుక్కున ఆపేసి తనలో తానే నవ్వుకున్నాడు. ఓ పొడిదగ్గు దగ్గి, కంఠం సవరించుకుని—

"...కాలక్షేపానికి ఏవయినా సరే. నాకు పుస్తకాలు చదివే పిచ్చి ఎక్కువే. నవలలు లేకపోయినా వారపత్రికలన్నా వుంటే యివ్వు." అన్నాడు.

నవ్వుతోంది ఆమె. ఏ చెరువు మీదనో, ఏ పున్నాగ చెట్టుకిందనో విడి పోయి తప్పించుకొని వచ్చిన చల్లటి పిల్లగాలి తెర ఒకటి గర్భగుడిలో కదలక అతినిశ్చలంగా వెలిగే ఆముదపు దీపంజ్యోతిని అరక్షణం అలా కాస్తంత కదిల్చినట్టుగా పెదాల్ని కదిపీ కదపనట్టు అతిసుతారంగా, మరీ నాజూకుగా కదిల్చే అతిపల్చని చిరునవ్వు నవ్వి "సాయం కాలం తెచ్చిపెడతాలెండి. ఇంట్లోఅయితే లేవు. ఓ స్నేహితురాల్ని అడిగి పట్టు కొస్తాను. దానిదగ్గర పెద్ద లైబ్రరీయే వుంది," అంది.

"సరేలెండి," అని చెప్పి మళ్ళీ గదిలోకే వెళ్ళిపోయాడు. ఇప్పుడు ఏకాంతం అనిపించడం లేదు. ఇంతకు మునుపే గబగబా ఏరుకుని మనసులో దాచేసుకున్న నాగావళి రూపచిత్రాల్ని జ్ఞాపకాల భూతద్దాలకింద పెట్టి పెద్దవిగా పెంచుకుని చూస్తూకూర్చున్నాడు. అప్పు డప్పుడు అభిరుచుల రంగులుకూడా అద్ది, భవిష్యత్ తెరమీదకు ప్రొజెక్టు చేసి, దూరంగా నిలుచుని మరీ వివ రంగా, స్పష్టంగా కనిపించే ఆ చిత్రాన్ని చూసి ఆనందం భరించలేక హృద యాన్ని మీటుకుని తనలో తానే పాట పాడుకున్నాడు.

ఎంత సేపు అయ్యిందో, బయటినుంచి పిలుపు వినిపిస్తే కూనిరాగం కట్టేసి, పోస్టుమేన్ వచ్చాడేమోనని కంగారుగా తలుపులు తీసుకుని బయటికి వచ్చాడు. ఎదురుగా నాగావళి! చేతిలో పుస్తకాల దొంతర — అంత ఎండలోనూ వెళ్ళొచ్చి నట్టు ఎర్రగా కందిపోయిన ముఖంతో; చేతిలోబరువుకుఊపిరిబిగబెట్టిఒక్కసారిగ విదిల్చి మరీ ఎక్కువగా కదిల్చినవక్షాల్తో నొసటిమీంచి ముక్కుపక్కగా కదిలి, ఎత్తులేని చెక్కిలిమీదుగా కంగారుగా జారి, పెదవికింద పల్లంవేపుగాకొట్టు కొచ్చి, అగాధంలాంటి కంఠంలోతుల్లోకి దూకడానికి భయపడి అక్కడేఆగిపోయిన అందమైన చెమటబిందువుతో, స్నేహ పూరితమైన చూపుల్తో నిలుచునివుంది.



"అరరె... ఇంత ఎండలో వెళ్ళక పోతే ఏంపోయింది. ఎండ ఎలా మాడ్చేస్తోందో బయట. చెమటలుకూడా కారుతున్నాయి. ఏ సాయంకాలమో - వెళ్ళి తీసుకురావల్సింది," అన్నాడు. అన్నాడే గాని అతనిమాటలు అతనికే నచ్చలేదు; ఎబ్బెట్టుగా వున్నాయి. కృతజ్ఞత చెప్పుకునే మాట ఒక్కటీలేదు. కృతజ్ఞత చెప్పుకుందామనే మొదలెట్టాడు. ఏమిటేమిటో అనుకోనివన్నీ మాట్లాడేశాడు. కృతజ్ఞత అతనిదగ్గరే వుండిపోయింది. ఈ యిబ్బంది ఎందుకొచ్చిందో అతనికి తెలుసు. స్వేచ్ఛగా 'నువ్వు' అని ప్రయోగించలేని బెరుకుతనం. అందువల్ల మనసులోని భావం మాటల్లోకి రాలేదు. మరికొన్ని రోజులపాటు యీ యిబ్బంది తప్పదు. అంతవరకూ యిలా మాటల్ని తడుముకోవాల్సిందే.

పుస్తకాలు అందుకున్నాడు.

"ఇవి చదివేసిన తర్వాత యిచ్చేసి మరికొన్ని తేవచ్చులెండి" అంది.

"అలాగే; వీటితో వారంరోజుల పాటు కాలక్షేపం చేయొచ్చు."

నాగవళి యింట్లోకి వెళ్ళిపోయింది.

ఒకసారిపుస్తకాలన్నీ తిరిగేసి 'ఫరవాలేదు. మంచి సెలక్షనే' అనుకున్నాడు.

కాస్సేపటికి పోస్టుమేన్ వచ్చాడు. ఆ తర్వాత యిక అతనికి అవతలికి వెళ్ళాలనిపించలేదు. ఓ పుస్తకం ముందేసుకుని కూర్చుండిపోయాడు. ఆరోజిక మళ్ళీ నాగావళి పలుకరించలేదు.

మర్నాడు శెలవురోజు. రాఘవరావు గారు పొద్దున్నే అతన్ని వెంటేసుకుని తెలిసిన నలుగురిదగ్గరకీ తీసుకెళ్ళాడు. ఆరోజల్లా అలా బయట తిరగడంతోనే సరిపోయింది. ఆ తర్వాత రోజూ ఉదయం కాఫీ పట్టుకొచ్చినప్పుడూ, నీళ్ళు తోడినప్పుడూ, మధ్యాహ్నం విసనకర్ర పట్టుకొచ్చి యిచ్చినప్పుడూ, సాయంకాలం వీధి వరండాలోనూ నాగావళి పలకరించినా జ్ఞాపకాల్లో నిలుపుకోదగ్గ ప్రత్యేకత ఏమీలేని పొడిపొడి మాటలే అవడంవల్ల అతనుకూడా అట్టే పట్టించుకోలేదు. అయితే ఆ తర్వాతకూడా అలానే గడిచిన యింకో రెండు రోజుల్లోనూ అరడజను అనుభవాల్ని ఏరుకున్నాడు.

అందులో చివరిది—

నవల ఒకటి సాయంకాలంవరకూ

చేదిని విసుగెత్తి షికారుకని బయలు దేరాడు. మురిగ్గా, యిరుగ్గావున్న బాటల్నుంచి తప్పించుకుని వెళ్ళి ఓ పార్కులో కూర్చున్నాడు. అతనికి దగ్గర్లోనే విషం లాంటి రంగులో ఎర్రటిపూలు [illegible] సన్నగా, పొడుగ్గా, ఒడుగువెత్తుగా [illegible] కాడమీద విరగాబులకు [illegible] రించి పోతున్నాయి. మనుషులూ అంతే. ఎంత నాజూకుగా, ఎంత ఉన్నతంగా వుంటే అంతగా అతిచిన్న అనుభవానికి కూడా స్పందించి పోతుంది. ఈర్ష్యతో, కుత్సితంతో, పగతో, అసహనంతో నిండి, కరుకుగా, మోటుగా ఎదిగి ఉన్నతంగా నిలవలేని మనసు బలమైన ఉద్రేకానికి తప్ప సున్నితమైన అనుభవానికి స్పందించలేదు. ఈ సత్యాన్ని తెలుసుకోలేని మనిషి పగతో, ద్వేషంతో, అసహనంతో మనసును నింపుకుని రసమయమైన యీ జగత్తును చూడలేక కళ్ళున్న గుడ్డివాడై పోతున్నాడు.

సదానందకి ఓ పువ్వు కోసుకోవా లనిపించింది. తోటమాలిని పిలిచి అడిగితే అతని ఆకారాన్ని చూసి "దాని కేం భాగ్యం కోసుకోండి" అన్నాడు. కాడతో పాటు ఒకటి కోసుకుని, మరికాసేపు అక్కడే కూర్చుని లేచి బయల్దేరాడు.

ఆకాశం కారికారి నల్లబడిపోయింది. అక్కడక్కడ యింకా ఆరిపోని నిప్పుల్లా మెరుస్తున్నాయి నక్షత్రాలు. సముద్రం మీంచి గాలి అలలు అలలుగా వీస్తోంది. అడుగుల్లో అడుగులు వేసుకుంటూ మెల్లగా నడుస్తున్నాడు. టౌను హాలు దగ్గర కార్లూ, ఖరీదైన మనుషులూ, దీపాలూ, దుమ్మూ- మంచి హడావిడిగా వుంది. దగ్గరకు వెళ్ళాడు. ఇంటర్ స్టేట్ కల్చరల్ ఎక్ఛేంజ్ ప్రోగ్రాం క్రింద వొచ్చిన మద్రాసు సాంస్కృతిక బృందంవారు భరతనాట్య ప్రదర్శనలు యిస్తున్నారట.

భరతనాట్యం అనేసరికి సదానందం మనసు ఎగిరి గంతేసింది. అందులోనూ మద్రాసుబృందంవారి ప్రదర్శన. ఇటీవలి కాలంలోకూడా భారతదేశంలో లలితకళలు సంకరించకుండా స్వచ్ఛంగా సాంప్రదాయాన్ని పరిపోషించుకుంటూ ఎక్కడన్నా వున్నాయంటే అవి ఆంధ్రదేశానికి దిగువనే తప్ప పైన కాదని అతని అభిప్రాయం.

టిక్కెట్టు కొనుక్కుని లోపలకు వెళ్ళాడు. అప్పుడే ప్రదర్శన ప్రారంభమైంది. ఇద్దరు అమ్మాయిలు కలిసి అలారిప్పు ప్రదర్శిస్తున్నారు. పక్కవాయిద్యాలు చక్కగా కుదిరాయి. గాయకి కంఠంలో సంగతులు పలికిస్తోంది. నాట్యం చేస్తున్న యిద్దరూ రసాభినయం చేస్తున్నారు. వాళ్ళ పాదాలు లయబద్ధంగా పడుతున్నాయి. గజ్జెల చిరుమువ్వలు బృందగానం చేస్తూ తలూపుతున్నాయి. ఫిడేలుతీగలమీద కమాను

ఊయలలూగుతోంది. మృదంగంమీద వ్రేళ్ళు నృత్యం చేస్తున్నాయి. అన్ని నాదాలూ పాయలు పాయలుగా వచ్చి ఒకేతాడుగా అల్లుకుని ప్రేక్షకుల్ని బంధించేశాయి.

తెర వాలింది

చప్పట్లతో హాలు దద్దరిల్లిపోయింది!

"ఎందుకలా చప్పట్లు చరుస్తారో పిళ్ళు. దాన్నిండా ఆ స్త్రీ తప్పు లే. ముద్రలు పట్టడంతోనే సరిపోదు. తాళానికి తగ్గట్టు పాదాలు పడందే! ఇంతకన్నా చక్కగానే చేయగలన్నూ నేను" — ఎవరో విసుక్కుంటున్న శబ్దం వినిపించింది సదానందకి.

వెనక్కి తిరిగి చూశాడు. పద్దెనిమిదేళ్ళ అమ్మాయి ముఖం చిట్లించుకుని పక్కావిడతో మాట్లాడుతోంది. ఆమె కూడా నర్తకే అని ఆమె కళ్ళ అలంకరణే తెలుపుతోంది.

ఆ తర్వాతి ప్రదర్శనలమీద కూడా ఆమె ఏదో కామెంట్ చేస్తూనే వుంది.

సదానందానికి నవ్వొచ్చింది. ఈ కళాకారులంతా యింతే. వొట్టి స్వార్థపరులు. నిజానికి కవులు, చిత్రకారులు, నర్తకులంత స్వార్థపరులు మరొకరు లేరు. పిసినిగొట్టువాడి స్వార్థం డబ్బు విషయంలో వుంటే కళాకారుడి స్వార్థం కీర్తి విషయంలో వుంటుంది. ఒక విధంగా పిసినిగొట్టువాడే నయం. పిసినిగొట్టువాడి స్వార్థం అతని కుటుంబానికి



సంబంధించినది. కాని కళాకారుడి స్వార్థం అతని ఒక్కడికే సంబంధించినది. అందుకే సదానంద కళను గౌరవించినంతగా కళాకారుడ్ని గౌరవించలేడు.

ప్రదర్శన పూర్తయ్యేసరికి చాలా రాత్రయ్యింది.

ఎప్పుడైనా చక్కని అనుభవం సదానందానికి లభిస్తే ఆ అనుభవాన్ని తలంచుకొంటూ కొద్దిసేపు వొంటరిగా నడవాలనిపిస్తుంది అతనికి. అనుభవాన్ని ఆ వెంటనే హృదయంలోంచి తోడుకుంటే ఆ అడుగున మిగిలిన స్వచ్ఛమైన పరిమళభరితమైన అనుభూతి మిగులుతుంది.

అంతరాత్రిలోనూ, విశాలమైన ఆకాశముకింద నిర్మానుష్యమైనబాటల్లో నడిచి యింటిని చేరుకున్నాడు. కాంపౌండు గోడకున్న బయటితలుపు వేసివుంది. ఈపాటికి అంతా గాఢనిద్రలో వుంటారు. తలుపుతట్టి పిలుద్దామనుకున్నాడు. కాని—

ఆ తలుపులే తెరుచుకున్నాయి. ఆ తెరిచిన తలుపుల వెనక నాగావళి!

అతనికి ఆశ్చర్యం వేసింది. ఇంత రాత్రివరకూ నిద్రపోకుండా తనగురించి ఎదురుచూస్తూ తనరాకను కనిపెట్టుకుని కూర్చున్నదన్నమాట. తనగురించి యింతగా పట్టించుకున్న హృదయం ఒకటి వుండడం ఎంత అదృష్టం! అతనికి చెప్పలేని ఆనందమైంది.

"రండి. అక్కడే వుండిపోయారేం" పక్కకు తప్పుకుంది. అతను లోపలకు వెళ్ళిపోయాడు. ఆమెకూడా తలుపేసుకుని లోపలకు వచ్చేసింది.

భోజనం వడ్డించి పిలుస్తే వెళ్ళాడు. ఆమె వడ్డించడం అదే మొదటిసారి. వాళ్ళమ్మను లేపబోతే బామ్మ కోప్పడ్డది. 'నువ్వెళ్ళి వడ్డించవే. దాన్ని లేపుతావెందుకు, నడుంనొప్పని పడుకుంటేనూ' అంది. ఆ మాటలు వినిపించాయి. ఆ తర్వాత అయిదునిమిషాలకు నాగవళి వచ్చి పిలిచింది.

తల వంచుకుని భోజనం చేస్తున్నాడు. తినాలనిలేదు. ఆకలి చచ్చిపోయింది. నాగావళి అవతల ద్వారబంధం దగ్గర నిలుచునివుంది. చూస్తోంది. అందుకని ఎలాగో భోంచేస్తున్నాడు.

"సినిమాకు వెళ్ళారా?"

"లేదు. డేన్సుప్రోగ్రాంకు వెళ్ళాను."

ఆమె ఓసారి కళ్లు ఎగరేసింది. "అభిరుచులు మంచివే కాని అలవాట్లే బావుండలేదు," అంది.

అర్థంకానట్టు చూశాడు అతను.

"ఆ అన్నం తినడానికి ఎంత యిబ్బంది పడుతున్నారో చూస్తూనే వున్నాను. ఇంతరాత్రి ఆకలేంవుంటుంది చెప్పండి. వేళకు భోజనం చెయ్యకపోతే ఆరోగ్యం పాడవదూ."

అతనేమీ మాట్లాడలేదు: ఈ కొద్దిరోజుల్లోనూ రాత్రిళ్లు యిలా ఆలస్యంగా రావడం యిదే మొదటిసారికాదు. సముద్రపువడ్డున కూర్చుంటే ఓరాత్రి పన్నెండయ్యింది. మరొకరోజు వెన్నెలవుందని అప్‌లేండ్స్‌లో పిచ్చిగా తిరిగి యింటికొచ్చేసరికి పదకొండు దాటింది. తను వొచ్చేసరికి కనిపించకపోయినా తనను కనిపెడుతూనే వున్నదన్నమాట!

ఎంత తినాలని ప్రయత్నించినా అంత రాత్రప్పుడు అన్నం సహించలేదు. మధ్యలోనే చేతులు కడుక్కుని లేచిపోయాడు.

"మరీ యింట్లోంచి కదలకుండా కూచోనక్కరలేదుగాని ఎక్కడికైనా వెళ్తేమటుకు యింటిని మర్చిపోకండి," అంది లేచొస్తున్న అతనితో.

బావుంది. చాలా సున్నితంగాశాసిస్తోందీమె. ఈ కొద్దిపాటి పరిచయంతోనూ తనను కట్టిపడేయాలని చూస్తోంది గాబోలు.

అతనికి నవ్వొచ్చింది. నవ్వుకుని

గదిలోకి వెళ్ళిపోయాడు. సిగరెట్టు కాల్చుకుందామని జేబులోంచి పెట్టెతియ్యబోతే పార్కులో కోసినపువ్వు కింద పడింది. అదితీసి మృదువైనదాని రేకల్తో చెక్కిలిమీద రాసుకుంటున్నాడు.

నాగావళి గదిలోకి వచ్చింది. "అన్నం సరిగా తిననేలేదు. అసలే వేసవికాలం — వేడి చేస్తుంది. ఇవైనా తినండి," అని ప్లేటుతో మామిడిపళ్ళముక్కలూ, గ్లాసుతో నీళ్లూ అక్కడపెట్టి, క్షణంసేపు అతని చేతిలోని పువ్వువైపు చూసి నవ్వుకుని వెళ్ళిపోయింది.



అదే ... ఆ చిరునవ్వును, అనురాగపు అరుణిమ పూసుకున్న పల్చని నాజూకు పెదాలవెనక స్నేహపు ధవళిమను నింపుకున్న ఆ చిరునవ్వును; ఆమె తోరణంగా వేలాడగట్టిన మల్లెపూదండలోంచి జారిపడిన చిన్న రేఖలాంటి క్షణం చిరునవ్వును అతను ఏరుకుని దాచుకున్నాడు.

ఇలా తెరచిన కిటికీల్లోంచి తన జీవితంలోకి తొంగిచూస్తోన్న నాగవళి తన యింట్లోకి ఎప్పుడు అడుగుపెడుతుందో. ఆనాడు ఈ యింటి తాళాలు ఆమెకు యిచ్చెయ్యాలి. ఇంటిపెరట్లో పూలమొక్కల్ని నాటమనాలి. అనురాగాన్ని అడుగడుగునా జ్ఞప్తికితెచ్చే ఎర్రటిపూలనే పండించమనాలి. ఎరుపులో ఎన్నివన్నెలున్నాయో అన్నివన్నెలపూలూ అందులో వుండాలి. సిగ్గుతో కందిన చెక్కిలి ఎరుపు, ఆకలి కదలిన మంటఎరుపు, తాంబూలం తడిపిన పెదాలఎరుపు, వెలుగు కరిగిన ఉదయపుఎరుపు, పసుపు చేరిన కాషాయఎరుపు, పసుపు చేరని మెజంటాఎరపు, వెన్నెల్లో తామరపూవు ఎరుపు, పండిన గోరింటాకుఎరపు, ముగ్గిన జామిపండుఎరుపు — యిలా ఎన్నిఎరుపు లున్నాయో అన్నిటినీ పండించమనాలి. ఆమెను మడుల్ని కట్టమని తను నీళ్ళు పోయాలి. రోజూ పూలు కోయాలి. వాటితో యింటిని అలంకరించాలి.........

జీవితానికి కోటా కొట్టుకుని, భవిష్యత్తుఅద్దంలో తన రూపం చూసుకుని తననితానే గుర్తుపట్టలేకపోయాడు. రాత్రి చాలాసేపటివరకూ ఆ ఆకారాన్నే చూస్తూవుండిపోయాడు.

ఉదయం లేచేసరికి ఆలస్యమైంది. లేచి సిగరెట్టు కాలుస్తూ కూర్చున్నాడు.

ఇంట్లోంచి మాటలు వినిపిస్తున్నాయి. రాఘవరావుగారి కంఠం అది.

"అమ్మాయి లేవలేదేమో. ఉమాపతి రావుగారు పొద్దున్నే అతన్ని పిలిచి చెప్పమన్నారు. వాళ్ళాఫీసులో ఓ ఖాళీ వుంది."

"ఆమధ్య మీరు చెప్పిన ఉద్యోగమేనా? అసలు ఆయనకు ఆ వుద్యోగం చేయడం ఇష్టమో కాదో కనుక్కోండి. ఆయనదంతా అదోరకం."

ఏమిటి! నాగావళి తన తత్వాన్ని కూడా తెలుసుకున్నట్టు మాట్లాడేస్తోంది. చాలా సన్నిహితంగా తనని పరిశీలిస్తోందన్నమాట. తన తత్వంకూడా ఆమెకు కావలసివచ్చింది. తన అభిరుచుల్ని, యిష్టాయిష్టాల్నికూడా తనకన్నా ముందుగా ఆవిడే వూహించేస్తోంది. తనదంతా అదోరకం; అంటే అర్థం ఆమె రకం కాదనా. ఇంతకీ ఆమె తత్వం ఏమిటి? ఆమె అభిరుచులు ఏమిటి? ఏమాత్రం బయటపడదేం. ఎంత గుంభనం! సాహిత్యంలో ప్రవేశముందా? సంగీతం వచ్చా? పాడే వాళ్ళల్లో బహుతక్కువమందీ, నాట్యం చేసే వాళ్ళల్లో బహు ఎక్కువమందీ అందంగా వుంటారట. ఇంత అందమైన అమ్మాయికి నాట్యం రాకుండా వుంటుందా......

నాగావళి వచ్చింది. అతని గది కిటికీ ముందు సందివర్ధనం చెట్టుకిందనుంచి సిగరెట్టుపొగ పాయలుపాయలుగా గాలిలోకి ఎగరడం చూసి అతను లేచాడని తెలుసుకుని తలుపులు తోస్తూ "లేచారా? నాన్నగారు అడిగారు మిమ్మల్ని. ఎవరినో తెలుసుకోవాలట. వేగంగా తెమలమంటున్నారు," అంది.

కొద్దిగా తెరచిన తలుపు రెక్కల సందులోంచి కనిపిస్తోంది ఆమె. బిగువు సడలి, చెవులమీదకు జారి, చుట్టూ ఆవరించిన నల్లటి జుత్తులో మరీ తెల్లగా సందివర్ధన పూవులా వుంది ఆమె ముఖం. ఆకులమీద వాలి, అవి కదలినప్పుడు పక్కలకు చెదిరి అడుగున పూసిన పుష్పం చెక్కిలిమీద ముద్దిడుతున్న ఉదయారుణ కిరణంలా ఆమె నొసటి కుంకుమబొట్టు తలుపు ఖాళీలో దాగుడుమూత లాడుతూ మెరుస్తోంది. రెక్కల్ని ఆడించి శక్తిని పుంజుకుని గాలిలో తేలిపోయే గండుతుమ్మెదల్లా నల్లటి కనురెప్పల్ని టపటపా కొట్టుకుని ఎగిరిన చూపులు తలుపుమధ్య ఖాళీ యిరుకు సందులోంచి స్వేచ్ఛగా రాలేక పోతున్నాయి. మంచుపడి రేకులమీదుగా జారి, తెగి కిందపడిపోలేక అంటిపెట్టుకుని వేలాడుతోన్న సాగిన మంచుబిందువులా వుంది ముక్కు.

అలా ఆ సన్నని తలుపు సందులోంచి కనిపించీ కనిపించనట్టు నిలుచున్న నాగావళి మరీ మనోహరంగా వుంది. లేచొచ్చి తలుపులు బోర్లా తెరిచి

లోపలికి రమ్మని పిలుద్దామనికూడా అనుకోలేదు అతను. తెరిచేస్తే యింత అందం అప్పుడు వుండదు. ఎంత నిర్మలంగా వున్నా మేఘాలు లేకపోతే ఆకాశానికి అందంలేదు. మేఘాలు ఆకాశాన్ని కప్పి, అక్కడక్కడ కొద్దికొద్దిగా వొదిలేసి వున్నప్పుడే అందం. ఎంత అందగాడయినా, ఏ కొబ్బరిచెట్ల ఆకుల చాటునో దాగుడుమూత లాడుతున్నప్పుడే చంద్రుడి అందం రాణిస్తుంది. తామరాకుల్ని కప్పుకుని, అక్కడక్కడ నగ్నంగా వొదిలేసి వొంపుల్ని చూపించినప్పుడే కొలనువైపు మళ్ళీ చూడాలనిపిస్తుంది.

"ఏమిటి! ఇంకా లేవదలచుకోలేదా మీరు. రాత్రి భోజనంకూడా సరిగా చెయ్యలేదు. లేచి ముఖం కడుక్కుంటే టిఫిను చేద్దురుగాని:" తలుపులు బార్లా తీసేసింది. రాత్రి తెచ్చిన మామిడి ముక్కల ప్లేటూ, గ్లాసూ తీసుకెళ్ళుదామని గదిలోకి అడుగుపెట్టి ఆగిపోయింది.

ప్లేటులో మామిడిముక్కలు ఎలా పెట్టినవి అలానే వున్నాయి అక్కడ!

"ఇవి తినలేదూ," అంది ఆశ్చర్యంగా.

"అవునుసుమా; వాటి విషయమే మర్చిపోయాను.

నాగావళి ఏమీ మాట్లాడలేదు. కొద్ది



క్షణాలు అతని ముఖంలోకి చూసి, గ్లాసు తీసుకుని వెళ్ళిపోయింది.

ఆ పగలల్లా మళ్ళీ ఆమె అతనికి ఎదురుపడనేలేదు. టిఫిను, కాఫీ ఆమె పట్టుకొస్తుందేమో అనుకున్నాడు. ఆమె రాలేదు. లోపల్నుంచి కబురొస్తే అతనే వెళ్ళాడు. ఆమెకు కోపం వచ్చిందనే సంగతి సాయంకాలానికిగాని అతనికి అర్థంకాలేదు. కొత్తలో మాట్లాడకపోయినా కనీసం కనిపించనైనా కనిపించేది. ఈరోజు ఉదయం తర్వాత ఆమె దర్శనమేలేదు. కనిపిస్తే వుదయం వెళ్ళొచ్చిన ఉద్యోగం సంగతి మాట్లాడాలనుకున్నాడు. అదీగాక వారం పదిరోజుల పాటు కాలక్షేపం అనుకున్న పుస్తకాల్ని ఐదు రోజుల్లోనే చదివేశాడు. కొత్తవి పట్టుకురమ్మనమని చెప్పాలి.

మధ్యాహ్నంనించీ మాటిమాటికీ వరండాలోకి వస్తూనే వున్నాడు — నాగావళి కనిపిస్తుందేమోనని. అలా

సాయంకాలం వరకూ చూసింతర్వాత చటుక్కున తట్టింది తను మామిడిపళ్ళ ముక్కల్ని తినకుండా వొదిలేసినందుకు కోపం వచ్చుంటుందని.

నవ్వుకున్నాడు.

తనకు కావలసింది ఇలాంటి హృదయమే. ఇంత సున్నితంగా స్పందించేదే కావాలి. అప్పుడప్పుడూ ఇలా కోపమూ, బెట్టుసరికూడా వుండాలి. దగ్గరగా వుంటూనే దూరంగా మెలగాలి. అలా వున్నప్పుడే అనుబంధం నిత్యనూతనంగా వుంటుంది. రోజూ వుదయించే సూర్య చంద్రులే అయినా రోజూ కొత్తగానే వుంటారు వారు. ఆ కొత్తదనం వాళ్ళ దాగుడుమూతల్లోనే వుంది. చీకటి నీడలమధ్య వెన్నెల వెల్తురులకు అందం. లోయల పక్కనే కొండలకు అందం. కన్నీళ్ళుపోసి పెంచితేనే చిరునవ్వులపూలు రంగుల్నీ, సువాసనల్నీ నింపుకుంటాయి. కొంతబాధ, కొంత నిరీక్షణ కావాలి. నిరీక్షణ ఆశగా ఊహించడం నేర్పుతుంది.

ఆ సాయంకాలం షికారుకు వెళ్ళినప్పుడు ఓ పాతిక మామిడిపళ్ళు బుట్టలో కట్టించి పట్టుకొచ్చాడు సదానంద.

"ఇదేమిటోయ్ పళ్ళు కొన్నావ్. ఇంట్లో వున్నాయిగా" అన్నారు రాఘవరావుగారు.

"చవగ్గా వొచ్చాయిలెండి. పట్టుకొచ్చిపడేస్తే యింట్లోవాళ్ళయినా తింటారు కదాని కొన్నాను."

"ఏమిటో నీ చేదస్తంగానీ యివన్నీ ఎందుకుచెప్పు," అని కూతుర్ని కేకేసి లోపలకు తీసుకెళ్ళమన్నారు.

నాగావళి వచ్చి పళ్ళు చూసి తనలో తనే నవ్వుకుని లోపలకు తీసుకెళ్ళిపోయింది.

చాలా సేపు రాఘవరావుగారితో ఉద్యోగ విషయాలు మాట్లాడుతూ కూర్చుండిపోయాడు. భోజనం వడ్డించి పిలుస్తే యిద్దరూ లేచారు. నాగావళే వాళ్ళమ్మే వడ్డించింది. గబగబా భోజనం చేసి ముందుగానే లేచి వొచ్చేశాడు సదానంద. గదిలోకి వెళ్ళబోతుంటే వీధి వరండా స్తంభందగ్గర నాగావళి నిలుచునివుంది. అతన్ని చూసి యింట్లోకి వెళ్ళిపోబోతుంటే అతనే పలకరించాడు. ఆమె ఆగిపోయింది.

"సాయంకాలం కనిపిస్తే పుస్తకాలు ఏమన్నా పెట్టుకురమ్మనమని చెప్పాలనుకున్నాను. కనిపించనేలేదు. మొన్నటివి చదివేశాను," అన్నాడు.

ఆమె ఏమీ మాట్లాడలేదు.

"ఉదయం ఉమాపతి రావుగార్ని కలుసుకున్నాను. ఖాళీవుంది, అప్లికేషను యిచ్చి, మంచిరోజు చూసుకుని చేరమంటున్నారు. ఉద్యోగం వచ్చినట్టే. ఆలోచించాలి మరి. తరుచుగా కేంపులు వుంటాయట," అన్నాడు తిరిగి.

అప్పటికీ ఆమె ఏమీ మాట్లాడలేదు.

"కోపం వచ్చింది కాబోలు మామిడి ముక్కలు తిన లేదని; నిజంగానే మర్చిపోయాను. నాకు మతిమరుపు ఎక్కువ. లేకపోతే మామిడిపళ్ళనే తినకుండా వొదిలేస్తానా. అవంటే నాకు చాలా యిష్టం. ఇష్టం గనకనే దారిలో చవగ్గా అమ్ముతుంటే కొని పట్టుకొచ్చాను యివ్వాళ. చిన్నప్పుడు మా వూళ్ళో రోజూ తోటల్లోకి పోయి దొంగ చాటుగా......"

నవ్వొచ్చిం దామెకు, నవ్వుతుని–

"ఇంత పెద్ద సంజాయిషీ యిచ్చుకో నక్కరలేదు లెండి. అయినా నాకు కోపం వచ్చిందని ఎలా అనుకుంటున్నారు ?" అంది.

అవును; ఆమెకు కోపం వచ్చిందని ఎలా అనుకుంటున్నాడతను. ఆమె కనిపించకపోవడానికి అనేక కారణాలు వుండొచ్చు. పని వత్తిడిలో వుండిపోయిందేమో! ఒంట్లో బావుండలేదేమో!

ఆమె అడిగిన ప్రశ్నకు అతను సమాధానం చెప్పలేకపోయాడు.

"ఇంతకీ మీరు ఉమాపతిరావుగారి ఆఫీసులో చేరుతున్నారా ?"

"అదే ఆలోచిస్తున్నాను – తిరగాలట కదా."

"పోనీలెండి. ఆ చూసుకునే దేదో కాస్త మంచి ఉద్యోగం చూసుకుని చేరితేసరి. నాన్నగారు అదేదో బేంకులో



ఉద్యోగం చూస్తున్నారు. అదొస్తే బాగానే వుంటుంది. ఈ పదిహేను రోజులకూ కంగా రెందుకూ?"

సదాశివంకు ఆశ్చర్యంగా వుంది. ఇంతకుముందే రాఘవరావుగారు అడిగితే మంచిరోజు చూసుకునే చేరిపోవా లనుకుంటున్నాను అన్నాడు. అదేమాట నాగవళి ఎదుట అనలేక పోయాడు. నాగావళి ప్రభావం తనమీద పడుతోందా అన్న అనుమానం వచ్చింది అతనికి. అంతకుముందు చేరదామనే అనుకున్నాడు. కాని యిప్పుడు చేరాలని లేదు. నాగావళి ప్రభావం తనమీద పడిందనడానికి యింతకన్నా నిదర్శనం అతనికి అక్కరలేకపోయింది.

"నా వ్యక్తిత్వం ఏమైపోయింది... ఏమైపోయింది" అనుకున్నాడు దోచుకో బడినవాడిలాగ హృదయాన్ని తడుము కుంటూ.

మర్నాడు రాఘవరావుగారితో ఉద్యోగవిషయం చెప్పాడు.

"దాని కేముంది? అలానే. ఆ ఉద్యోగంలో చేరడం నాకుకూడా అట్టే యిష్టం లేదనుకో. సర్లే మరోటి ప్రయత్నిస్తున్నాను. వారం రోజుల్లో తెలుస్తుంది," అన్నారు.

సదానంద ఆ విషయం చెప్పినప్పుడు నాగావళి అవతలిగదిలోనే వుంది. కొద్దిసేపు కిటికీలోంచి అతన్నే తేరిపార చూసి, తిరిగి తన పనిలో తాను మునిగిపోయింది.

రాఘవరావుగారు ఆఫీసుకు వెళ్ళిపోయారు.

ఆయన వెళ్ళాక బయటితలుపు గడె పెట్టి నాగావళి తిరిగి వస్తుండగా చూసి గబగబా వరండాలోకి వచ్చాడు సదానంద.

"ఆ పుస్తకాలు చదివేశాను. అవి యిచ్చేసి కొత్తవేమైనా పట్టుకొస్తే..." మధ్యలోనే ఆగిపోయాడు.

"జ్ఞాపకం వుందిలెండి. మతిమరుపు మీకే గాని నాకు లేదు. పొద్దుటినుంచీ ఊపిరి సలుపుకోడాని క్కూడా తీరిక లేదు. ఇదిగో వంటపని పూర్తయ్యిందనుకుంటే వడ్డింపులూ అవీనీ; అవీ అయిపోతే తీరిగ్గా వెళ్ళి రావచ్చని ఆగిపోయాను."

సదానంద ఆశ్చర్యంగా చూశాడు. "ఏమిటీ! వంట నువ్వే చేస్తావా?"

చాలా అమాయకంగానూ, అతి సామాన్యంగానూ "నేనే" అన్నట్టు తలూపింది.

"రోజూ నువ్వేనా?"

చాలా విచిత్రంగానూ, కొత్తగానూ చూసింది.

"అదేమిటి అలా అడిగారు?"

"ఏమీలేదు."

"ఊరికే అడిగుంటే అంత ఆశ్చర్యం దేనికీ. బహుశా నాకు వంట చేత కాదని అనుకుని వుంటారు. అవునా?"

"వంటరాదని ఎలా అనుకుంటాను. చదువుకొనేటప్పుడు రూంమేట్స్ అయిదుగురం. అందులో నలుగురికి వంటొచ్చు. మగాళ్ళకే వస్తోంటే ఆడాళ్ళకి రాదూ."

'మరి అలా అడిగారేం?"

అత నేమీ మాట్లాడలేదు. ఆలోచిస్తున్నాడు.

"చెప్పండి, వట్టినే అడిగుండరు."

చాలాసేపు అత నేమీ మాట్లాడలేదు. ఆతర్వాత మెల్లగా జేబులోంచి సిగరెట్టు తీసి వెలిగించి పొగవదుల్తూ—

"మీ దేన్ని గురువుగారు ఎవరు?" అన్నాడు.

తెల్లబోయిందామె. అర్థంకాని అయోమయంతో కళ్ళు చిట్లించి, ఇబ్బందికరంగా జారిన యిరుకుచూపుల్ని అతనిమీద నిలిపి, ముఖంనిండా అల్లుకున్న ఆ బాధముడుల్ని మెల్లిగా సడలిస్తూ ఆలోచనల్లోకి దూరి చూస్తోంది.

"అదే _ చిన్నప్పుడు డేన్సు నేర్పిన గురువుగా రెవరో తెలుసుకుందామని."

నవ్వుల్తో పగిలిపోయి బేలన్సు నిలుపుకోలేక నిజంగానే డేన్సు చేసింది ఆమె. "నేనా ... నేను డాన్సు నేర్చుకోవడ మేమిటండీ...కలగన్నారా?"

"సారీ ... డేన్సంటున్నా నేమిటీ. డేన్సుకాదు. సంగీతం నేర్పిన గురువుగారి పేరేమిటీ?"



"ఇది మరీ బావుందండోయ్. ఇవ్వాళ .చాలా విచిత్రంగా మాట్లాడుతున్నారే మీరు. నేను నేర్చుకోవడం అటుంచి కనీసం నేర్చుకున్న స్నేహితురాళ్ళయినా లేరుకదా నాకు! ఏమిటి ఇలా అడిగారు!"

"ఏమిటో. వచ్చుంటుందని అడిగాను మరేంలేదు. ఇవ్వాళ కూజాలో నీళ్ళు పోశారా. దాహంగావుంది. ఓ గ్లాసుడు నీళ్ళు తెచ్చిపెడతావా?"

తెగిపోయిన కలమత్తులోంచి వదిలి వెళ్ళినట్టు ఆలోచనల్లో ఊగుతూ మెల్లగా అడుగుల్లో అడుగులు వేసుకుంటూ వెళ్ళింది నాగావళి. రెండు నిమిషాల్లో గ్లాసుతో మజ్జిగ పట్టుకొచ్చింది.

"ఇదేమిటీ ! మంచినీళ్ళు తెమ్మంటే మజ్జిగ పట్టుకొచ్చావ్. కూజాలో నీళ్లు పోయలేదూ యివ్వాళ?" అన్నాడు అతను.

"పోశారుగానీ ముందివి తీసుకోండి. అంతగా కూజాలో నీళ్ళు తాగాలంటే మరో గ్లాసుతో తెస్తాను."

"అదికాదు......"

"అది అయినా కాకపోయినా ముందు యివి తీసుకోండి. ఇదేమీ కషాయం కాదు. తీసుకోండి."

గ్లాసు అందుకుని తాగుతూ మధ్యలో ఆపేసి _

"ఏమి టా అధికారం? ఆ శాసింపు ఏమిటి ? అలా బలవంతంచేసి తాగించక పోతేనేం. పోనీ ఆ కంఠాన్ని మరికాస్తా మృదువుగా, నెమ్మదిగా పలికిస్తే ఏం వొరిగిపోయింది'_ అనుకున్నాడు. ఓసారి ఆమె ముఖంలోకి చూసి మిగిలిన మజ్జిగనుకూడా గడగడా తా. శాడు.

ఆమె గ్లాసుతీసికుని వెళ్ళిపోబోతూ ఆగిపోయి "ఇంతకీ మీరు అసలు విషయం చెప్పకుండా దాటేశారుకదూ. చెప్పరా ఎందుకడిగారో?" అంది. ముఖం కొద్దిగా వంచి, బ్రతిమాలుతున్న ధోరణిలో

కళ్ళకొసల్ని జాలితో తడిపి, కనుగుడ్లను రెండింటినీ మూలల్లో నిలిపి రెప్పల్ని వాల్చకుండా అతవినే చూస్తూనిలుచుంది.

"ఊరికే యథాలాపంగానే అడిగాను. మరీ యింతగా పట్టించుకుంటా వేమిటీ? ఏమీలేదు." అన్నాడు గదిలోకి వెళ్ళిపోతూ. నాగావళికూడా చాలా సేపు అక్కడే నిలుచుని యింట్లోకి వెళ్ళిపోయింది.

భోజనాలు అయిపోయాక పుస్తకాల గురించి వెళ్దామనుకుందిగానీ కుదరలేదు. ఇంట్లో అప్పడాలు చేస్తోంటే ఆ పనిలో మునిగిపోయింది. సాయంకాలానికిగాని వెళ్ళి తీసుకురావడం పడలేదు. తీరా తెచ్చేసరికి సదానంద షికారుకు వెళ్ళిపోయాడు. అతను తిరిగివచ్చేసరికి రాత్రయిపోయింది. అతను రావడం చూసి, కొద్దిసేపు వూరుకుని పుస్తకాలు పట్టుకుని వచ్చింది నాగావళి.

వాపమీద కూర్చుని ఉత్తరం రాసుకుంటున్న సదానంద తనమీద నీడపడితే తలెత్తిచూశాడు. పుస్తకాలు పట్టుకుని నిలుచునివుంది నాగావళి. ఆమె నీడనుంచి తప్పుకునిలవతలకు జరిగి కూర్చున్నాడు.

"పుస్తకాలు తెచ్చావా? చాలాథేంక్స్. నీకు శ్రమయిస్తున్నానుకదూ." పుస్తకాలు అందుకుని, ఓసారి అలా తిరగేసి పక్కనపెట్టి "నువ్వు చదివావా వీటిని? ఎప్పుడూ పుస్తకాలు చదువుతున్నట్టే కనిపించవు. సాహిత్యం అంటే యింట రెస్ట్ లేదా నీకు?" అన్నాడు.

"ఏమీ తోచకపోతే చదువుతుంటాను. మరీ మీలా పిచ్చిగా చదివే అలవాటు నాకు లేదులెండి. వాటిని అర్థంచేసుకునే శక్తికూడా వుండాలికదా! అంతపెద్ద చదువులు నేను చదువుకోలేదు."

అకస్మాత్తుగా మౌనముద్రలోకి వెళ్ళినట్టు కొన్ని నిమిషాలు అత నేమీ మాట్లాడలేదు. ఆమె చూసిచూసి చివరకు వెళ్ళిపోదామనుకుని "భోజనం వడ్డించేసింది అమ్మ. పిలుద్దామనే వచ్చాను. ముందు భోంచేసి ఆ తర్వాత కూర్చుని రాసుకోండి." అంది. వెనక్కితిరిగి రెండడుగులు వేసింది.

"నాగావళీ!"

చెంగుపట్టుకుని లాగి నిలేసినట్టు చటుక్కున నిలబడిపోయింది.

"నిజంగానే నీ కేమీ చేతగాదా?"

ఆమెకు అర్థం కాలేదు. రెప్పల్ని ఎగరేసి ఏమిటి అన్నట్టు చూసింది.

"అదే ... ఏ ఒక్క కళలో నూ ప్రవేశంలేదా – నీకు. ఆఖరికి సాహిత్యంలోకూడా లేదా?"

కొద్దిక్షణాలు రెప్పల్ని వాల్చకుండా అతన్నే చూసింది.

అర్థమయ్యింది. ఉదయం ఆయన అడిగిన విచిత్ర ప్రశ్నలవెనక ఆయన హృదయంలోని ఉత్సుకత యిప్పుడు అర్థమయ్యింది. తన కేదో వచ్చుంటుం

దని ఎందుకనుకున్నారు. అంతకల్పన దేనికీ? ఊహల్లోనే జీవిద్దామని తప్ప మామూలుగా జీవించడానికి ఎందుకు ప్రయత్నించరూ? ఆకాశంలో ఎగరడమేగాని భూమ్మీద నడవడం చేతకాదా? ఇలాంటి మనుషులు ఎలా బ్రతగ్గలుగుతారు?

అతన్ని చూస్తే ఆమెకు జాలేసింది. అప్రయోజకుడైనకొడుకును చూసి కోపం రాకపోగా మరింత ప్రేమ పొంగి, ఆలోచనలన్నీ అతన్నే అల్లుకుని, గొడుగుపట్టి చల్లని నీడల్ని కురిపించి సేద దీర్చి, మరింతగా తనకడుపుతీపిని పంచియిచ్చిన తల్లి మనసులా నాగావళి హృదయం కరుణతో తడిసి, చల్లటి ఆలోచనల్ని గాలులుగా అతనిమీదకు విసిరి, అతని ఆకారాన్ని ఆమెకళ్ళల్లో నిలుపుకుని రెప్పలకింద భద్రంగా దాచుకుంది.

"మరీ అంత ఊహల్తో బ్రతకడం మంచిదికాదు. లేవండి. భోజనం చేద్దురుగాని. అందరూ తినేశారు; మీ రొక్కరే మిగిలారు. అవలావుంచండి. నేను సర్దుతానుగానీ ముందు మీరు కదలండి."

అతను కదిలి వచ్చేవరకూ ఆమె అక్కడే ఎదురుచూస్తూ నిలుచుంది.

ఆమె వెనకనే వెళ్తూ 'ఇలా ఈమె శాసించడం ఏమీ బావుండలేదు; అబ్బే, ఏమీ బావుండలేదు' అనుకున్నాడు.

అతని మనసంతా అదోలా అయిపోయింది. అతను అద్దిన రంగుల్ని చెరిపే



సుకుని నాగావళి అతనిముందు నిలుచునేసరికి మనసు చివుక్కుమంది. కిందపడి, రెక్కలు విరుచుకున్న పక్షిలా గిలగిల్లాడింది.

భోజనం దగ్గర మరీ పరధ్యానంగానూ, ఐశ్వర్యాన్ని కోల్పోయినవాడిలా కళావిహీనంగానూ కూర్చుని అతను భోజనం చేయడం నాగావళి చూసింది. వాళ్ళమ్మ అక్కడే వుండడంవల్ల ఏమీ మాట్లాడలేకపోయింది. భోజనం అయిపోయాక అతనిగదిలో మంచినీళ్ళు పెట్టడానికని వచ్చి "బాధపడుతున్నారు కదూ మీరు. మీ ఊహలకు తగ్గట్లేను. ఏం చేస్తాను. ఎందులోనూ ప్రవేశము లేకపోవడం అది నా దురదృష్టం," అంది. దుఃఖంలో తడిసి అక్షరాలు ఒకదానితో ఒకటి అంటుకుపోయిన స్పష్టత లేని బొంగురుకంఠాన్ని వినేసరికి అతను చలించిపోయాడు. అంతకుముందు ఎప్పుడూ ఆమె అలా కాలేదు. ఆమె కంఠాన్ని అలా వినడం అదే

మొదటిసారి. చిరునవ్వుతో సాగిన పెదా లనో, అధికారంతో తెరచుకున్న పెదా లనో, అప్పుడప్పుడు కోపంతో బిగు సుకుపోయిన పెదాలనో చూశాడుగాని దుఃఖంతో యిలా వణికిపోయిన పెదా ల్ని చూడలేదు. అది అతను భరించ లేకపోయాడు.

"బాధపడడంలేదు నాగావళీ! బాధ పడాల్సిన అవసరంకూడా లేదు. నాకు కూడా ఏవీ చేతకావు. అందుకని నే నెప్పుడూ బాధపడలేదే. మన మంతా కళాకారులం కాలేం. కళను అర్థం చేసుకోగలిగే ఈ స్టటిక్ సెన్స్ వుంటే చాలు. అంతకన్న అదృష్టం ఎందుకూ," అన్నాడు.

మంచినీళ్ళు పెట్టేసి నాగావళి వెళ్ళి పోయింది.

'నీ కేమీ చేతగాకపోయినా నా జీవి తాన్ని రసాత్మకం చెయ్యగలవు. చాలు' అనుకున్నాడు. ఆ తర్వాత—

'శాసించడం మానుకోవాలి నాగావళీ. అందమైన, ఎర్రని నీ నాజూకు పెదాలు అనురాగస్వరాల్ని మీటడానికే తప్ప శాసించడానికి కాదు—' అనుకున్నాడు.

నాగావళి అతని జీవితంమీదకు పొగ మంచులా జారి, బిందువులుగా విడిపోయి, వెలుగుకిరణాల్ని అందుకుని, సప్తవర్ణా లుగా వికేంద్రీకరించి, ఆ విడిన రంగు లను తిరిగి అతని జీవితంమీదనే కుమ్మ రించి రంగులు అద్ది మరింత అందంగా శోభాయమానంగా తీర్చిదిద్దుతుంది. మరొకప్పుడు సరుగుడు తోటలోంచి వీచిన చల్లని గాలితెరలా అతని జీవితం మీదకు దిగి అతని ఆలోచనల కొసల్ని అందుకుని ఆకాశంలోకి ఎగిరి, అక్కడ మేఘాలమీద నిలిపి, దూరతీరాల్లోని రంగురంగుల పూలను చూపి, గొప్ప అనుభవంతో నింపివేస్తుంది. ఇంకొక ప్పుడు కెరటంలా వచ్చి అతని జీవితాన్ని చుట్టుముట్టి, ఉద్రేకంతో ఒక్క కుదుపు కుదిపి పెకలించి కదిల్చి సప్తవర్ణాలతో మెరిసే ఇసుక సింహాసనంమీద ప్రతిష్ఠి స్తుంది. కాని అన్నిటినీమించి ఎక్కువగా తన వ్యక్తిత్వాన్నే గొడుగులా అతని జీవితంమీద పట్టి, ఎండనీ, వాననీ అతనిమీద వాలనీకుండా కాపాడుతుంది.

కాని —

అతను అప్పుడప్పుడు వర్షంలో తడుస్తూ నడవాలనీ, ఎండలో తిరగాలనీ అనుకుంటాడు. ఆమె ఒదిలిపెట్టదు. అతనికి కోపం వస్తుంది. బాధకూడా కలుగుతుంది.

ఇలా చాలాసార్లు జరిగింది

వారంరోజుల తర్వాత అతనికి బేంకులో ఉద్యోగం దొరికింది. ఆరోజు షికారుకు వెళ్ళొచ్చిన సదానందతో "మీ కో మంచివార్త చెప్తాను, నా కే మిస్తారు ?" అంది.

"నీ యిష్ట మొచ్చింది కోరుకో. యిస్తాను," అన్నాడు.

"అదే వొద్దు. అలా కలల్లో నిలుచుని మాట్లాడతా రెందుకు. మామూలుగా మాట్లాడండి," అంది.

అతని మనస్సు చివుక్కుమంది. 'ఈమెకు తన మాటలే ప్రధానమా: హృదయం ప్రధానం కాదా? ఈమాటల వెనుక తన హృదయాన్ని గుర్తించదేం' అనుకున్నాడు. మూతి ముడుచుకొని లోపలకు వెళ్ళిపోబోతోంటే కూడావచ్చి "పోనీలెండి; ఏ బహుమతీ యివ్వక్కర లేదు గానీ .యీ మాట ఆలకించండి - మీకు బేంకులో ఉద్యోగం వచ్చింది."

మరొకప్పుడైతే ఆనందంతో 'అలాగా: అయితే తప్పకుండా నీకు బహుమతి యివ్వాల్సిందే. రేపే నీకు ఫలానా వస్తువు బహుమతి చేస్తాను' అనేవాడు. కాని ఇప్పుడలా అనాలని పించలేదు. తన హృదయాన్ని గుర్తు పట్టనప్పుడు ఎందుకు దాన్ని బైటకు తీసి ప్రదర్శించాలి ?

'ఆఁహా' అన్నట్టు తలమాత్రం ఊపాడు.

ఆమె దెబ్బతింది. అయినా తేరుకుని మామూలుగానే, "నాన్నగారు చెప్పారు మీకు ఉద్యోగం వచ్చిందని. ఆ కాగితం వారిదగ్గరే వుంది. నిద్రపోతున్నారు గాబోలు. పొద్దున చూద్దురుగాని," అంది.

ఏమైనా ఆ రోజు ఉండాల్సినంత ఆహ్లాదకరంగా లేదు వాతావరణం.

సదానంద మంచిరోజు చూసుకుని



ఉద్యోగంలో చేరాడు. మొదట్లో కొంత కొత్తగావున్నా రానురాను అలవాటై పోయింది. పైముకు వెళ్ళడం, టైముకు రావడం. బేంకులో కూర్చునంతసేపే బాధ్యతలు. బైటికొస్తే మరేచింతా వుండదు. సాయంకాలంపూట కాస్సేపు అలా ఏ సముద్రపు ఒడ్డునో కూర్చుని మెల్లగా యింటికి వచ్చేవాడు. భోంచేసి ఏ నవలో పట్టుకుంటే రాత్రి పన్నెం డయిపోయేది.

"మరీ అంతరాత్రివరకూ మేల్కొని వుంటా రెందుకూ? ఆరోగ్యంపాడౌతుం" దని అనేకసార్లు నాగావళి కసురుకొనేది. ఐనా వినేవాడు కాదు. కాస్సేపైనా చదవకపోతే నిద్రరాదు అనేవాడు. కోపం వచ్చి పుస్తకాలు పట్టుకురావడం మానే సింది. ఎక్కడైనా లైబ్రరీలో చేరాడో ఏమో తనే తెచ్చుకుంటుండేవాడు.

ఒకసారి మామ్ 'రైటర్స్ నోట్ బుక్' తెచ్చాడు. భోంచేసి పుస్తకం పట్టుకూర్చున్నాడు. రాత్రి పదయ్యింది.

లైట్లు ఆరిపోయాయి. వస్తాయేమోనని అర్ధగంటసేపు కాచుకూర్చున్నా ఎంతకీ రాలేదు. విసుగొచ్చింది. గత రోజు కూడా యింతే. మునిసిపాలిటీవారిమీద కోపంవచ్చి తిట్టుకున్నాడు కూడాను. లైట్ల గురించి ఎదురుచూస్తూ కూర్చుని కూర్చుని చివరికి నిద్రపోయాడు. ఆ మర్నాడు, బేంకులో పక్క సీటు ఆయనతో మునిసిపాలిటీవాళ్ళ చేతకాని తనాన్నిగూర్చి తీవ్రంగా చర్చించాడు. స్థానిక రాజకీయ వారపత్రికలో సంపాదక లేఖావళికి ఒక ఉత్తరంకూడా దీని మీద రాద్దామనుకున్నాడు. రాత్రి భోజనందగ్గర కొద్దిగా ఈ విషయం నాగావళితో చర్చించాడుకూడాను.

ఏం లాభం, ఆ రాత్రికూడా అలానే అయ్యింది.

పదింటికి లైట్లు ఆరిపోతే పంతంపట్టి గంటసేపు కూర్చున్నా లైట్లు రాలేదు. అయితే ఆరోజు జాగ్రత్తపడి ముందే కొవ్వొత్తులు కొనుక్కుని వచ్చాడు. ఒకటి వెలిగించి కూర్చున్నాడు. ఆ వెలుతురుకింద చదవడం సాధ్యం కాలేదు. కళ్ళు మండాయి. వీధి వరండాలోకి వచ్చాడు. సిగరెట్లు కాల్చుకుందామని అగ్గిపుల్ల వెలిగించేసరికి నడవా కిటికీ వెనక గాజులచప్పుడు వినిపించింది. అటు చూశాడు. పక్కకు తప్పుకున్న అస్పష్టమైన ఆకారం ఒకటి క్షణంపాటు కనిపించి మాయమై పోయింది.

నాగావళే. ఆ బుట్టలోలకులు ఆమెవే. ఇంత రాత్రివరకూ నిద్రపోలేదా! ఏం చేస్తోంది?

చటుక్కున మెరుపులా ఓ ఆలోచన తట్టి అవతలికి వెళ్ళి చూశాడు. ఆ యింటికి అటూ యిటూ వున్న యిళ్ళల్లో దీపాలు వెలుగుతూనే వున్నాయి. ఇవతలి యింట్లో అంతా నిద్రపోతున్నారు గాబోలు, ఓ గదిలో మాత్రం అతి నీరసంగా, రోగిష్టివాడిలా నీలంరంగు బెడ్ రూమ్‌లైటు వెలుగుతోంది. అవతలి యింట్లో యింకా నిద్రపోలేదేమో ట్యూబులైటు వేసివుంది.

అతనికి అర్ధమయ్యింది. ఇది నాగావళి పనే. ఇంట్లో మెయిన్ ఆపేస్తోన్నట్టుంది. ఎందుకిలా చేస్తోంది? తనచుట్టూ హద్దుల్ని ఎందుకు గీస్తోంది? కొన్ని విషయాలలో తనంతట తాను కల్పించుకుని తలదూర్చినా అందంవుంది. ప్రతిదీ పట్టించుకోవడం ఏమీ బావుండలేదు— నాగావళిమీద కోపమేకాదు చాలా చిరాకు కూడా వచ్చింది.

సిగరెట్ల విషయంలోనూ ఇంతే జరిగింది. అతనికి సిగరెట్లు కాల్చే అలవాటు వుంది. ఎక్కువగానే కాలుస్తుంటాడు. ఈ వూరొచ్చింతర్వాత మరీ ఎక్కువయింది. నాగావళి చూసినా అట్టే పట్టించుకోలేదు.

ఒకరోజు పనిమనిషి రాకపోతే నాగావళే వెళ్ళి అతని గది ఊడ్చింది. అప్పుడు పోగయిన సిగిరెట్టు పీకెలు చూసేసరికి ఆమెకు ఆశ్చర్యమేకాదు కోపంకూడా వచ్చింది.

"మీ పద్ధతేమీ నచ్చలేదు. ఒక్క రాత్రిలో యిన్ని సిగరెట్లా ఈ లెక్కన రోజుకి ఎన్ని పెట్లు తగలేస్తుంటారు. ఏమీ తోచకపోతే ఏ ఒకటో రెండో కాల్చినా అర్థంవుంది. మరీ యిన్నటండీ! ఇలా రాత్రిళ్ళు నిద్రపోక సిగరెట్లు తగలేస్తూ కూచుంటే ఎప్పుడో ఒకప్పుడు ఒంటికి తెచ్చుకునేట్టే వున్నారు." అంది. టేబిలుమీద సిగరెట్టుపెట్టె వుంటే తీసి చింపేసి, సిగరెట్లను చిదిమి పారేసింది.

నాగావళి కోపం ప్రదర్శించినా నవ్వొచ్చేట్టుగానే వుంది. పెట్టెను ముక్కలు ముక్కలుగా చింపేసి సిగరెట్లను చిదిమి పారేయాలన్న పొడుగాటి నాజూకైన వేళ్ళ కంగారు, పిడికిలి బిగింపులో కసి, వాసనని భరించలేక అసహ్యించుకుంటున్న చిట్లించిన నాసికాపుటాలు, బలాన్ని ఒకేచోట కేంద్రీకరించి సడలిపోకుండా బిగబెట్టిన పెదాలు, మాటిమాటికీ అతని ముఖంలోని మార్పుల్ని కొలుస్తూ ఎగిరే చూపులు చూసేసరికి అతను నవ్వాపుకోలేకపోయాడు.

అతను నవ్వుతోంటే ఆమెకు ఉక్రోషము వచ్చి, తుడిచిన తుక్కయినా ఎత్తకుండా ఎక్కడివక్కడే ఒదిలేసి వెళ్ళింది.



'బావుంది; చాలా బావుంది. అసహాయతలోంచి వచ్చిన కోపంలో మరీ అందంగా వుంటుంది సుమా' – అనుకున్నాడు అతను.

అప్పటినించీ అతను సిగరెట్టు పెట్టెగానీ, అగ్గిపెట్టెగానీ బయట వుంచేసేవాడు కాదు. ఉంచేస్తే చింపిపారేయకుండా ఆమె వొదిలిపెట్టేది కాదు. మొదట్లో ఆమె చింపిపారేస్తోంటే అందంగానే అనిపించేది కాని, రాను రాను చికాకు కలుగుతుండేది. ఇదికూడా తనను శాసించడమే అనిపించింది అతనికి.

'అవును. ఇది శాసించడంకాక మరేమిటి? తన స్వేచ్ఛకు హద్దుల్ని ఏర్పరచడం తనమీద అధికారాన్ని చెలాయించడం కాదూ. చాలా తెలివిగా శాసిస్తోందే! తనకు తెలియకుండా తననుకట్టి పడేయాలని చూస్తున్నట్టుంది. తనదైన వ్యక్తిత్వం తనకు లేకుండా చేస్తోంది యీమె –' అనుకున్నాడు.

రోజూ ఏదో ఒక సంఘటన జరుగుతూనే వుంది. ఆమె ప్రతిపలుకూ తనను శాసించడానికే, ఆమె ప్రతిచర్యా తనను కట్టిపడేయడానికే అన్నభావం అతనిలో మరీ బలపడిపోయింది. ఆమెమీద చిరాకూ, కోపమూ వస్తున్నాయి. ఆ విషయం ఆలోచిస్తోంటే ఒక్కొక్కప్పుడు అతనికే ఆశ్చర్యంగా వుండేది.

* * *

సదానంద తొలిజీతము అందుకున్నాడు. తన ఖర్చులకింద కొంత డబ్బు రాఘవరావుకిస్తే ఆయన పుచ్చుకోలేదు.

"ఈ నెలనించేకదోయ్ సంపాదనలో పడ్డావు. వొచ్చేనెలనుంచి చూద్దాంలే. ఇంటికి పంపించు," అన్నారు ఆయన.

ఇంటికి డబ్బు పంపించడం కన్న తల్లికీ, అక్కకూ బట్టలు తీసి పంపిస్తే బావుంటుందనిపించింది. చీరలగురించి తనకు తెలీదుకదా, ఎట్లా? — అనుకుంటుండగా చటుక్కున నాగావళి జ్ఞప్తికి వచ్చింది. ఆమెకు ఆ విషయం చెప్పాడు.

"అలానేలెండి. రేపు ఎలాగూ మేం బజారుకు వెళ్ళదలచుకున్నాం. స్నేహితురాలు ఏవో బట్టలు తీసుకుంటానంది. నేనుకూడా జాకెట్టుగుడ్డలు తీసుకోవాలి. రేపు ఆఫీసునుంచి నేరుగా యింటికొచ్చేస్తే యిక్కడ్నుంచి కలిసి వెళ్ళొచ్చు." అంది.

"నేనెందుకు మళ్ళీ. మీ రిద్దరూ ఎలాగూ వెళ్తున్నారుకదా. మీరే తెచ్చెయ్యండి." అన్నాడు.

"తెచ్చేసాంలెండి. తమరూ రండి. ఫరవాలేదు." అంది నాగావళి.

ఆ మాటలు విన్న తర్వాత అతనికే సిగ్గేసింది. మరేమీ మాట్లాడలేకపోయాడు.

మర్నాడు సాయంకాలం ఆఫీసు నుంచి తిన్నగా యింటికే వచ్చేశాడు. నాగావళి స్నేహితురాలుకూడా వచ్చింది. ఇంట్లో చెప్పి బజారుకు బయలుదేరారు.

వాళ్లు తరచుగా బట్టలు కొనే దుకాణం ఒకటివుంది. అక్కడకు వెళ్ళారు. నాగావళి స్నేహితురాలు పి.డబ్లు.డి. ఇంజనీరుగారి అమ్మాయి. కాస్త పెద్ద ఎత్తునే బట్టలు ఖరీదుచేసింది. అంత పెద్ద ఖరీదు చేసిన అమ్మాయిపక్కనేతవి బ్లౌజు పీసులు ఖరీదుచేస్తున్న నాగావళిని చూస్తే అతనికి జాలేసింది. అక్కకూ, తల్లికీ చీరలు సెలక్టు చేయించి తీసుకుని, నాగావళికికూడా ఒకటి తీసికోబోయాడు. "నా కెందుకూ చీర. కొని, యింకా వాడని కొత్త చీరలే రెండోమూడో పెట్లో వున్నాయి. కిందటి నెల్లోనే మే మిద్దరమూ వచ్చి ఓ చీర కొనుక్కెళ్ళాం. వొద్దు, తియ్యకండి," అంది. ఆచీర లోపల పెట్టించేసింది.

సదానందకూడా తన కేవైనా బట్టలు తీసుకుందామనుకున్నాడు. పేంటుగుడ్డలు చూస్తోంటే నాగావళి "ఇదేమిటిగాని మీకు లాల్చీ షరాయి చాలా చక్కగా

నవ్వుతుంది - అవి తీసుకోండి," అంది.

"నా కవి నచ్చవు. కళాకారుడి వేషం వేసినట్టుంటుంది," అన్నాడు.

"లేదు. అవి మీకు చాలాబాగా సరిపోతాయి. సన్నటివాళ్ళకు లాల్చీ షరాయి బావుంటుంది. ఓ జత కుట్టించుకుని చూడండి," అంది తిరిగి.

"వొద్దులేద్దూ. నాకు నచ్చనిది," అనేశాడు.



"అదికాదు. ఒక్కజత కుట్టించుకుని చూడండి. మీకు చాలా బావుంటుందంటే నమ్మరేం," అని అ వెంటనే "ఏదయ్యా లాల్చీ షరాయిలకు మంచి గుడ్డవుంటే చూపించు," అంది కొట్లో గుమాస్తాతో. రెండుమూడురకాలు చూసి ఓరకం పైకి తీసి "ఇది బాగున్నట్టుంది కదూ!" అని సదానందకు చూపించింది.

నాగావళి ప్రవర్తన సదానందకు చాలా చికాకు కలిగించింది. అప్పటికే కొట్టువాడూ, గుమాస్తాలూ వాళ్ళ సంభాషణని ఆలకించారు. నాగావళి స్నేహితురాలుకూడా పెదాల్ని బిగబెట్టి నవ్వాపుకుంటోంది. అవన్నీ సదానంద గుర్తించాడు. అతనికి చిరాకు వేసింది. 'ఇప్పుడొద్దు. తర్వాత తీసుకుంటాలే' అని అందామనుకున్నాడుగాని అప్పటికే నాగావళి ఆయనకు ఎంతగుడ్డ కావాలో లెక్కగట్టి చింపి యిచ్చెయ్యమని ఆర్డరు యిచ్చేసింది.

ఆకొట్టు అరుగుమీదే ఓ మిషను పెట్టుకుని టైలరు ఒకడు వున్నాడు. అతనికి ఇచ్చేసి కొలతలు తీసుకోమంది నాగావళి. "మళ్ళీ ఎక్కడికో వెళ్ళడం ఎందుకూ. యీయన కిచ్చేస్తే యీయనే కుట్టేస్తాడు. నాన్నగారుకూడా యితని దగ్గరే కుట్టించుకుంటారులెండి. బాగానే కుడతాడు; కొలతలు ఇవ్వండి,"అంది, సంజాయిషీ యిచ్చుకుంటున్నట్టు సదానందతో.

సదానందకు సహనం సన్నగిల్లిపోతోంది. అనవసరగా అక్కడ అల్లరి పడడం యిష్టంలేక మౌనంగా కొలతలు యిచ్చేశాడు.

ఆకొట్లో ఎక్కువసేపు వుండబుద్ధేయ లేదు అతనికి. అక్కడ అందరిచూపులూ తనమీదే వున్నట్టనిపించాయి. బిల్లు చెల్లించేసి బయటపడ్డాడు.

"ఇంటికేనా," అంది నాగావళి.

అతను సమాధానం చెప్పకుండా నడుస్తున్నాడు.

ఆమె తనలో తనే నవ్వుకుంది.

కొంతదూరం వెళ్ళిన తర్వాత తనకు పనుంది, అటు వెళ్ళా లని గాలికి చెప్పి నట్టు చెప్పి గబగబా అడుగులు వేసు కుంటూ మరోవైపు వెళ్ళిపోయాడు సదా నంద. అలా వెళ్ళివెళ్ళి సముద్రపుటొడ్డు కొచ్చి కూర్చున్నాడు.

ఎదుటివారి యిష్టాయిష్టాల్ని ఎందుకు గుర్తించ దీమె. ఇతరులకుకూడా వ్యక్తి త్వాలు వుంటాయనీ వాటిని గౌరవించా లనీ యీమెకు తెలీదా? ఇతరుల వ్యక్తి త్వముమీద తన ప్రభావాన్ని ప్రసరింప జేయడం స్వార్థపరుల లక్షణం అని ఎందుకు గుర్తించదు. ఆ బలవంత మేమిటి. ఆ అధికారాన్ని ఎవరిచ్చారు. జీవనసామ్రాజ్యంలో మహారాజ్ఞి అవుతు న్నంత మాత్రంచేత ఆ జీవితాన్ని శాసించడానికి పూనుకోవడం తెలివైన పనికాదు. శాసించేకంఠాన్ని తను భరించ లేడు. ఇతరుల వ్యక్తిత్వపు నీడల్లో నిల బడడం తనకు యిష్టంలేదు. స్వేచ్ఛాజీవి తానికి అలవాటుపడిన తను ఏ పరిధుల మధ్యా ఆనందంగా జీవించలేడు. జీవించ గలననుకోవడం ఆత్మవంచనే – అను కున్నాడు.

అతని మనసంతా కకావికలు గా అయిపోయింది. ఇంతకాలంగా అతను హృదయంలో నిలుపుకున్నరూపం మంచులా కరిగి నీరుగారిపోయింది. అక్కడ అతనికొరకు మిగిలిందేమీలేదు. తన సర్వస్వమూ కోల్పోయినవాడిలాగ అతను బాధపడ్డాడు.

రాత్రి బాగా పొద్దుపోయేవరకు అతను ఆలోచనల్లోనే గడిపి మెల్లగా యింటిని చేరుకున్నాడు.

నాగావళి మేలుకునేవుంది. తలుపు తట్టితే వొచ్చి తలుపు తీసింది. ఆవిడే భోజనంకూడా వడ్డించింది. చాలా ముభా వంగా భోంచేసి లేచిపోయాడు. గదిలో కొచ్చి కొవ్వొత్తి వెలిగించి, ఏదో రాసుకుంటూ కూచున్నాడు. నాగవళి మంచినీళ్ళు పెడదామని వొచ్చి చూసి, కరెంటుదీపంవెలిగించి వెళ్ళిపోయింది. ఆ వెనకనే లేచొచ్చి కరెంటుదీపం ఆర్పేసి, కొవ్వొత్తి వెలుతుర్లోనే రాసుకుంటూ కూచున్నాడు. రాయడం పూర్తయ్యాక, కొవ్వొత్తి కరిగికరిగి చీకట్లో మునిగి పోయేవరకూ దాన్నే చూస్తూకూర్చుని, నిద్రపోయాడు.

ఉదయం రాఘవరావుగారితో "మధ్యా హ్నము బండికి వూ రెళ్తున్నానండీ. నిన్ననే మా అమ్మ వుత్తరం రాసింది ఓసారి రమ్మనమని," అన్నాడు.

"అప్పుడే యింటిమీద బెంగెట్టేసు కున్నావుటోయ్. భలేవాడివే," అని ఓవిట్టు విసిరి, విసిరినందుకు నవ్వుకుని "సర్లే వెళ్ళిరా. నిన్న మీ అక్కయ్యకీ, అమ్మకీ బట్టలుకూడా తీసుకున్నావటగా. మంచిపనిచేశావ్. తొలిజీతం అలాగే చెయ్యాలి. నేనూ చిన్నప్పుడు యింతే చేశాను. అదిసరేకాని అక్కడ ఎక్కువ

రోజులు వుండిపోక. కొత్తవుద్యోగం కదా బావుండదు," అన్నాడు ఆయన. ఆఫీసుకు వెళ్ళిపోతూ "ఎక్కువరోజులు వుండిపోకుండా త్వరగా వచ్చెయ్. వీలయితే మీ అమ్మనుకూడా తీసుకురా" అని మరోసారి హెచ్చరించారు.

సామాను సర్దుకుంటుండగా నాగావళి వచ్చింది.

"వూరు వెళ్తున్నారా ... నిన్న మాట మాత్రంగానైనా చెప్పలేదేం?" అంది.

"పొద్దున్న చెప్పాగా. మీ నాన్నగారితో చెప్తున్నప్పుడు నువ్వూ విన్నట్టున్నావు కదూ."

"అంతేనా? అంతకన్న ప్రత్యేకంగా చెప్పాలనుకోలేదా మీరు."

"ఎందు కనుకోలేదూ. తప్పకుండా నీకు చెప్పే వెళ్తాను. అలా చెప్పాల్సిన అవసరంకూడా వుంది."

నాగావళి అనుమానంగా చూసింది. అతను చూపులు మార్చుకున్నాడు.

"భోజనం వడ్డించేస్తావా, బండికి టైమయినట్టుంది."

"అలాగే...రండి" అంటూ వెళ్ళిపోయిం దామె.

భోజనం చేసి, కాస్సేపు కూర్చుని యింట్లో అందరికీ చెప్పి బయలుదేరాడు. బయలుదేరేముందు నాగావళికి మళ్ళీ మరొకసారి చెప్పి "మీ స్నేహితురాలికి కూడా చెప్పు. అన్నట్టు ఆమె పుస్తకాలు యిచ్చేసెయ్. ఇచ్చేముందు అందులో



ఏమైనా రూపాయలు వున్నాయేమో ఓ సారిచూడు. పుస్తకాలమధ్య నోట్లు పెట్టే పాడు అలవాటు నాకుంది...వస్తా మరి...మర్చి..."

రిక్షా అలా కదలడంతోనే నాగావళి గబగబా అతని గదిలోకి వెళ్ళింది. కంగారుగా పుస్తకాలన్నీ తిరగేస్తోంది. రూపాయలు వుండవని ఆమెకు తెలుసు. ఏదో విశేషం వుండాలి. లేకపోతే ప్రత్యేకించి యీ విషయం చెప్పడం ఎందుకు? వేళ్ళు ఆత్రుతగా పేజీల్ని తిప్పుతున్నాయి. గుండెకూడా గబగబా కొట్టుకుని కదిలే వేళ్ళకు తాళం వేస్తోంది. అకస్మాత్తుగా ఆమె చూపులు నిలిచి పోయాయి. ఓ పుస్తకంలో మడత పెట్టిన కాగితం; పైన నాగావళి పేరు!

కొద్దిసెకనులు గుండె కొట్టుకోవడం మానేసి మళ్ళీ ప్రారంభించింది.

ఆత్రంగా కాగితం మడతలు విప్పింది.

'నాగావళీ—
బానిసత్వం ఎరగనివాణ్ణి. చిన్నప్పటినుంచీ స్వేచ్ఛగా పెరిగినవాణ్ణి. ఎప్పుడూ ఎవరి అదుపాజ్ఞల్లోనూ వుండలేదు. ఎవరి నీడల్లోనూ పెరగలేదు. చాలా స్వతంత్రంగా జీవించాను. ఎదుటివారి ఆధిక్యతని వొప్పుకుంటాను గాని తలవంచలేను. ఇంట్లోకాని, స్కూల్లోకాని ఎప్పుడయినా ఎవరయినా అధికారాన్ని చెలాయించడానికి ప్రయత్నిస్తే పడేవాడిని కాదు. పరిధులు గీసి, ఆ పరిధుల మధ్య నున్న నిలబెట్టడానికి ప్రయత్నించేవాళ్ళంటే నాకు తగని చిరాకు. అధికారంతోగాని, అభిమానంతోగాని ఎవరయినా నన్ను కట్టిపడేయాలని చూస్తున్నట్టు అర్థమైతే మళ్ళీ వారి దగ్గరకు వెళ్ళేవాడిని కాను. అలా నా వ్యక్తిత్వాన్ని నిర్మించుకుంటూ వచ్చాను. దీనిపై యితరుల ప్రభావం పడడం నాకిష్టం లేదు. నాదైన వ్యక్తిత్వం నాకు వుండాలని నా ఆరాటం.

నాగావళీ! నేను అందగాణ్ణి కాకపోయినా అందమైన అమ్మాయిని నా జీవితంలోకి తెచ్చుకోవాలని స్వార్థపరుడిగా కలలుగన్నాను. నిన్ను చూసిన తర్వాత ఎన్నో ఊహల్ని అల్లుకున్నాను. అదృష్టవంతుడ్నని మురిసిపోయాను. జీవితాన్ని అడుగడుగునా రసమయం చేసుకోవచ్చని ముచ్చటపడ్డాను. కాని నువ్వు అభిమానంతో కట్టిపడేయాలని చూశావు. ప్రేమతో శాసించడానికి ప్రయత్నించావు. నా వ్యక్తిత్వాన్ని కూడా గౌరవించాలనే విషయాన్ని విస్మరించావు. నేనది సహించలేకపోయాను.

ఇప్పటికీ నీ అందాన్ని మెచ్చుకుంటాను. నీ అభిమానానికి కృతజ్ఞత చెప్పుకుంటాను. ఎన్నోసార్లు ఎన్నో రకాలుగా బాధపెట్టాను నిన్ను. నువ్వు నా జీవితాన్ని శాసించడానికి ప్రయత్నిస్తున్నావని తెలిసి, కావాలని నీకు బాధ కలిగేటట్టు ప్రవర్తించాను. నన్ను క్షమించు.

ప్రేమతోనైనా శాసింపబడడం ఇష్టం లేదు నాకు.

అందుకే నీ నీడనుంచి తప్పుకుని వెళ్ళిపోతున్నాను. నీకు బాధకలిగించినందుకు మరోసారి క్షమాపణ చెప్పుకుంటున్నాను.

—సదానంద.'

నాగావళికి దుఃఖం ఆగిందికాదు. పెదాల్ని బిగబెట్టి ఎంతగా ఆపుకోవాలని చూసినా సాధ్యంకాలేదు. చెక్కిళ్ళు తడిసిపోయాయి. అరగంటవరకూ ఆ గదిలోంచి బైటికి రాలేకపోయింది. ఆ రోజల్లా తలనొప్పిగా వుందని మంచం లోంచి లేవలేదు.

కూతురి వాలకాన్ని చూసి ఏదో జరిగుంటుందని తల్లీ, తండ్రీ పసిగట్టి అడిగారు గాని ఆమె ఏమీ చెప్పలేదు. 'ఏమీ లేదు ... ఏమీలేదు' అనేసింది. చివరకి

రాఘవరావుగారే అతి లౌక్యంగా సదా నంద తల్లిపేరున వుత్తరం రాశారు. ఇప్పుడు అబ్బాయి చేస్తున్న వుద్యోగం చాలా మంచిది. ఎం. ఏ. చదువులు చదువుకున్నవాళ్లుకూడా దానికి ఎగబడు తుంటారు. ఆ ఉద్యోగం మన అదృష్టం కొద్దీ దొరికింది. అబ్బాయి చేరి నెల రోజులన్నా కాలేదు. ఇంటిమీద ధ్యాస పుట్టిందంటే సరే వెళ్ళిరమ్మన్నాను. ఎక్కువరోజులు అక్కడ వుంచక సాధ్యమైనంత త్వరలో అబ్బాయిని పంపించేస్తే మంచిది. అబ్బాయితోపాటు మీ రూ రండి; వారంరోజులుండి వెళ్లు దురుగాని. మనవాళ్లు చాలామంది వున్నా రిక్కడ. వీళ్ళందర్నీ చూసినట్టూ అవు తుంది — అని.

ఆ ఉత్తరంసదానందే అందుకున్నాడు. చదువుకుని నవ్వుకున్నాడు. దానితో పాటు కవరుకూడా ఒకటి వచ్చింది. పై హేండ్‌రైటింగ్ కొత్తగావుంది. చించి, వుత్తరం బైటికి తీశాడు. చిన్నదే. అడు గున నాగావళి సంతకంవుంది. చదువు కున్నాడు——

"శ్రీ సదానందగారికి నాగావళి హృదయ పూర్వకంగా నమస్కరించి వ్రాయునది.

మీరు వొదిలిపెట్టి వెళ్ళిన వుత్తరం చూశాను. నేను దురదృష్టవంతురాలిననీ తెలుసుకున్నాను. బాధపడ్డాను. నిజానికి యీ వుత్తరం రాయాలనుకోలేదు. కాని మీ వుత్తరంలోని ఒక విషయానికి



సమాధానంగా యిది రాయక తప్పలేదు.

మీరు మీది అనుకుంటున్న వ్యక్తిత్వం మీదికాదు. అసలు మీకు ఒక వ్యక్తిత్వం అంటూ స్థిరంగా ఏదీలేదు. మరీ మంచి వాళ్ళకూ, అమాయకులకూ ఒక స్థిర మైన వ్యక్తిత్వం అంటూ వుండదు. ఎప్పటికప్పుడు అది మారిపోతూ వుంటుంది. ఎదుటివారిని బాధపెట్టడం యిష్టంలేక తమ అభిరుచుల్ని మార్చు కుంటూపోతుంటారు. దాన్నిబట్టే వ్యక్తి త్వాలుకూడా మారుతూవుంటాయి. అలా మారడం తప్పేమీ కాదు. మీ వ్యక్తి త్వంమీద యితరుల ప్రభావం పడుతుం దని బాధపడిపోవలసిన పనేమీ లేదు.

మొట్టమొదట మీ నీడలోనే నేను వుందామనుకున్నాను. కాని మీమీదనే గొడుగుపట్టాల్సిన అవసరం వుందని తెలుసుకున్నాను. అంతటా సౌందర్యాన్నీ, మంచితనాన్నీ చూసే మీకు ఊహల్లో విహరించడం తప్ప భూమ్మీద నడవడం చేతకాదు. అందువల్ల

ఎప్పుడూ నీడలా అంటిపెట్టుకునే మనిషి అవసరం మీకు.

మిమ్మల్ని శాసించాలన్న అధికార మనస్తత్వంకానీ, కట్టిపడేయాలన్న స్వార్ధంకానీ నాకు లేవు.

మీ చుట్టూ ఎన్నో ఆశల్ని అల్లుకున్నాను. కాని మీరు దూరంగా పారిపోయారు. ఏంచేస్తాను-నా అదృష్టం అంతంతమాత్రంగానేవుంది. కాని మీకు నా సలహా ఒకటివుంది. ఎప్పుడైనా మీరు పెళ్ళిచేసుకోదలిస్తే మిమ్మల్ని శాసించగలిగే ఆమెనే పెళ్ళిచేసుకోండి. మీఅంతట మీరు ఏపనీ చెయ్యలేరు. ఎవరో లాలించి, అవసరమైతే కసిరి, కోప్పడి మీచేత ఆపని చేయించాలి. అందువల్ల మీకు మేలేకాని నష్టం కలుగదు —— ఉంటానుమరి

—— నాగావళి."

ఆ ఉత్తరం మళ్ళీ చదువుకున్నాడు. ఇంకొకసారి కూడా చదువుకున్నాడు. సాయంకాలం కోనేరు గట్టుమీద కెళ్ళి చీకటిపడేవరకూ ఆ వుత్తరాన్ని ముందుంచుకునే కూర్చున్నాడు. చివరకు ఆలోచనలన్నిటినీ అదే వుత్తరంలో మడతపెట్టి, జేబులో పెట్టేసుకుని ఇంటికొచ్చి, బేంకువాళ్ళకు వుత్తరం రాశాడు- అర్జంటు పనివల్ల స్వగ్రామం రావలసి వచ్చిందనీ, సెలవు దరఖాస్తు పెట్టడానికి కూడా వ్యవధి లేకపోయిందనీ, అందువల్ల పోస్టులో పంపిస్తున్నాననీ, అయిదు రోజులు సెలవు యిప్పించవలసిందనీ వ్రాసి, ఆరాత్రికిరాత్రే పోస్టు చేశాడు సదానంద.



# ఏది సాంప్రదాయం!

రాచకొండ రంగనాథశర్మ



"సుధా...సుధా" వీధిలోంచే గావుకేకలు పెడుతూ వచ్చాడు మాధవరావు.

పత్రిక తిరగవేస్తూన్న సుధ మాధవ రావు ముఖంలోకి ఆందోళనగా చూసింది.

"ఏం అన్నయ్యా?"

"నేను విన్నది నిజమేనా?" సూటిగా సుధ ముఖంలోకి చూస్తూ అడిగాడు మాధవరావు.

"అంటే."

"నీకు తెలీదా? – లేకపోతే ఎవరికీ తెలియదనుకున్నావా? ఎన్నాళ్ళబట్టి మీ యిద్దరి మధ్యా"

"అన్నయ్యా?"

"చెప్పు – నిజం చెప్పు. సూర్యాన్ని ప్రేమిస్తున్నావా?"

ఔ నన్నట్టు తలూపింది సుధ.

"సుధా!" మేఘగర్జనలా ఉంది మాధవ్ గొంతు – "ఏమిటీ స్వతంత్రం నీకీ యింట్లో? నీ జీవితానికీ, భవిష్యత్తుకూ, పునాదులు వేసుకోవటానికి ముందు – నన్ను, నా గౌరవాన్ని గురించి ఆలోచించలేదా? పరువుగల అన్నయ్య బ్రతుకు బజారుపాలౌతుందని ఊహించలేదా? నీ నిర్ణయానికి ముందు నిన్ను కంటికి రెప్పలా పెంచిన అన్నయ్య నడగాలనీ, అతని సలహా తీసుకోవాలనీ అనిపించలేదా?"

"ఇంతకూ నేను చేసిన తప్పేమిటి?" సుధ సూటిగా ప్రశ్నించింది.

"ఆ సూర్యంగాణ్ణి ప్రేమించడమే తప్పు. సూర్యం ఎవరు? ఎవరు సుధా సూర్యం? నీ కేమైనా తెలుసా? వాడికి జాతి లేదు,

కులం లేదు, గోత్రం లేదు. అలాటి అనామకుడితో నీ ప్రేమ వెలగబెట్టటం దేనికి? వాడి తల్లెవరో తెలుసా? తండ్రి ఎవడో తెలుసా?"

"అవి అవసరం అనుకోను."

"ఈ యింటి పరువు ప్రతిష్ఠలు మంటగలిపే అధికారం ఎవ రిచ్చారు నీకు?"

"ఏం? నే నంత నీతిమాలిన పని యేం చేశానని! ప్రేమించటం తప్పా? నీ దృష్టిలో ప్రేమ అనే పదానికి అర్థం యేమిటి? కులగోత్రాలు, వంశ మర్యాదలు దృష్టిలో ఉంచుకుని ప్రేమిస్తేనే అది ప్రేమగా – ప్రేమకు గల అర్థంగా ఒప్పుకుంటావా? పవిత్ర ప్రేమకు మధ్య యీ జాతి మత భేదాల తెరలతో నిమిత్తం లేదు."

"సుధా" రుద్రుడయ్యాడు మాధవ్: "హద్దు మీరి మాట్లాడుతున్నావ్ – ఇన్నాళ్లూ నిన్ను అన్నయ్యగా ఆదరించాను, అభిమానించాను. యీనాడు నీ సంరక్షకుడిగా, హితాభిలాషిగా ఆజ్ఞాపిస్తున్నాను. నువ్వీ యింటిగడప దాటడానికి వీల్లేదు. మళ్ళీ మీ యిద్దరూ కలుసుకున్నట్టు నా దృష్టిలో పడకూడదు. యీ సంబంధం యిక్కడితోనే తెగిపోవాలి."

"అన్నయ్యా" ఎందుకింత కఠినంగా ప్రవర్తిస్తున్నావ్."

"సుధా!"

"ఇది నీకు న్యాయమేనా అన్నయ్యా? నా హృదయా న్నర్థం చేసుకునే అమ్మ నా చిన్నప్పుడే చచ్చిపోయింది. నాన్న అమ్మపోయిన బాధతో పిచ్చివాడైపోయి దేశాలు పట్టాడు. నా హృదయాన్ని యింకెవరిముందు విప్పి చెప్పుకోగలను. అన్నయ్యా? నువ్వా నన్నింత కఠినంగా శిక్షిస్తే – నాకు దిక్కెవరన్నయ్యా?" సుధ కన్నీళ్ళు మాధవ్ హృదయాన్ని కదలించాయ్.

"సుధా! లోకం అంటే ఏమిటో నీకు పూర్తిగా తెలీదమ్మా. సూర్యం మంచివాడు, యోగ్యుడు, బుద్ధిమంతుడు. కాదనలేనమ్మా. ఇన్నిటినీ కాదనే 'వంశ మర్యాద' వాడికి లేదమ్మా. సాంప్రదాయంలేని ఒక కుటుంబంతో మనం చేతులు కలిపితే, కళ్లులేని యీ లోకం నిందలు వేస్తుంది – వెలివేస్తుంది – మన జీవితాలను చీకటి తోవలకు మళ్ళించి బలిచేస్తుంది. సుధా లోకాన్ని కాదని మనబోటివాళ్లు ముందుకు సాగలేరు. నిన్ను సర్వస్వంగా భావించి నిన్ను పెంచిన నాకు నీ కన్నీటిని చూడటం నేను భరించలేనిదే...కాని ఆలోచించు, పూర్తిగా ఆలోచించు. కాకుల్లా పొడిచే ఈ సంఘసంస్కర్తలనోళ్లు మూయించ గల ధైర్యం ఉందనుకుని మన పరువు పందెంగా పెట్టకు. అభిమానించిన అన్నయ్యగా, నీ మంచికోరే అన్నయ్యగా నిన్ను అర్థిస్తున్నాను."

"అన్నయ్యా!"

"ఒకరిమీద నువ్వు పెంచుకున్న ఆశలమూలంగా నా మీది అభిమానాన్ని త్రుంచుకుంటావా? నీమీదే నా మమతల్ని నిలుపుకుని, నాలోని ప్రతి అణువునూ నీ మంచికోసం పంచియిచ్చే నా హృదయాన్ని చిత్రవధ చెయ్యకమ్మా!"

"అన్నయ్యా! ఇంతే నా అదృష్టంగా భావిస్తాను. అన్నగా నువ్వభిమానాన్ని పంచియివ్వలేనప్పుడు నీకోసం, నువ్వు నన్ను పెంచి పెద్దచేశావన్న విశ్వాసంతో నా ఆత్మనే చంపుకుంటాను. బ్రతికి నన్నాళ్ళు కుళ్ళికుళ్ళి ఏడుస్తాను. అంతేగా నువ్వు కోరుకునేది."

"సుధా! నన్నెంత నీచంగా అర్థం చేసుకుంటున్నావమ్మా. నువ్వు మన యింటికి దేవతవు. నువ్వు పుట్టిన్నాడు మనింట్లో యెన్నో శుభాలు జరిగాయ్. ఆశ వదులుకుని భవిష్య త్తేమవుతుం దని సతమత మవుతూండగా అన్యాయానికి పూనుకున్నవాళ్ళు ఓడిపోయారు. మనది అనుకునే ఆస్తి మనకు వచ్చింది. నువ్వు పుట్టిన్నాడే - అన్నయ్య కారోజే ఐ.ఏ.ఎస్.లో సెలక్టయినట్టు టెలిగ్రాం వచ్చింది. అంతకుమించి చావుబ్రతుకుల్లో ఉన్న- వదిన ఆరోగ్యం కోలుకుంది. అందుకే నీకు అంతా ఋణపడి ఉన్నాం. సుధా! నువ్వు లక్ష్మిలా, నిండుగా - హాయిగా - గౌరవంగా ఉండాలి. నీ కాపురము నూరేళ్ళ పంటగా కలకల లాడుతూ ఉండాలమ్మా!"

"కలకల లాడుతుందో, కలగా మిగిలిపోతుందో!" బాధగా అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది సుధ.

మాధవ్ కళ్ళొత్తుకున్నాడు. మాధవ్ హృదయం తీవ్ర సంఘర్షణకు గురి అయింది. సుధ - తన హృదయం, తన ప్రాణం, సర్వస్వం సుధే. 'అన్నయ్యా! యిది చేసిపెట్టు, అది కావా'లని ఏనాడూ తనను అర్థించలేదు. అమ్మా నాన్నా జ్ఞాపకం వచ్చినప్పుడల్లా తన వడిలో తల దాచుకుని ఏడుస్తుంది - అంతలోనే తనెక్కడ బాధపడతానో నని లేని నవ్వు తెచ్చుకుంటుంది. తనమీద సుధకున్న ప్రేమ అవ్యాజమైంది. అనంత



మైంది. అది కోరితే తను ప్రాణా ల్నయినా ఇవ్వాలనుకున్నాడు — కాని...

సూర్యం విషయంలో??? తన మనస్సు వెనక్కు లాగుతోంది. 'వంశ మర్యాద' లను దృష్టిలో ఉంచుకుంటే సుధ కన్యాయం జరుగుతుంది. సుధ, సూర్యంల ప్రేమను త నంగీకరిస్తే లోకం తనను దుమ్మెత్తిపోస్తుంది. తనకూ పెళ్ళికావల్సినఆడపిల్ల లున్నారు. వారి గతేం కావాలి? స్వార్థపడుతున్నా నేమో, ననుకున్నాడు మాధవ్. కాదు యిందులో స్వార్థం లేదు. సుధ జీవి తాన్ని చేజేతులా సూర్యం చేతికి అందివ్వ లేడు తను. రెండు కులాల సంతతి సూర్యం. తనది సత్సంప్రదాయమైన కుటుంబం. యీ రెండిటికి 'పొత్తు' కుదరదు. కుదిరినా లోకం వేసే నింద లను తను భరించలేడు. తనలో లోకా నికి సమాధానం చెప్పే ధైర్యం లేదు. మనసు కలవని దాంపత్యంలో 'సుధ' సుఖపడే దేముంది? అయితే మాత్రం అంతా ప్రేమించె పెళ్ళి చేసుకుంటు న్నారా? పెళ్ళి చేసుకుని ప్రేమించ వచ్చుగా. భర్త ఆదర్శాల కనుగుణంగా నడుచుకోవచ్చుగా. కాని యిది సుధ విష యంలో సాధ్యమేనా? మన సొకచోట, మనువు మరోచోట? సమన్వయం కుదరకపోతే? సుధ జీవితం నరకం అవుతుంది. యీ సమస్యను తను పరిష్క రించలేడు. ఏం చెయ్యాలి? ఎలా నచ్చ జెప్పాలి సుధకు. గడిచిన రోజును ముందుకు రప్పించలేం. అలాగే యిచ్చిన హృదయాన్ని సుధ తిరిగి తీసుకోలేదు. అయినా, త నంగీకరించలేడు యీ వివా హానికి. ఏమైనాసరే సుధ హృదయాన్ని మార్చాలి.

"అన్నయ్యా!" సుధ గొంతు గాద్గది కంగా ఉంది.

"అన్నయ్యా!" మళ్ళీ పిలిచింది సుధ.

ఉలిక్కిపడి సుధ ముఖంలోకి చూశాడు మాధవ్. అతని హృదయం కలుక్కుమంది. శోకదేవతలా సుధ ఎదురుగా నిల్చునుంది. అతని హృదయం చలించిపోయింది.

"సుధా!"

"అన్నయ్యా!"

"నా కెందుకు భగవాన్ యీ పరీక్ష."

"అన్నయ్యా: సూర్యంగారు నీకోసం బయట నిలబడిఉన్నారు."

ఒక్కసారిగా మాధవ్ ముఖంలో రంగులు మారాయ్. ముఖం జేవురిం చింది. చరచర నడుస్తూ బయటకెళ్ళాడు.

"నమస్తే!" నిండైన సూర్యం విగ్రహం మాధవ్‌కు కొత్తకాదు. అయినా అతనితో మాట్లాడటం యిది మొదటిసారి. ఎంతటవాళ్ళనూ 'ఆకట్టే' అతని స్వరంలోని గంభీరతా, ఆప్యా యతా మాధవ్‌ను స్తంభింపజేసాయ్.

"నమస్తే" తిరిగి సూర్యమే అన్నాడు.

"నమస్తే" కొంచెం కంగారుగా

అన్నాడు మాధవ్. అంతలోనే తిరిగి మాధవ్‌లో గంభీరత ఆక్రమించుకుంది.

"మీరు వచ్చిన పని నాకు తెలుసు మిష్టర్ సూర్యం. కాని అది జరిగేది కాదు. మా సుధ తొందరపడి మీ హృదయానికి ఆశలు కల్పించి ఉంటే 'సుధ తరపున' నేను క్షమార్పణ కోరుకుంటున్నాను. మిష్టర్ సూర్యం! మాది సంత్సంప్రదాయమైన కుటుంబం."

"మాధవ్" గాయపడ్డాడు సూర్యం. "యిక చెప్పవద్దు. ఒక వ్యక్తికీ, వ్యక్తిత్వానికీ గౌరవం యివ్వలేని మనుష్యుల మీద నా కెప్పుడూ నమ్మకం లేదు. అది సాంప్రదాయమే కావచ్చు. మనుష్యుల హృదయానికి పర్యాయపదమే కావచ్చు. ఏదైనాసరే, జీవితాలకూ–సాంప్రదాయాలకూ ముడిపెడితే బ్రతుకు దుర్లభమౌతుంది–మాధవ్! సుధంటే నాకెంతో ప్రేమ, అభిమానం. నా జీవిత బాటకు ఆమెను వెలుగుకిరణంగా చేసుకోవాలనుకున్నాను. ఆశలు రేపాను–ఆశాసౌధాలు నిర్మించుకున్నాను, అంతలోనే మాయమవుతాయని అనుకోలేదు. ఒక్కమాట: సుధకు మీరు ప్రేమను పంచియిస్తున్నారు. అన్నయ్యగా. ఆ సుధామృత ధారల్లోనే 'సుధ' పెరిగింది. ప్రేమను పెంచుకోవటమే ఆమెకు తెల్సు తప్ప, త్రెంచుకోవటం తెలియదు. మీ రంగీకరించనప్పుడు మేమే మా హృదయాల్ని రాళ్ళుగా మార్చుకుంటాం. నేను తొందరపడినందుకు విచారిస్తున్నాను. 'సుధ'ను క్షమాభిక్ష పెట్టమని ప్రార్థించానని చెప్పండి. ముందు వెనుక లాలోచించకుండా మీవంటి సత్సాంప్రదాయం గల కుటుంబంలో నా ఆదర్శాల కనువైన ఆమెను ఎంచుకోవటం నాదే తప్పు. ఎందుకంటారేమో? నేను జాతిలేనివాణ్ణి, కులంలేని వాణ్ణి. మనం కల్పించుకున్న కులబేధం యీనాడు మనకే సమస్య'గా నిలబడింది. వస్తాను శలవ్." భారంగా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు సూర్యం. "అన్నయ్యా!" బావురుమంటూ మాధవ్‌ను కౌగలించుకుంది సుధ.

"పరిస్థితులు నన్ను పిచ్చివాణ్ణి చేస్తు



న్నాయ్;" గొణిగాడు బాధగా మాధవ్

*　　*　　*

అబ్బాయ్ మాధవరావూ! యీలాటి విషయాలు యెక్కడ కక్కడ 'కట్' చేసి వెంటనే తేల్చిపారేయాలి తప్ప యిలా నాన్చటం మనకే ముప్పు 'అరి టాకు ముల్లు సామెతలా మన బ్రతుకులే నాశనమౌతాయ్. నీ కెందుకు, అంతా నేను ఏర్పాటు చేస్తాగా. ఓ ఏ భయి మనవి కావనుకుంటే సరి, తతంగం అంతా నేను నడిపిస్తాను

"మావయ్యా!"

"సందేహించకు ఇది ఫలానా విధంగా జరుగుతుం దని మనయిద్దరికీ తప్ప మూడో వ్యక్తికి తెలియదు...... .. ను వ్వీవిధంగా చేస్తే నీమీదకు ఏనిందా రాదు. ఏమంటావ్?"

"యిది ఆత్మద్రోహం అన్పిస్తుంది మావయ్యా!"

"ఇదిగో అబ్బాయ్! ద్రోహంకాదు. మహాపాతకం చేసయినా వంశగౌరవాన్ని నిలబెట్టుకోవటం మన కర్తవ్యం, విధి. రేప్పొద్దుట నీ పిల్లలకు పెళ్ళికావద్దూ. ఫలానావాళ్ళ వంశంలో యిలా జరిగిం దని వేలెత్తిచూపరూ. అదంతా ఎందుకు? మన వంశగౌరవాన్ని దృష్టిలో ఉంచు కుని నువ్వు 'ఊఁ' అనక తప్పదు మన రామావతారం మేనల్లుడు లేడూ 'లింగ రాజు' మెడిసన్ చదువుతున్నాడు. వాడికీ దీనికీ ముడిపెట్టేస్తే సరిపోయె. అవ తారం అన్నా, లింగరాజన్నా, అబ్బాయ్! ను వ్వీ గోతిలో గెంతు' అని నా నోటి మీదుగా విన్నారో చేసితీర్తారంతే ఆఁ"

"సరే మావయ్యా! నీ యిష్టప్రకారం కానియ్ అన్నీ నువ్వే చూసుకో చాలా జాగ్రత్తసుమా!"

"నాకుతెలీదుటోయ్ "మీసం త్రిప్పాడు రాయుడు, మాధవ్‌రావు మేనమామ

*　　*　　*

"అన్నయ్యా!"

"ఏం సుధా!"

"ఈ ఊరొదిలి ఎక్కడికయినా వెళ్ళిపోదాం - ట్రాన్స్‌ఫర్ చేయించుకో అన్నయ్యా"

"సుధా!"

"ఔనన్నయ్యా యిక్కడ నాకు గతంతప్ప మరేదీ గుర్తుకురావటంలేదు ఎటూ నా హృదయాన్ని రాయిగా మార్చు కున్నాను. ఇక్కడి జ్ఞాపకాల బాధల్తో ఉండలే నన్నయ్యా! ఎక్కడికయినా వెళ్ళిపోదాం"

"సుధా! ఎక్కడికి వెళ్ళిపోతాం మనం మారినంత మాత్రాన మన హృద యంలోని జ్ఞాపకాలు మాసిపోతాయా? మన హృదయాన్ని పరిస్థితుల ననుకూ లంగా మల్చుకోవటంలోనే మనం మను ష్యులుగా బ్రతగ్గలం"

"యెందుకింత నిర్దయగా ప్రవర్తి స్తున్నావన్నయ్యా!" బావురుమంది సుధ.

"సరే సుధా, ప్రయత్నంచేస్తాను"

మాధవ్ అక్కణ్ణుంచి కదలిపోయాడు.

"చూశావా సుధా! నువ్వలాటి భ్రష్టుడి కోసం ప్రాకులాడుతున్నావ్. కులం తక్కువ్వాడికి కులం తక్కువ బుద్ధులు కాకపోతే, ఆఁ కుక్కను సింహాసనం మీద కూచోబెడితే మాత్రం..." వస్తూనే మొదలెట్టాడు రాయుడు.

"మావయ్యా!" రాయుడిమాటల్ని మధ్య లోనే తృంచేసి కోపంగా అరిచింది సుధ.

"ఎందుకమ్మా అంతకోపం ఉన్న మాటంటే ... ఆ కాపుసారా అమ్ముతుండే రాజమ్మ – దానికూతురు లేదూ 'సుబ్బి'; దాంతో యీ సూర్యం..."

"మావయ్యా!" సుధ కోపం మిన్ను ముట్టింది. కళ్లు ఎర్రబడ్డాయ్. "నా కేం చెప్పక్కర్లేదు. వెళ్లు మావయ్యా– మీరంతా కలిసి నా జీవితా న్నెందు కిలా చిత్రవధ చేస్తున్నారు? నేను మీ అందరికీ యేమపకారంచేశాను. ఎందుకు నన్నిలా క్షోభ పెడుతున్నారు."

మెల్లగా రాయుడు జారుకున్నాడు అక్కణ్నుంచి. 'వినేవాడికి చెప్పేవా డెప్పుడూ లోకువే,' అని గొణుగుతూ సుధ బాధగా కుర్చీలో వాలిపోయింది.

* * *

ఆరోజు సుధా... మాధవ్ పార్కు కెళ్ళి కూర్చున్నారు. యిద్దరూ మౌనంగా ఎవరికి వారే ఏదో ఆలోచిస్తూ కూర్చున్నారు, దూరంగా.

'క్రోటన్స్' మొక్కలవారస శుష్క వదనంతో కూర్చున్న సూర్యం సుధ దృష్టిలో పడ్డాడు – సుధహృదయం కలుక్కుమంది. అప్రయత్నంగానే ఆమె కళ్ళనుండి కన్నీటిబొట్లు రాలాయ్.

"సుధా!" కంగారుపడ్డాడు మాధవ్.

ఉలిక్కిపడి కళ్లొత్తుకుంది.

"మనశ్శాంతిగా ఉంటుందని యింత దూరం తీసుకువచ్చాను," నేలకేసి చూస్తూ అన్నాడు మాధవ్?

"ఎలా లభిస్తుందన్నయ్యా నా జీవితానికది!" సుధమాటలు మాధవ్ గుండెల్లో శూలపోట్లలా తగిలాయ్.

"సుధా! నన్నపార్థం చేసుకున్నావ్. నీ కంటె అధికంగా నేను కుళ్ళిపోతు



న్నాను. నే నెటూ ఓనిర్ణయానికి రాలేక పోతున్నాను.

"పదన్నయ్యా యింటికి పోదాం."

"అప్పుడే."

"అప్రయత్నంగానే మాధవ్ సూర్యాన్ని చూశాడు. గతుక్కుమన్నాడు. చెల్లెలి మొహంలోకి చూశాడు – సుధ మౌనంగా తలవంచుకుంది.

"అన్నయ్యా!"

"ఏం సుధా!"

"ఒక్క టడగనా ?"

"ఏమిటి ?"

"ఒక్క పదినిముషాలు సూర్యంతో మాట్లాడటానికి అవకాశ మిస్తావా?"

"సుధా యిది పబ్లిక్ పార్క్ అన్న సంగతి మర్చిపోయావా ?"

"అంత ఒక స్నేహితుడిగాకూడా మగవాళ్ళతో మాట్లాడటానికి యిష్టం లేనప్పుడు ఇంట్లోనే కూర్చోబెట్టక ఇలా పార్కులంట ఎందుకు త్రిప్పుతున్నావ్?"

"సుధా!"

"నీ చెల్లెలిమీద, చెల్లెలు హృదయం మీద నీకు నమ్మకం లేదా అన్నయ్యా?"

ఏదో అనబోయాడు మాధవ్.

"పద వెళ్ళిపోదాం," అంటూ దారి తీసింది సుధ

* * *

"అన్నయ్యా, ఒక్కసారి వెళ్ళి చూడనీ అన్నయ్యా. ఆయన పరిస్థితి చాలా ప్రమాదంగా ఉందట.

"నేను చెప్పలేదూ. కాపుసారా అమ్మే వాళ్ళతో తిరిగితే చివరి కెప్పుడో యిలా అవుతుందని. ఏం దౌర్భాగ్యప్పని జేసాడో, చిదగ్గొట్టారు వాళ్ళంతా;" రాయుడు చుట్ట అంటించాడు. వెలుగుతున్న అగ్గిపుల్లవేపు గర్వంగా చూశాడు.

"అన్నయ్యా నేను వెళ్ళాలి; వెళ్తా.

"ఎక్కడికి ?"

"హాస్పిటల్‌కు "

"ఎందుకు ?"

"వారిని చూడ్డానికి."

"వా డేమవుతాడు నీకు?"

"వదిన నీ కేమవుతుందో నేను వారికీ అదే కాబోతున్నాను."

"సుధా!"

"ఏమయినా సరే ?"

"వెళ్ళడానికి వీల్లేదు !"

"ఆమా టనడానికి నువ్వెవరు ?"

"సుధా !"

"నా విషయంలో నీ కధికారం ఎవ రిచ్చారు ? నేను చంటిపిల్లను కాను. మంచి, చెడు, కష్టం, నష్టం నాకూ తెలుసు. అన్నగా నువ్వు అదలించినా, స్త్రీగా నా పట్టుదల నాకూ ఉంటుంది పెంచి పెద్ద చేశావని నీమాటకు, నీకు గౌరవా న్నిచ్చాను. అది అలుసుగా తీసు కున్నావ్. నా జీవితంతోనా అన్నయ్యా నువ్వు చదరంగం ఆడుతున్నావ్ ? పయోముఖ విషకుంభంలాటి మావయ్య మాటలు విని యెంత నీచానికి దిగజారి

పోయా వన్నయ్యా! సూర్యంను కొట్టిం దెవరు? నువ్వు కూలిచ్చి చేయించిన ద్రోహంకదూ. ఇది మావయ్య సలహా మీద నువ్వు చెయ్యలేదూ?

"అదికాదు సుధా!" రాయు డేదో అనబోయాడు.

"నోర్ముయ్. పెద్దవాడివి, నల్గురు పిల్లల తండ్రివి. యిలా అడ్డమైన గడ్డీ కరవకపోతే......"

"కరిస్తే మంత్రంతటి వాణ్ణవుతానని మా మేనత్త చెప్పింది."

"వెళ్లు, ఈ యింటి పరిసరాల్లో యెప్పుడూ కన్పించకు."

"చూడరా మాధవ్!"

"సుధా, హద్దుమీరి మాట్లాడుతున్నావ్."

"అన్నయ్యా! హద్దుమీరి మాట్లాడుతున్నది–పన్లు చేయిస్తున్నది మీరు. మీలో పురుషులనే గర్వం, అహం ఉండొచ్చు. 'స్త్రీ' శక్తిస్వరూపిణి. తెగించకముందే మీ రేం అణగద్రొక్కాలని ప్రయత్నించినా, తెగించిన స్త్రీని – మీ గర్వం, అహం గడ్డిపోచమాత్రం – యేం చేయలేదు."

"వాడు అడ్డమైన కొంపలంటా..."

"ఔను, ఆయన డాక్టరు. జబ్బు ఎవరికొచ్చినా వెళ్ళి మందియ్యటం ఆయన విధి, కర్తవ్యం. మీరు చేయించిన పనికి నేను సాక్ష్యం. నేనే పోలీస్ కంప్లయింట్ యివ్వదల్చుకున్నాను.

'సుధా!' రాయుడూ, మాధవ్ కూడా ఒక్కసారి అరిచారు.

'ప్రేమ' కర్థం, నిర్వచనం మీకు తెలియకపోతే, మీకు కావల్సింది వంశ గౌరవం, పరువు ప్రతిష్ఠలే అయితే– హృదయాల్లోని సున్నిత భావాల పరిపక్వదశలో ఉదయించే 'ప్రేమ'మీద దానికి లతలా అల్లుకుని జీవించే బ్రతుకులమీద మీకు నమ్మకం లేనప్పుడు, ఈ యింట్లో నే నుండలేను." శలవ్. సుధ విసురుగా వెళ్ళిపోయింది.

చైతన్యరహితంగా ఉండిపోయారు మాధవ్, రాయుళ్ళు! ★






[ దేవరాణి వచ్చి విందుకు జగపతిగారియింట్లో అందరినీ ఆహ్వానించింది; కాని జానకి చేసిన హేళనకు చిన్నబుచ్చుకుని వెళ్ళిపోయింది. జానకి ప్రవర్తనకు ఖిన్నులయ్యారు, దేవరాణీ కిరణ్ లు.

తనను కిరణ్ కిచ్చి పెళ్ళి చేయాలనే వుద్దేశంతో తన తండ్రి తనని ఇక్కడ దిగవిడిచి వెళ్ళాడని జానకి తెలిపినమీదట దేవరాణి అవమానానికి గురిఅయి, వెంటనే తన స్వగ్రామం వెళ్ళాలని నిశ్చయించుకుంది. జగపతిగారింట్లో, దేవరాణితో సహా - జానకీ శ్రీరాంలు మినహా - అందరూ ధర్మారావుగారి యింటివిందుకు వెళ్ళారు. ]

— ఇక చదవండి.

ప్రసక్తి వివాహాలపైకి మళ్ళడంతో మెల్లగా దేవరాణీ, ఇంద్రాణీ అక్కడ నుండి జారుకున్నారు – "ఈ పెద్దవాళ్ళ కెప్పుడూ మరో ప్రసక్తి ఉండదు. ఇదే గొడవ," అనుకుంటూ.

సరిగా క్రిందహాల్లో పురుషులమధ్యకూడా అదే సంభాషణ జరుగుతూంది.

చాలా సంభాషణా, పరామర్శలూ జరిగాక ధర్మారాయుడి మిత్రుడైన డాక్టరు అన్నాడు, "ఈ విచారపునీడలు పోయి, యశోదగారి ఆరోగ్యం, మనసూ బాగు పడాలంటే ఒకటే మార్గముంది – రాణికి సాధ్యమైనంత త్వరలో వివాహం చేసేసి, అల్లుడినికూడా కొంతకాలం మీవద్దనే ఉంచుకోవడం."

కొద్దిసేపు ఎవ్వరూ మాట్లాడలేదు.



విచార మందస్వరంతో అన్నాడు ధర్మారాయుడు : "నాకూ అలాగే ఆశగా ఉన్నది, దైవం అనుకూలించాలి మరి."

రాణి హస్తపాకాలనూ, తెలివినీ శ్లాఘిస్తూ అందరూ భోజనాలు పూర్తి కానిచ్చారు. భోజనానంతరం అందరూ తిరిగి హాల్లో కూర్చున్నారు కబుర్లు చెప్పుకుంటూ.

తాంబూలాలు ఇచ్చి వెళ్ళిపోతున్న రాణిని వెనుకకు పిల్చాడు రాయుడు. "నీ వీణ తెచ్చి రెండు పాటలు పాడి వినిపించమ్మా."

"ఇప్పు డెందుకులెండి నాన్నా," అంది రాణి కొంచెం సందేహిస్తూ.

"పాడాలి తల్లీ! నేను నీ గానం విని చాలా కాలమైపోయింది. ముఖం వాచిపోయి ఉన్నాను," అన్నాడు డాక్టరు.

కిరణ్ అభ్యర్థిస్తున్నట్లు అన్నాడు : "పాడితే నేనుకూడా చాలా సంతోషిస్తాను."

ఇహ మారుమాట్లాడకుండా వీణ తెచ్చింది రాణి. క్రింద తివాచీపై కూర్చుని శ్రుతి సరిజేస్తూ ఒక్కసారి అలవోకగా కిరణ్ వైపు చూచింది. మరుక్షణంలోనే కనులు వాల్చేసి చక్రవాకరాగంలో కీర్తన ప్రారంభించింది.

"తిరుమల తిరుపతి రమణా నిన్నూ......"

కిరణ్ ఆనందించాడు; లోలోన మురిసిపోయాడు. తమను మొదటిసారిగా పరిచయంచేసిన పాట; మండువేసవి మధ్యాహ్నం తృషార్తుడైన తనకు నారికేళ

సలిలంలాగా తోచిన మధుర మంజులరాగం; తనను పిలచి నిలిపిన గానం; తనకు తిరిగి తిరిగి వినాలన్పించే స్వరం; నాటినుండీ తన చెవులలో మార్మోగుతూన్న కీర్తన; ఇప్పుడు తాను కోరకుండానే ఆమె పాడ్తూన్నది.

ఆ గానం విన్న అందరూ కూడ తన్మయులై పోయారు. ఇక కిరణ్ పూర్తిగా అందులోనే లీనమైపోయాడు. బాహ్యప్రపంచమే మరిచిపోయాడు.

దేవరాణి గానం ముగించి లేచింది. వీణాతంత్రులింకా గాలికి కదలి నాదం చేస్తూనే ఉన్నాయి. తన్మయత్వంలో నున్న శ్రోతలంతా క్రమంగా తేరుకున్నారు.

"గాత్రంలోని మధురిమా, గానంలోని అపూర్వతా కూడా దైవప్రసాదమే. ఏ పూర్వపుణ్యమో మరి!" అన్నాడు కమాలాకరం ఆనందాతిరేకంతో.

"నిజం రాయుడూ," అన్నాడు జగపతి. "మీ అమ్మాయి బాగా పాడగలదని వినడమే కాని ఇంతవరకూ ఎప్పుడూ వినలేదు. రాళ్ళను సైతం కరగించే గానమని చదివేను – ఈనాడా అదృష్టం కలిగింది ...... ఇక్కడనుండి నిజంగా వెళ్ళాలని లేదు కాని తప్పదు. ప్రొద్దుపోయింది. మరి వెళ్తాం, సెలవు." అంటూ లేచాడు. అందరూ లేచారు.

"వెళ్తాం తల్లీ! కమ్మని భోజనం తినిపించి, తీయనిగానం వినిపించి పంపుతున్నావు," అంటూ ఆప్యాయగా దేవరాణి చుబుకంపట్టి ముద్దు పెట్టుకుంది కమల.

"ఇంత ఉత్తమురాలవూ, తెలివైనదానవూ గనుకనే తల్లిదండ్రులకు అంతగా కంటిరెప్పలై కాపాడుతున్నావు."

"ఏదో నా శక్త్యానుసారం బాధ్యతా. అంతేనండి, పెద్దమాటలు వద్దు," అంది దేవరాణి నమ్రతగా.

"వెళ్తాం మరి."

"మంచిది. నమస్కారమండి. ఇంద్రాణీ, మీరు వస్తూంటారుగా?"

"ఉంటే తప్పక వస్తానండి. వెళ్ళిపోదా మనుకుంటున్నాను. ఒకవేళ వెళ్ళిపోయినా ఉత్తరాలు వ్రాస్తుంటాను. జవా బిస్తారా?" అన్నది ఇంద్రాణి.

"ఓ! తప్పక వ్రాయండి."

జగపతి కుటుంబ సభ్యుల అందరి మనస్సులలో తలొక విధంగా దేవరాణి వ్యక్తిత్వమే నిలచిపోయింది. ఇంటికి తిరిగి వచ్చాక కూడా అందరూ ఆమె విషయమే లోలోన అనుకోసాగారు.

పాలగ్లాసు పట్టుకు వచ్చిన భార్యను ప్రశ్నించాడు జగపతి.

"రాయుడి కూతురు చాలా చక్కటిపిల్ల కదూ!"

# ఒక తరం కథ

ఈనాడు - మనం నివసిస్తున్న యీ కాలం - చరిత్రలో అత్యంత ప్రధానమైనది. నేడు భారతదేశం ఆదర్శవంతమైన అభ్యుదయ పథంలో అతి వడిగా పురోగమిస్తున్నది. ఎదురవుతున్న అనేక జాతీయ, అంతర్జాతీయ సమస్యల్ని అధిగమించి ప్రగతిలోకి ప్రయాణిస్తున్నాం మనం. మనం చేస్తున్న ఈ మహా యాత్ర యొక్క సమగ్రస్వరూపాన్ని తెలుసుకోవాలంటే

సమాచార పౌర సంబంధ శాఖ

ప్రచురిస్తున్న

# ఆంధ్రప్రదేశ్

సచిత్ర మాస పత్రిక

చదవండి

ప్రతినెలా 90,000 కాపీలు అమ్ముడవుతున్నాయి.

విడిప్రతి వెల 30 పైసలు

టి. రామచంద్రరావు,

డైరెక్టరు

సమాచార, పౌర సంబంధ శాఖ

ఆంధ్రప్రదేశ్.

—DIPR

కమల నిండుగా నవ్వింది. ''నేనూ సమంగా ఆ మాటే మీతో అనాలనుకున్నాను సుమండీ!"

"మన కోడలైతే ఎలా వుంటుంది?"

కమల వదనం కలకల లాడిపోయింది. ''దివ్యంగా వుంటుంది. అయినా ఆ పిల్ల కూడ చదువుకున్నది కదా! ఇంతకూ చిన్నబాబు ఇష్టమేమిటో?"

"కనుక్కుందాం. రాయుడు చేస్తూన్న మర్యాదలూ, జరుపుతూన్న తంతులూ చూస్తూంటే మనస్సులో మనపై ఏదో అభిప్రాయ మున్నట్టే వుంది. ఇంతకూ పెద్దబ్బాయీ, కోడలూ ఏమంటారో? ఇలా పిలువు.''

"ఏమండి?" కమలాకరం వచ్చి నమ్రతగా నిల్చున్నాడు. వనజ గుమ్మం అవతలే నిల్చుంది, మామగారికి కన్పించీ కన్పించకుండా.

"దేవరాణిని మన చిన్నబాబుకు చేసుకుంటే ఎట్లా వుంటుందిరా? పిల్లచూస్తే రత్నం, ఆస్తి చూస్తే కొల్లలు. ఇంకెవరూ లేరు."

''అవును, నేనూ అలాగే అనుకున్నాను. ముఖ్యంగా అమ్మాయి చాలా అపురూపమైనది. కాని......" సందేహిస్తూ ఆగిపోయాడు.

"ఊఁ, ఏమిటి?"

"ఏం లేదు......పిల్లకు వున్న ఒక్క తోబుట్టువూ లేకుండాపోయాడు. అంత జయకరమైన జాతకం కాదేమోనని......అంటూంది మీ కోడలు."

తేలికగా నవ్వేశాడు జగపతి. "చాలా అదృష్టవంతురాలు గనుకనే ఆస్తి అంతా ఆ ఒక్కదానికే చెందే అవకాశం ఏర్పడింది. ఆ మేడా, చుట్టూ ఏడెకరాల పొలమూ, బొంబాయిలో పెద్ద నూలు వ్యాపారం. లక్షలమీద సాగుతూందట. అదంతా రాణీకే కదా."

కమలాకరం, కమలా కూడ నవ్వారు.

కమల అన్నది: "మీ రీ ప్రసక్తి ఎత్తినప్పుడే అనుకున్నాను లెండి. మిమ్మల్ని అమ్మాయి కంటె ఆ వెనుకనున్న ఆస్తులు ఆకర్షించి ఉంటాయని. ఎప్పుడూ రూపాయణాలలోనే లెక్కలు,'' అంటూ మళ్ళీ నవ్వింది. కోడలు వనజ కూడ స్పష్టంగా నవ్వడం విన్పించింది.

జగపతి కూడ నవ్వి అన్నాడు: "అవును మరి, డబ్బు తర్వాతనే ఏదైనా. వట్టి అందం, తెలివీ మనల్ని ఉద్ధరిస్తాయా? ఎంత ఆలోచన లేకపోతే ఆస్తిని ఇంత ఉద్ధరించి వృద్ధి చేశాను? పెద్దవాళ్ళిద్దరికీ అలా ఆలోచించేగా చేశాను? ఒకొక్కడు ఒకొక్క లక్షాధికారి! చిన్నబాబుకు కూడ అలాటి సంబంధమే



చేస్తే ఇక నాకు నిశ్చింత. ఓహ్! నా కొడుకులు ముగ్గురూ మూడురత్నాలు! ముగ్గురూ లక్షాధికార్లు!"

"ఇంతకూ చిన్నబాబు అభిప్రాయం తెల్సుకోండే. పథకం పటిష్టంగా వేసెయ్యకండి." అసలు విషయం గుర్తుచేశాడు కమలాకరం.

"అవును. వాడు నా దగ్గర అంతగా మాట్లాడడు. భయమో, గౌరవమో తెలియదు. నువ్వే కనుక్కో. విన్న ఇంద్రాణి ప్రసక్తి వచ్చినప్పుడు చూచావుగా వాడి ధోరణి?" అన్నాడు జగపతి.

"మీ రెవరూ వద్దు. నేను కనుక్కుంటాను," అంటూ వెళ్ళిపోయింది కమల.

## 8

శయ్యజేరి నిద్ర కుపక్రమించడానికి దేవరాణి చేసిన ప్రయత్నం విఫలమే అయ్యింది. ఆలోచనా స్రవంతి అల్లరిగా గంతులువేసి చిలిపిగా కవ్వించసాగింది. ఎవ రీ కిరణ్? ఎందు కితడి రూపం పదేపదే నా కళ్ళెదుట నిలుస్తుంది? అతడి చిరుదరహాసంలో అంత ఆకర్షణేమిటి? అతడి నడకలో, మాటలో, తీరులో ఆ గాంభీర్యం, నిండుదనమూ ఎంత చక్కగా ఉంటాయి! చందమామను మించిన ఆ అందాల మోమును నేను అందుకోగలనా?

'ఏమో! ఆయన మనస్సులో ఇంతకాలం నుండీ ఇంకెవరూ స్థానం పొందకుండా ఉన్నారా? ఆయన అభిరుచు లేమిటో? కాని ఆయన మనస్సులో ఏ మూలనైనా నేను కొద్దిపాటి స్థానం ఆక్రమించ గలిగితే అదృష్టవంతురాలనే అనిపించుతున్నది.

అసలు మా ఇద్దరికీ పరిచయమే చాలా విచిత్రంగా జరిగింది! మండువేసవి


తలనొప్పి
ఎక్కువగా ఉన్నా
తలకేగా!
అమృతాంజనం వాడి
శీఘ్రంగా నివారణ పొందండి
స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తల నొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబాని కంతాకలిపి నెలల తరబడి వస్తుంది
అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిపొందిన నమ్మకమైన గృహౌషధం.
అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.
AMRUTANJAN
Pain Balm
అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు · బొంబాయి · కలకత్తా · ఢిల్లీ
IWT/AM/2015

మధ్యాహ్నం ఆయన తృషార్తులై ఇక్కడికే రావడమేమిటి? ఆయనను ఆహ్వానించటానికే ఇక్కడ సిద్ధంగా ఉన్నట్టు ఆ సమయానికే ఇక్కడ నే నుండడమేమిటి?

'ఆ పాట మరొక్కసారి పాడగలరా?'—ఎంత మర్యాదగా, ఎంత చక్కగా అభ్యర్థించారు! నా గానమంటే ఎంతో అభిమాన మున్నట్టే మాట్లాడుతారు. విందు అనంతరం తన క్లిష్టమైన కీర్తన తా నడగకుండానే పాడినందుకు ఏమనుకున్నారో! ఏమనుకుంటున్నారో!......

*　　　*　　　*　　　*

సరిగా ఆ సమయంలో కిరణ్‌కుమార్ కూడ దేవరాణిని తలచుకు కలవరిగంటున్నాడు.

"ఆహాహా! ఆ దేవరాణి ఎంత ప్రత్యేకమైన వ్యక్తి! ఎంతటి నమ్రత!

ఎటువంటి సౌందర్యం! మరెంత సంగీతం! ప్రశాంత ప్రభాతవేళ నిర్మల సరసులోని అరవికసిత పద్మంవలె నున్న అందాల మోము, కలువ పత్రాలవంటి కాటుక నేత్రాలు—ఎంత నిండుదనం, కళ కాంతులూ మూర్తీభవించి ఉంటుంది! అమ్మ, నాన్నగారు, అన్నయ్య, తలిదండ్రులు—ఆమెను చూచిన అందరూ ముగ్ధులయ్యేవారే! అంతటి ఉత్తమురాల్ని సతీమణిగా పొందగలిగిన పురుషుని జీవితంలో అంతా అమృతవర్షమే.

ఇంట్లో అందరికీ ఇంద్రాణిపై అభిప్రాయమున్నది. ఇంద్రాణీ గుణవంతురాలే. కాని నా కామెపై అటువంటి అభిప్రాయం లేదు. రత్నంవంటి రాణీ ముందు ఎవరైనా దిగదుడుపే......ఇంతకూ నా అభిప్రాయాన్ని ఎలా తెలిపేది? ఎవరికి చెప్పేది? అసలు ఆ రాణీ అభిప్రాయమేమై ఉంటుంది?

ఆలోచిస్తూనే నిదురపోయిన అతడికి కమ్మటి కలలతో తెల్లవారింది. ఆనందంగా ఉల్లాసంగా నిద్ర లేస్తూంటే ఎదురుగా తల్లి సాక్షాత్కరించింది నవ్వుతూ.

"ఇంకా లేవలేదని లేపటాని కొచ్చాను." అంది నవ్వుతూ.

"ఓ. లేచేశానుగా? త్వరగా కాఫీ పట్రా, ముఖం కడిగేసుకు రడీగా ఉంటాను."

నవ్వుతూ వెళ్ళిపోయింది కమల.

"అమ్మాయ్, నువ్వే తీసుకురా, ఓ మంచి మాట చెప్పాలి." అని వెనక నుంచి ఓ గావు కేక పెట్టాడు కిరణ్.

కాఫీ ఉప్మాలు తీసుకువచ్చిన కమల అడిగింది: ''ఏమిటా మంచి మాట?''

''ఊఁ......ఏముంది? ఏం లేదు. ప్రొద్దున్నే నవ్వుతూ నువ్వు దర్శనమిచ్చావు. ఇవ్వాళ నాకు చాలా శుభం జరుగబోతూందనుకుంటున్నాను."

నవ్వింది తల్లి. కూర్చుంటూ అడిగింది. "అయితే నిజంగా శుభవార్త వినాలనుందా? చెప్పనా?"

"ఓ యస్!" మొదట్లో ఉత్సాహంగా అనేసి మళ్ళీ మరు నిముషంలోనే వెనుదీశాడు. ''ఏమిటది? మొన్నటి విషయం కాదుగదా?" అన్నాడు బెదుర్తూ.

నవ్వింది కమల. "ఏమిటా కుఱ్ఱతనం మాటలు? కూర్చో. మాట్లాడాలనే వచ్చాను. అది కాదు కాని అటువంటిదే మరొక సంగతి.''

''చచ్చాం." నిస్పృహగా కూలబడ్డాడు కుర్చీలో.

కొంచం చిరుకోపం ప్రదర్శించింది కమల. ''అటువంటి అపశకునం మాటలూ, ధోరణీ వద్దు. పెద్దమనిషి తరహాగా ఉండమని చెప్పాగా?''

''కోపగించుకోకమ్మా. నే నెంత పెద్దమనిషినో నీకు తెలియదు. నువ్వు అమ్మవు గనుక నీ దగ్గరిలా ఉంటానుగాని, నిలువెత్తు ధనం పోస్తే మాత్రం నేను ఇతరుల దగ్గ రిలాఉండనే?''

"మంచివాడవే కాని, ఇంద్రాణిని వద్దన్నావు; పోనీ అస లింకెవరైనా ఉన్నారా నీ దృష్టిలో?" సూటిగా అడిగేసింది కొడుకు ముఖంలోనికి పరీక్షగా చూస్తూ.

కిరణ్ అల్లరంతా క్షణంలో మాయమైపోయింది. గంభీరంగా నేలవైపు చూస్తూ మౌనంగా ఊరుకున్నాడు.

"రాయుడుగా రమ్మాయిని చూచావు కదూ నిన్న?"

వింటూనే కిరణ్ మనస్సు ఉరకలు వేసింది. వదనం విప్పారింది. 'నిన్న చూడడమేం? వస్తూనే చూశాను, మొదటి రోజునే' అనబోయి మళ్ళీ తమాయించుకుని వెనక్కి తీసుకున్నాడు. గంభీరంగా నవ్వి ఊరుకున్నాడు.

"అమ్మాయి చాలా సౌమ్యురాలు, సౌందర్యవతి, గుణవతి. మన ఇంటికీ, నీకూ అన్నివిధాలా తగిన దని మేమందరం అనుకుంటున్నాం."

ఈసారి మాట్లాడలేదు కిరణ్. వింతుగా నవ్వాడు.

"అయితే అంగీకారమే నన్నమాట! మీ అన్నగారికి చెప్తాను." తృప్తిగా నిట్టూర్చుతూ లేచింది కమల, కుమారుని వదనంలోని ఆనంద, దరహాస చంద్రికలను ఆనందాప్యాయతలతో తిలకించుతూ.

"ప్రొద్దున్నే పీ శుభసాక్షాత్కారమైన దని ముందే చెప్పానుగా?" అని నవ్వి స్నానానికి వెళ్ళిపోయాడు కిరణ్.

అతని శరీరమైతే తప్పనిసరిగా భూమిమీదనే నడుస్తున్నది కాని మనస్సు వైజయంతీ సీమలలో విహరిస్తున్నది; అచ్చరలతో ఆడుకొంటున్నది. 'ఈ ప్రయాణం తన జీవితంలో ఒక మరపురాని మధురఘట్టాన్ని రచించింది. హృదయంలో ఒక మధురకావ్య ప్రతిష్ఠ చేసింది. మనస్సున మంజుల రాగాంకురం వేసింది. ఎదలో మృదులమైన ఆశలు ఉరక లెత్తుతున్నాయి. భగవన్నిర్ణయ మెట్లున్నదో!'

# 9

జగపతివంటి వ్యక్తి మనస్సులో అభిప్రాయమంటూ కలగాలేకాని, ఆచరణకు సాధారణంగా ఆటంకాలు ఏర్పడవు. ఉభయ కుటుంబాల సాంప్రదాయాలూ, అంతస్థులూ, ఆస్తిపాస్తులూ, పెద్దల—పిన్నల ఆశలూ, అంతరంగాలూ కూడ దైవికంగా కలియడంతో క్షణాలలో వివాహం నిశ్చయమైపోయి, దగ్గరలో నున్న శుభముహూర్తాన తాంబూలాలు తీసుకోవడంకూడా నిశ్చయమైపోయింది.

"ఎప్పుడు రమ్మని వ్రాసినా వచ్చేవాడుకాదు, పల్లెటూళ్ళో తోచదని. ఇప్పుడు దైవమే వాడి కాబుద్ధి పుట్టించినట్టున్నాడు. లేకుంటే తనంతతాను సెలవుపెట్టి రావడ మేమిటి—ఇలా రాగానే అలా వివాహం కుదిరిపోవడమేమిటి?" అన్నాడు జగపతి ఆనందంగా, స్వజను లందరిమధ్యనా సుఖాసీనుడై.

"నిజమే," అన్నది కమల. "రాయుడిగా రీఊరు వచ్చి ఎడెనిమిది నెలలైంది. దేవరాణిని చూస్తూనేఉన్నాం. అయినా మన కీ ఆలోచన ఎప్పుడూ రాలేదు."

గర్వంగా, ఠీవిగా నవ్వాడు జగపతి. "నాకు ఉంది లోపల. రాయు డిక్కడికి వచ్చిన మొదటిలోనే నా కాఊహ కలిగింది. అయినా అటుపక్షంనుండి ఆహ్వానమూ, సంప్రతింపులూ ప్రారంభమయ్యేవరకూ ఎదురుచూస్తూ వచ్చాను. అందుకే చిన్న

బాబు ఇంద్రాణిని వద్దన్నప్పుడుకూడ నే నేమీ బాధపడలేదు. నాకీ ఆశ బలంగా ఉండనే ఉంది."

"ఎంత లోతుగుండె నీది ?" ఆశ్చర్యం ప్రకటించింది కమల.

కమలాకరం నవ్వాడు. "చిన్నబాబు తిరస్కరించగానే నాన్నగారు తారాపథానికి లేస్తారనుకుని భయపడిన నేను ఆయన ప్రశాంతంగా ఊరుకోవడం చూచినప్పుడే అనుకున్నాను, ఆ మౌనంవెనుక ఏదో పటిష్టమైన పథకం ఉండిఉండాలని !"

"అంతేరా మరి !" గుంభనంగా నవ్వాడు జగపతి, "మాటలలలో దొరక కూడదు, చేతలలో లాభసాటిగా ఉండాలి; చూచి నేర్చుకోండి. ఎల్లకాలం. ఆపైన ఎవరు చూస్తారు ? కలకాలం ఫలానా జగపతిగారి అబ్బాయిలు — జగపతివర్మగారి వంశం అని పదిమందీ చెప్పుకోవాలి మెప్పుగా. అప్పుడు నాకు నే నుంటానా ? మిమ్మల్నిలా అభివృద్ధి చేసిపోతాను, నేను వున్నంతకాలం ఎక్కడున్నా సుఖం, శాంతీ, సంతోషం !

"ఏమోనాన్నా, నా కేం బాగుండలేదు." శ్రీరాం అన్నాడు. "పాపం మా మామగారు చిన్నబుచ్చుకు వెళ్ళారు. ఒక్క చదువుమినహా ఇంద్రాణికీ రాణికీ ఎందులో తేడా ? కావలసినవాళ్ళను నిరుత్సాహపరచి, దూరం చేసుకోవడం నా కేం నచ్చలేదు."

జగపతి ఏమో అనేలోగా కమలాకరమే సమాధానం చెప్పాడు తమ్ముని మాటలకు. "బాగుంది. ఇక ఇంద్రాణికి పెళ్ళి కాదనే బెంగా. కేవలం కొలతలకో, పోలికలతో అంచనాలువేసి నాణ్యప్రమాణాలు నిర్ణయించడానికి ఇదేమీ నిర్జీవపదార్థాల బేరసారం కాదు. మనసుల కలయికా, హృదయస్పందనా ఒక్కోవ్యక్తి విషయంలో ఒక్కొక్క మాదిరిగా వుంటాయి."

"మనకు మన తమ్ముడికంటె ఇతరులు ప్రధానంకాదు."

తన గదిలోనుండి అన్నీ వింటూన్న కిరణ్ మనఃపూర్వక భక్త్యంజలి ఘటించాడు, కృపామయుడైన ఆ పరమేశ్వరునికి, అందరినీ మెప్పించగల హంగులతో దేవరాణిని జన్మింపజేసినందుకు.

'ఇక ఏమైనా దేవరాణి నాది !' అనే తృప్తితో హృదయం నాట్యం చేసింది.

(సశేషం.)

Printed and Published by Sri A. Sudhakar Rao for Yuva Concerns
at Yuva Press, Hyderabad-1. Telephones, 36336, Press, 34400
Controlling Editor: Sri "CHAKRAPANI"

